The Largest Circulated Telugu Monthly

# చతుర

మార్చి 1990 రూ. 4/-





# ఆ తీవ్రమైన తలనొప్పికి కావాలి అమృతాంజన్ స్ట్రాంగ్

పగిలిపోయే తలనొప్పులకి, తట్టుకోలేని వెన్ను నొప్పులకి మరియు బెణుకులకి కావాలి అమృతాంజన్ స్ట్రాంగ్ — విశ్వసనీయమైన అమృతాంజన్ సంస్థ నుంచి తెల్లని బామ్. దీని వెనుక నొప్పులకి సురక్షితంగానూ, త్వరగానూ ఉపశమనం కలుగచేసే సుమారు నూరు సంవత్సరాల అనుభవం వుంది.






**అమృతాంజన్**
**స్ట్రాంగ్**

భరించలేని నొప్పులకు, బాధలకు

అమృతాంజన్ లిమిటెడ్

# అల్పాహారానికి ప్రియ తోడు-
# అద్వితీయమైన
# రుచులు జోడు!

ఎప్పుడైనా, ఎక్కడైనా... ప్రియ!

ఉదయం, మధ్యాహ్నం, రాత్రి -
ఏ వేళప్పుడయినా సరే,
అల్పాహారం, భోజనం, ఉపాహారం - ఏదైనా సరే,
ఇంటా బయటా - ఎక్కడైనా సరే,
ప్రియ పచ్చళ్లుంటేనే అది బహురుచికరం!

నవకాయ పిండి వంటలెన్నున్నా
ప్రియ పచ్చళ్లతోనే భోజనం పరిపూర్ణం!

మీ పళ్లెంలో ప్రియ ఉంటేనే మీకు
సంతృప్తి సంతుష్టి!!

**ఎంతో రుచి... ఎంతో రుచి...**

# ప్రియ

మామిడి • నిమ్మ • గోంగూర • అల్లం • టొమాటో
పండుమిరప • పచ్చిమిరప • మిక్స్‌డ్ వెజిటబుల్.
పచ్చళ్లన్నీ వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ లభిస్తాయి.

B. KOTESWARA RAO.
EENADU AGENT
H. B. Colony, SRIKAKULAM
At: Sarangadola Street




ఉషోదయ
ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్
(ప్రియ ఫుడ్స్ డివిజన్)
ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాదు -500482.

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---------- కూపన్ ----------

**మార్చి 'చతుర' నవల అమృతబిందువు**

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# రచయితలకు సూచనలు

ప్రచురించే ప్రతి నవలకు రు.2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో వారివారి దస్తూరినిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# సంస్కారి




“చెప్పండి.... ఆగిపోయారేం?” కళ్యాణ్ అన్నాడు.

రజని ఏం మాట్లాడలేదు. తలవంచుకొని గడ్డివరకలతో మౌనంగా ఆడుకుంటోంది. ఆమె వాలకం చూస్తుంటే ఏదో చెప్పాలని వచ్చి, ఎలా చెప్పాలో అర్థంకాక ఆలోచిస్తున్నట్లుగా అన్పించింది కళ్యాణ్ కి.

“చెప్పండి రజనీ.... నాదగ్గిర మొహమాటమెందుకు? మీకోసం ఏం చేయమన్నాచేస్తాను. చివరికి ప్రాణాలిమ్మన్నా నవ్వుతూ ఇచ్చేస్తాను....”

“ఎంతమాట.... అలాంటిపని మాత్రం చేయకండి” మెల్లగా అంది రజని.




రజని ఓమోస్తరు అందగత్తె. కన్నవాళ్లెక్కడో దూరంగా పల్లెటూళ్లోఉంటే బతుకు తెరువు కోసం పొట్టచేత బుచ్చుకుని ఒంటరిగా ఆ నగరానికి చేరుకుందామె.

ఎలాగో తంటాలుపడి ఓ చిరుద్యోగం సంపాదించుకుని, వర్కింగ్ ఉమన్స్ హాస్టల్‌లో ఉంటూ రోజులు వెళ్లబుచ్చుతోంది.

కళ్యాణ్ ఆమెకోనాడు బస్‌స్టాప్‌లో తారసిల్లాడు. ఆమె ప్రక్కనే నిలబడి ఏదో పుస్తకంలో మునిగిపోయినట్లు కన్పించాడు. అందరు ఆకతాయిల్లాకాక, ప్రక్కన ఆడపిల్ల ఉన్నదన్న స్పృహేలేకుండా అతనలా పుస్తక పఠనంలో మునిగిపోవడం రజనికి ఆశ్చర్యం కల్గించింది. మంచి బుద్ధిమంతుడని సంతోషించిందామె మనస్సులోనే.

ఇంతలో ఆమె ఎక్కాల్సిన బస్ రావడంతో గబగబ నాలుగడుగులు ముందుకువేసింది రజని.

అయితే "మిస్....సారీ! మేడమ్... మేడమ్" అంటూ ఎవరో పిలవడంతో వెనక్కు తిరిగి చూసిందామె.

అతనే! నవ్వుతూ "మీకర్చీఫ్..." అంటూ అంతవరకూ ఆమె నిలబడిన చోట చూపించాడు. అక్కడెవరిదో కర్చీఫ్ నేలమీద పడిఉంది.

"అది నాది కాదండీ..." చిరునవ్వు నవ్వుతూ బస్సెక్కింది రజని.

"ఓహో అలాగా! మీదే అనుకున్నాను..." అంటూ అతనూ అదే బస్ ఎక్కాడు.

ఆ తర్వాత ఇద్దరూ అదే బస్‌స్టాప్‌లో నాలుగైదుసార్లు కలిశారు. 'హలో' అంటూ విష్ చేసుకునేదాకా వచ్చింది పరిచయం.

"చెప్పు రజనీ... చెప్పడంకాదు.... ఆజ్ఞాపించు! నీకోసం ఏం చేయడానికైనా సిద్ధంగా ఉన్నాను." గంభీరంగా అన్నాడు కళ్యాణ్.

తానామెకు అత్యంత ఆప్తుడనని అర్థంకావడంకోసం కావాలనే సంబోధనలో ఏకవచనాన్ని ప్రయోగించాడు కళ్యాణ్

అసలు ప్రేమ సంభాషణలతో ఆమెని సమ్మోహపరిచి మెల్లిమెల్లిగా ముగ్గులోకి దింపాలన్నదే కళ్యాణ్ లక్ష్యం. అందుకే అనునయిస్తున్నట్లుగా ఆమె భుజంమీద చెయ్యివేసి మెత్తగా నొక్కాడు.

రజని కొంచెం దూరంగా జరిగింది.

తొందరపడకూడదు అసలుకే మోసం వచ్చేలా ఉంది అనుకుంటూ తనని తాను సంబాళించుకున్నాడతను.

"సారీ... తప్పుగా ప్రవర్తించానా?"అన్నాడు అపాలజీ చెబుతున్నట్లు.

"లేదు...లేదు" అన్నదామె.

ఆమెగొంతు మామూలుగా ఉండడంతో తన చర్యల్ని అపార్థం చేసుకోలేదని సంతోషించాడతను.

"మరేం కావాలో అడగండి..." అన్నాడు ఉత్సాహంగా.

"మీరేం అనుకోరుగదా?" సందేహపడింది రజని.

"అనుకోవడమా? భలేవారే... ఆజ్ఞాపించమంటుంటే..."

సిగ్గుపడుతూ తలవంచుకుని చెప్పింది రజని.

"ఏం లేదు... నాకు అర్జంటుగా పుల్లటివేవైనా తినాలన్పిస్తోంది..."

నోరు తెరిచాడు కళ్యాణ్ ఆశ్చర్యంగా.

"పుల్లమామిడికాయలు గానీ... చింతకాయలు కానీ అర్జంటుగా తినాలన్పిస్తోందండీ తెచ్చిపెడ్తారా?"

కళ్యాణ్ ఏం మాట్లాడలేదు.

తలెత్తకుండా ఆమె మళ్లీ అంది.

"....ఆమధ్య మా బావ వచ్చి హోటల్‌లో.... ఎంతవద్దన్నా వినకుండా.... అయినా కాబోయే శ్రీవారేలెండి..."

అతనేం మాట్లాడలేదు.

తలెత్తి అతని ముఖంలోకి చూడాలంటే ఆమెకు తగని సిగ్గుగా ఉంది. అందుకే వంచిన తలెత్తకుండా గడ్డిపరకల్ని పీకుతూ మెల్లిగా అంది.

"...అవి నాకెక్కడా దొరకడం లేదు మార్కె ట్లలో... ఎవర్నయినా అడిగితే ఏమనుకుంటారో నని భయం... ప్లీజ్... కాస్త అవి సంపాదించి పెడుదురూ... మీలాంటి ఆత్మీయుల్ని అడిగితే కాదనరనీ... ఏమనుకోరనీ..." అంటూ తలెత్తి చూసింది రజని.

అక్కడ కళ్యాణ్ లేడు. ఎప్పుడు పారిపో యాడోమరి!

తృప్తిగా నిట్టూర్చింది రజని. కొన్ని నిము షాల తర్వాత తనూ లేచి మెల్లగా హాస్టల్ వైపు దారి తీసింది.

తన వాలకాన్ని రెండోసారి పార్కు కి వచ్చినపుడే గ్రహించిందనీ అందుకే బావ పేరుతో తనని ఈజీగా వదిలించేసుకుందనీ కళ్యాణ్కి మరో ఏడాది తర్వాత గానీ తెలి సిరాలేదు.

ఆమెకోసం అనవసరంగా ఆనాడు తన ఎనిమిది రూపాయల కర్చీఫ్ పారేసుకు న్నందుకు మాత్రం అతడిప్పటికీ బాధపడు తూనేఉన్నాడు.

-ప్రతాపచంద్ర

## పెద్దమనుషులు

బస్స్టాప్ దగ్గర నిల్చున్న పాపారావ్ గుర్నాధంవైపు చూసి ఆశ్చర్యపోయాడు. తరువాత చిన్నగా నవ్వుకొని 'ఓ ఆట ఆడిస్తే పోలా' అనుకుంటూ గుర్నాధం దగ్గరకొచ్చాడు.

'హల్లో'

అతని వేపు చూసిన గుర్నాధం 'ఇతణ్ణి ఎక్కడా చూసినట్లు లేదే..' అని మనసులో అనుకున్నాడు.

అతడి ఆలోచనల్ని గ్రహించిన పాపారావ్: 'నన్ను మీరు గుర్తుపట్టలేదా సార్..' అన్నా డు వళ్ళు ఇకిలిస్తూ సంకోచంలో పడ్డ గుర్నా ధంతో..

'నిన్న గుడిదగ్గర మీరు నన్ను చూసి వుంటారు సార్..'

'గుడి' అన్నపదం చెవిలోపడగానే గు ర్నాధం గాభరాగా కాళ్ళవంక చూసుకొన్నాడు!

గుర్నాధం పరిస్థితిని చూసిన పాపారావ్కి హుషారు రెట్టింపు అయ్యింది..

'ఏంసార్... మాట్లాడకుండా తలదించుకు న్నారు?' అడిగాడు పాపారావ్.

'అబ్బే ఏమీలేదు..' పైకి నవ్వినట్లు నటించ బోయాడు గుర్నాధం.

'అయినా మీకు అదేంబుద్ధిసార్, నిన్న మీ రు చేసిన వెధవ పనేం బాగోలేదు'అన్నాడు పాపారావ్.

గుర్నాధానికి ఒక్కసారిగా వళ్ళు మండిపో యింది. మెత్తగా వుంటే వీడు తనని ఇలానే వేధించుకుని తింటాడు... డబాయిస్తే పోలా... అనుకొని..

'ఏ వెధవ పని?..' ధైర్యాన్ని కూడగట్టుకొని కాస్తగట్టిగానే అడిగాడు గుర్నాధం.

ఒక్కసారిగా గుర్నాధంలో వచ్చిన మార్పుకి పాపారావ్ కాస్త ఆశ్చర్యపోయాడనే చెప్పాలి. అయినా గుర్నాధాన్ని వదలిపెట్టదలచుకోలే దు..

'ఏ వెధవ పనేటండీ బాబూ.. ఆ వెధవ పనే..'

కాళ్ళవంక చూపెడుతూ అన్నాడు పాపా రావ్.

'సూటిగా మాట్లాడతారా లేదా?' చిర్రెత్తుకు పోయే కోపంగా అన్నాడు గుర్నాధం.

వెంటనే 'ఎందుకండీ అంత కోపం.. సిగ్గులే కపోతేసరి- నిన్న మీరు గుడి దగ్గర నా చెప్పులు..'

అసలు విషయం గ్రహించిన గుర్నాధం, పాపారావ్ నోరు మూసేస్తూ..

'నేను పూర్తిగా చెప్పేది వినండి.. అసలు విషయం ఏమిటంటే..'

కాని పాపారావు వినిపించుకోక.. గుర్నాధం చేతుల్ని విదిలించేసాడు.

సరిగ్గా ఆ టైమ్లో గుర్నాధం దృష్టి పాపా

రావ్ కాళ్ళపైపడి ఆశ్చర్యపోయాడు! ఇంతవరకూ అతని చెప్పులు చూడనందుకు తనని తాను తిట్టుకొని కోపంగా అన్నాడు.

'యు ఈడియట్ .. దొంగరాస్కెల్..నా కాళ్ళ జోళ్ళు కాజేసింది చాలక.. ఈ జోళ్ళు కూడా నీవంటావా?.. జోళ్ళు పోయి ఎలారా దేవుడా అని నన్ను ఏడవమని చెప్పి ఈ వెధవ చెత్త జోళ్ళు అక్కడ వదిలేసిపోతావా? ఈ వెధవ జోళ్ళు బెడద వదిలిపోయింది..' అంటూ జోళ్ళు వదిలేసి పాపారావ్ షర్ట్‌కాలర్ పట్టుకున్నాడు.

'వదులు, నా కొత్తజోళ్ళు..' అంటూ హుంకరించేనరికి. ఒక్కసారిగా పాపారావ్ నీరుకారిపోయి మనసులోనే అనుకున్నాడు.

'చేసిందే వెధవపని..పైగా ఎవరో తన జోళ్ళు కాజేసారని వాణ్ణి ఏడిపించాలనే తలంపు రావడం నిజంగా తనకి మంచి శాస్తే జరిగింది. తనని తాను తిట్టుకుంటూ .. పాపారావ్ ఆ కొత్తజోళ్ళు గుర్నాధానికి వదిలి.. తన పాత జోళ్ళను వేసుకుని జారుకున్నాడు!

-టి.వెంకటేష్







# "ఉద్యమం" నవలపై సమీక్షలు

జనవరి 'చతుర'లో ప్రచురితమైన వివినమూర్తి నవల 'ఉద్యమం'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## చక్కటి విశ్లేషణ

**ప్రథమ బహుమతి**

***రూ. 100/- లు పొందిన సమీక్ష***

"ఉద్యమం" నవలలో రచయిత వివినమూర్తిగారు ఉద్యమాల తీరుతెన్నులను అన్నికోణాల్లో చక్కగా విశ్లేషించారని చెప్పవచ్చు. "వాను ఇంటినుండి వెళ్ళడం"అన్న విషయాన్ని తీసుకుని- విద్యార్థుల జీవితాలతో విశ్వవిద్యాలయాలు, పరీక్షాధికారులు ఎలా ఆడుకుంటున్నారో వివరించారు. సదాశయంతో విద్యార్థులకోసం ఉద్యమాన్ని ప్రారంభించి దాని విజయంకోసం వేణూ వర్గ తాపత్రయం అతి చక్కగా వివరించారు. కాని వేణూలాంటివాళ్ళు నేటి విద్యార్థి నాయకుల్లో బహుస్వల్పం.

ఆచి, తూచి, ఆలోచించి అందరినీ కలుపుకొని ఉద్యమాన్ని నడపాలని భావించే వేణులాంటి వ్యక్తులు ఉద్యమాలకు పట్టుగొమ్మలనవచ్చును. ప్రతి విషయాన్ని లోతుగా ఆలోచించడం, విశ్లేషించి చూడటం మొదలైన లక్షణాలన్నీ వేణు పాత్రలో ప్రతిబింబిస్తాయి. కపటం భేషజం, యువతపట్ల సరైన అవగాహనలేని తొందరపాటు వ్యక్తిగా రాజును, భూషణంలాంటి గోడమీద పిల్లిలాంటి వ్యక్తుల్ని రాధలాంటి వ్యక్తిత్వంగల ఆడపిల్లలను ప్రతినిత్యం చూస్తుండే ఉంటాం. ఆదర్శ, ఆవేశభావాలు కలబోసిన వ్యక్తి రమ. నిరంజనశర్మలాంటి తండ్రులు పిల్లల్ని ఎంత చక్కగా తీర్చి దిద్దుతారో తెలుస్తుంది.

వేణు పాత్రతో దీటైనది సీతారాం పాత్ర. బిడ్డలపట్ల శ్రద్ధ, వారి ప్రవర్తనపట్ల అవగాహన, ఆలోచన, యువతపట్ల సానుభూతిగల మంచి వ్యక్తిత్వం, హేతువాద భావనలు కలవాడిగా సీతారాం కనిపిస్తారు. ఒక వంక విద్యార్థుల సమస్యలు, మరోవంక విద్యావిధానంలో లోపాలు, ఇంకోప్రక్క తల్లిదండ్రుల ఆరాటం, ఆపైన భరద్వాజలాంటి అధికారుల ఆలోచన ఇవన్నీ నవలలో చక్కగా విశ్లేషింపబడ్డాయి. వేణూని ఉద్యమంనుంచి తప్పించడానికి, సీతారాం ఆలోచన, దానికి వేణూ సమాధానం చాలా బావుంది. ప్రిన్సిపాల్, వైస్‌ఛాన్సలర్, విద్యా, ముఖ్యమంత్రుల పాత్రలు చక్కగా ఉన్నాయి. సంభాషణలు పాత్రలకు తగ్గట్లురాశారు రచయిత. "లక్ష్యమెంత ఉదాత్తమైనా, విధానం నీచం కాకూడదు." అలాగే "ఎలా తెలుస్తుంది సరైన సొపానం లేకుండా" వంటి వేణు మాటలు ఉదాహరణలు.

ఐతే కొన్నిచోట్ల వివరణలు, విశ్లేషణలు సాగదీసినట్లుగా ఉన్నాయి. నేటి సగటు పాఠకులకు ఇవి మాత్రం విసుగ్గా ఉండవచ్చు. ఈ నవల ఆలోచించే మనస్సు, అర్థం చేసుకునే స్థాయి ఉన్నవాళ్ళకి చాలా బావుంటుంది. ఇటువంటి నవలను రాసిన రచయిత, ప్రచురించిన 'చతుర' అభినందనీయులు.

— *బి.రాంబాబు, రంపచోడవరం*

ముఖచిత్రం: ఉదయభాస్కర్

## చీకటి వెలుగుల మధ్య....

### ద్వితీయ బహుమతి

### రూ. 75/-లు పొందిన సమీక్ష

ప్రస్తుత విద్యావిధానంలోని అవకతవకల సవరణకై ఆశయస్ఫూర్తితో ప్రారంభమైన ఓ ఉద్యమం ఎన్నో మలుపులు తిరిగి చివరికి రాజకీయ వికలుషితమై ఎలా ముగిసేది అత్యంత సహజంగా కళ్ళకు కట్టినట్టు చిత్రీకరించే ప్రయత్నమే 'ఉద్యమం'. నవల చదూతున్నంతసేపూ, చదివిన తర్వాత రచయితకు తాను చెప్పదల్చుకున్న అంశంపై పూర్తి పరిజ్ఞానం ఉన్నట్టు స్పష్టంగా తెలుస్తుంది.

నవలకు ప్రాణం పాత్రచిత్రణ. వివినమూర్తి ప్రతిపాత్ర చిత్రణలోనూ ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. పాత్రల్ని పరిచయం చేసేటప్పుడే, తేలిగ్గా ఆ పాత్ర స్వభావాన్ని పాఠకులకి తెలియజెప్పడం. ప్రతిపాత్రకీ దాని ప్రత్యేకతను సమకూర్చడం, ఒకదానికొకటి సంబంధంలేని రకరకాల మనస్తత్వాలున్న పాత్రల్ని సృష్టించడం, పాత్రల ఆత్మగత విషయాల ద్వారా వాటి వైవిధ్యాన్ని పాఠకుల ముందుంచడం- ఇవన్నీ రచయిత పాత్రచిత్రణా దక్షతని నిరూపిస్తాయి. మధుని పరిచయం చేసే పద్ధతి, డియ్యస్పీ మూర్తి వ్యక్తిగత జీవిత చిత్రణ, సీతారామ్ మనస్తత్వ వ్యక్తీకరణ, వేణు పోరాట విధానం, రాజు వాక్చాతుర్యం, స్వరాజ్యవతి రాజకీయ కు(టి)లత... ఇలా అన్ని పాత్రలూ ప్రత్యేకంగా ఉన్నాయి. ముఖ్యంగా సీతారాం పాత్ర విషయంలో రచయితకున్న శ్రద్ధ, సామాజికావగాహన తేటతెల్లమవుతాయి.

పాఠకులకెన్నో విషయాల్ని గురించిన పరిజ్ఞానం కలిగించి, వాళ్ళని బాగా ఆలోచింపజెయ్యాలన్న రచయిత తపన ప్రత్యక్షరంలోనూ గోచరిస్తుంది. అయితే కొన్నిచోట్ల ఔచిత్యం లోపించింది- కొడుకు దూరమైన బాధతోవున్న సీతారాం చేత వేణు చందాలు కట్టించడం; ప్రిన్సిపాలు సీతారాంని తన సొదతో (అందులో నిజమున్నా...) ఇబ్బంది పెట్టడం; ఎంతో సంస్కారవంతుడైనసీతారాం కేవలం పేపర్లో నంబరు కనిపించలేదని కొడుకుని తిట్టడం; యూనివర్శిటీకీ, ఇంటర్మీడియట్‌కీ సంబంధం పెట్టడం (ఇంటర్మీడియట్‌కి ప్రత్యేకమైన బోర్డు వుంది గదా?) అసహజంగా ఉన్నాయి.

భాషా విషయకంగా రచయిత చాలాచోట్ల కృతకపదాల్ని విలక్షణ వాక్యాల్ని ప్రయోగించినా కథాకథనంలోగాని, సంభాషణా రచనలోగాని ఎక్కడా ఇబ్బంది కలిగించకపోవడం హర్షణీయం. ఏదిఏమైనా ఒక సమస్యని పలుకోణాల్లోంచి చూస్తూ, వివిధ అంశాల్తో ముడివేసి రచనని నడపడం వల్ల దీనికి మంచి విలువవచ్చింది. జాగ్రత్తగా చదివితే తప్ప నవలలో రచయిత చెప్పదల్చుకున్న అసలు విషయం అవగాహనకు అందదు. కారణం ఈ నవల ఈనాటి కాలక్షేపం సీరియల్స్ లాంటిది కాదు గనుక.

— సి.అంజిబాబు, తిరుపతి

## చదవాల్సిన నవల

### తృతీయ బహుమతి

### రూ. 50/-లు పొందిన సమీక్ష

స్టేట్‌ఫస్టో, డిస్టింక్షనో వస్తుందని ధీమాగా చెప్పి ఆ తర్వాత పేపర్లో నంబర్ కన్పించని విద్యార్థులు ఎస్సెస్సీ, ఇంటర్, డిగ్రీ ఇలా అన్నితరగతులకీ ఫలితాలు వెలువడినపుడు ప్రతి ఏడాదీ మనకు కనబడ్తారు. 'ఉద్యమం' నవలలో వాసూ కూడా అలాంటివాడే.

వాసూ స్నేహితుడైన వేణు, వాసులా యూనివర్శిటీ అధికారుల బాధ్యతారాహిత్యానికి సరైన ఎందరో విద్యార్థులకు నాయకుడిగా ఉద్యమం ప్రారంభించడం, ఆ 'విద్యా' ఉద్యమానికి 'రాజకీయ'రంగును పులమాలని కొంతమంది అనుకోవడం ఈ నవలా ఇతివృత్తం.

నవల చదువుతున్నంతసేపూ ఉద్యమంపట్ల ఆసక్తి పాఠకులకూ కలుగుతుంది. రాజకీయంగా ఈ ఉద్యమానికి ప్రాధాన్యం కలిగేలా చేసి తద్వారా అధికార పక్షాన్ని కూలద్రోయాలని ప్రతిపక్షం ప్రయత్నించటం, విద్యార్థి నాయకుల సంభాషణలు, ప్రయత్నాలు, వాసూ తండ్రి సీతారాం మానసిక సంఘర్షణ, వేణు, రాధ, రమల త్రికోణ ప్రేమకథ ఈ నవలని చివరివరకూ చదివింపచేస్తాయి.



నేటి సామాజిక పరిస్థితులను ముఖ్యంగా రాజకీయ స్థితిగతులను నవల ద్వారా చెప్పదల్చుకోవటం రచయిత లక్ష్యంకావచ్చు బహుశా. అయితే నవలంతా చదివిన తర్వాత పాఠకుడు ఉస్సూరుమనే అవకాశం కూడా లేకపోలేదు. నేటి రాజకీయ పరిస్థితుల్ని యథాతథంగా చిత్రించాలన్నరచయిత ధ్యేయం నెరవేరింది. అయితే కథాపరంగా నవలలో ఉద్యమం జయాపజయాల గురించిగాని, వాసూ అచూకీ గురించిగాని ఏమీ చెప్పలేదు. వేణూకి వ్యతిరేకంగా రాజకీయశక్తుల అండతో పనిచేసిన మధు చనిపోయాడని చెప్పి భరద్వాజ పాత్ర ద్వారా ఇందుకు వేణూలాంటివాళ్ళు సిద్ధాంతాలే కారణమని వివరించారు. ఫలితంగా నవలానాయకుడిగా తాను అంతవరకూ వేణూని ఊహించుకొంటున్న పాఠకుడు కాస్త సందిగ్ధావస్థలో పడి వేణూ ఏమయ్యాడో, వాసూ ఏమయ్యాడో ఇవన్నీ తన పరిజ్ఞానాన్ని బట్టి తననే ఊహించుకోమనడంతో పూర్తిగా అయోమయంలో పడిపోతాడు. నవలలో చాలా చోట్ల ఉన్న సుదీర్ఘమైన సంభాషణలు విసుగు కలిగిస్తున్నా ఓపిగ్గా చదివిన పాఠకుడు ముగింపు ఇదీ అని ఇతిమిద్ధంగా తెలీకపోవటంతో నిరుత్సాహపడిపోతాడు.

అయితే ఎంత నిరుత్సాహపడినా తర్వాత ఈనాటి రాజకీయ పరిస్థితులకు, విద్యార్థుల ఆందోళనలకు కలతచెంది అటు రాజకీయశక్తులుకాని, ఇటు విద్యార్థిలోకంగాని ఎటువైపు వెళ్తోంది, వారి పంథా సరైనదా కాదా అని ఆలోచించటం ప్రారంభిస్తారు.అందుకే కథాపరంగా కాకపోయినా వస్తుపరంగా 'ఉద్యమం' ఓ మంచి నవల అనటం తప్పు కాదేమో!

— వై.రాజేష్, విశాఖపట్నం

## ఇంటర్ మీడియట్- యూనివర్సిటీ!

**రూ. 25/-లు పొందిన సమీక్ష**

'చతుర'లో వచ్చే నవలల్లో ఎక్కువ శాతం పాఠకుల మెప్పుకు పాత్రమై, సాంఘికప్రయోజనాలను, వినోద, విజ్ఞానాలను సమాన పాళ్లలో అందించినవే. కాని వివినమూర్తిగారి నవల "ఉద్యమం" మాత్రం ఆ కోవలోకి రాలేదని చెప్పక తప్పదు.

ఈ నవల ద్వారా రచయిత తాను చెప్పదల్చుకొన్న విషయాన్ని సూటిగా చెప్పలేకపోయారు. నవలారంభంలో ఇంటర్‌పరీక్ష తప్పినందుకు వాసు ఇంట్లోంచి వెళ్ళిపోయాడు, గానీ చివరకు అతను ఇంటికి తిరిగివచ్చినదీ లేనిదీ పాఠకులకు ఒక ప్రశ్నగానే మిగిల్చినారు. నవల ప్రారంభంలో ఉత్సాహంగా చదవించినా ఆ ఊపును చివరిన నిలబెట్టలేకపోయారు.

వాసు తండ్రి సీతారాం తన కుమారుడు ఇంట్లోంచి వెళ్ళిపోయిన తర్వాత కొద్ది రోజులు అతడి కోసం వెతికించినా, ఆ తర్వాత తన ప్రయత్నాన్ని కొనసాగించలేకపోవడం ఆశ్చర్యం కలిగిస్తుంది.అదలాఉంచిఇంటర్ పరీక్షా ఫలితాల్లో తక్కువ శాతం విద్యార్థులు ఉత్తీర్ణులైతే, వేణు, ఇతర విద్యార్థినాయకులు యూనివర్శిటీపై ధ్వజం ఎత్తడం వైస్ ఛాన్సలర్‌తో తలబడటం అర్థంకాకుండా ఉంది. కొన్ని ఇతర రాష్ట్రాల్లో ఇంటర్ బోర్డు కూడా విశ్వవిద్యాలయంలో ఒక భాగమేనేమో గానీ, మన రాష్ట్రంలో అలా లేదుగదా.

రచయిత నేటి విద్యారంగంలో కలుషిత రాజకీయాల దుష్ప్రభావాన్ని సరిగానే వివరించినా, అది పాఠకులను ఆకట్టుకొనే రీతిలో, నవల ఉత్సాహకరంగా సాగేలా లేదనే చెప్పాలి. మొత్తానికి రచయిత తాను చెప్పదల్చుకొన్న భావాన్ని సరిగా చెప్పలేక ముగింపు దగ్గరకు వచ్చేసరికి కథాకథనంలోపటుత్వం చూపలేక పోయారు.

— సి.వెంకటేశ్వరరావు, పెద్దముద్దునూరు

## యువ సంఘానికి ప్రతీక

**రూ. 25/-లు పొందిన సమీక్ష**

"ఉద్యమం" వర్తమాన, సాంఘిక, రాజకీయ స్థితిగతులకు దర్పణం పడుతున్న మాట నిజమే. అందులో భాగంగా విద్యారంగాన్ని పరిచయం చేయటం ప్రశంసనీయం. అసలు పుద్యమమంటూ బయలుదేరితే అది విద్యార్థులలోనే ప్రారంభమౌతుంది. కాని ఈ నవలలో భూమిక ఉత్తీర్ణతాశాతం పడిపోవడం. ఎంత




స్టాటిస్టిక్సు కలెక్టు చేసినా దానికి దొరికిన కారణాలలో ప్రిన్సిపాలు, వైస్‌ఛాన్సలరు, అధ్యాపకులు, సిలబస్ మాత్రమేనా? అందులో విద్యార్థుల కృషికి ప్రాముఖ్యత లేదా! రచయిత ఈ విషయాన్ని విస్మరించారుగాబోలు. ఏ పాత్ర ద్వారాను ఈ విషయాన్ని వ్యక్తంచేయలేదు.

ఇక ఏదో సాధించాలనే వేణులు, అలాంటి వారిని దారిమళ్లించాలనుకొనే రాజులు, ఇటు రాజకీయ ప్రముఖులు, విద్యారంగ ఉద్యోగులు, మధులాంటి అమాయక ప్రాణాల్ని చిచ్చుబుడ్డిల్లా చేసి వెలిగించి, ఆనందించి, స్వప్రయోజనం తర్వాత నిష్కృమింపచేసే ప్రత్యర్థులు ఈ నిరంతర సంగ్రామంలో నిలబడలేక విరక్తితో అజ్ఞాతవాసం చేసే వాసులు, ఇవన్నీ పట్టనట్టుండే ప్రేమైకజీవి రాధలాంటి అమ్మాయిలూ, నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొకాను అనే రమలూ విద్యార్థి సంఘంలో నేడు ఎంతోమంది కన్పిస్తూన్నదృశ్యాన్నివిపినమూర్తిగారు చక్కగా చిత్రీకరించారు. ఈ నవలలో ఉద్యమాలవెనుక జరుగుతున్న పరిణామాలు, పరిస్థితుల వత్తిడులు, ఎవరెవరి ప్రభావాలు ఎలా ప్రబలి ఎలాంటి పరిస్థితులకు దారితీస్తాయి అన్న విషయాలు విపులంగా విశదీకరించారు. కాని ఇంతకీ వుద్యమం సాధించే ఫలితాలు ఎలా వుంటాయి. అన్న ప్రయత్నం మాత్రం ప్రశ్నార్థకంగానే వదలివేయడం సమంజసంగాలేదు.

వేణు ఏమయ్యాడు, వాసు ఏమాయ్యడు అన్న విషయాల్ని రచయిత చూచాయగానైనా చెప్పి వుంటే ఉద్యమ ఫలితాలు ఎలా వున్నాయి అన్న విషయం పాఠకులు అవగాహన చేసుకొని వుండగలిగేవారు. ఈ విషయం తప్పించి విపినమూర్తిగారి 'ఉద్యమం' నవల నేటి యువ సంఘానికి ప్రతీక.

— ఆర్.శమంత, నెల్లికుప్పం

## ఊపులేని ఉద్యమం

*రూ. 25/-లు పొందిన సమీక్ష*

కొన్ని నవలలు పాఠకుల మెదడుకు మేత. మరికొన్ని నవలలకు "పాఠకుల మెదళ్లే మేత". రెండోకోవకు చెందినదే విపినమూర్తి ఉద్యమం నవల. సాంఘిక జీవనాన్ని ప్రభావితం చేసే 'విద్యార్థి 'ఉద్యమం'లాటి పవర్ ఫుల్ ఎలిమెంట్‌ను కథాంశంగా స్వీకరించినపుడు కేవలం వ్యూహారచనలు, ఉద్యమ నిర్మాణ దశనేకాదు ఎవరికోసమయితే ఈ నవలను వ్రాయదలుచుకున్నారో అలాటివారిపై ఈ ఎలిమెంట్ తాలూకు ప్రభావాన్ని కూడా విభిన్న కోణాలనుండి విశ్లేషించాలి. అలాంటి విశ్లేషణ ఈ నవలలో లేకపోగా, కేవలం సిద్ధాంత చర్చలు... అతి భావుకతకుపోయి కొంత విసుగెత్తించిందీ నవల. సీతారాం పాత్ర అసహజతకు పరాకాష్ఠ. ఇంట్లోంచి వెళ్ళిపోయిన కొడుకు కోసం అతడు చేసిన ప్రయత్నాలేవీ పాఠకులకు నమ్మించగలిగేవిగా ఉండవు. పైగా కొడుకు స్నేహితుడు వేణులో తన కొడుకును చూసుకోవడం చాలా అసందర్భం అనిపిస్తుంది. ఇంకా చెప్పాలంటే తన కొడుకు ఎక్కడో క్షేమంగా ఉన్నాడన్న విషయం సీతారాంకు ముందే తెలుసా? అన్నట్టు సాగుతుంది ఆ పాత్ర చిత్రణ. ఇంటర్‌మీడియట్ చదివిన వేణు పాత్ర తాలూకు "అతి పరిపక్వత" అసహనాన్ని రేకెత్తిస్తుంది. జీవితాన్ని ఉద్యమాలను విశ్లేషించేంతటి హీరోయిజాన్ని ఆ పాత్రకు అంటగట్టటం పాత్ర స్వభావ పరిధిని మించి చేసిన అతిశయోక్తి ప్రయోగంగా మాత్రమే మిగులుతుంది.

చాలాచోట్ల అస్పష్టమైన భావపరంపర ఉక్కిరిబిక్కిరి చేసింది. ఒక్కచోట ఒక్కోవాక్యాన్ని రెండుమూడుసార్లు చదివితే తప్ప అర్థంకాని పరిస్థితి. పాత్రల చిత్రణలో పాత్ర ఔచిత్యం, పరిధిలాటి వాటి జోలికిపోకుండా తనకు తోచింది రాసుకుపోయారనిపిస్తోంది. పాత్రల మధ్య బ్యాలన్సు, సంఘటనల మధ్య ఇంటర్ లింక్ లోపించింది. విద్యార్థి ఉద్యమాలకు సంబంధించి అనేకానేక విశ్లేషణాంశాలు ఉండగా వాటిని అలా వదిలేసి ఎంతసేపూ పాఠకుణ్ని తప్పించుకు తిరుగాడే తపన తప్ప మరేదీ కనపడలేదు.

కథనంలో కనీస ఉద్వేగం, ఉత్సాహభరిత స్ఫూర్తి, సరైన వాతావరణ చిత్రణ లేక, వివిధ రకాల పాత్రలతో అసహజతా దారానికి గుచ్చిన మాలిక ఈ నవలిక. — వి.ఆర్, ఏలూరు

# చతుర

సంచిక: 2 మార్చి: 1990 సంపుటి: 13


అతను... ఎవరికోసం ప్రచారంచేస్తే వారికి ఎన్నికల్లో గెలుపు ఖాయం! పిల్లలకు పాఠాలు బోధించనారంభించాడంటే 'వాళ్ళకు ఫస్టు క్లాసులు తథ్యం! అనేక అంశాలపై సమగ్ర అవగాహన, ధారాళమైన వాక్చాతుర్యం, ఎంతైన గాంభీర్యం అతని సొత్తు. అతనంటే అమ్మాయిలకి ఆకర్షణ! పెద్దలకు వాత్సల్యం! యువకులకు అభిమానం! ఒక తల్లికి తనయునిగా, చెల్లికి అన్నగా తన కర్తవ్య నిర్వహణలో లోపం రానీయని ఎంతైన ప్రేమమూర్తి అతను!

కానీ... అతని పేదరికాన్నీ నిరుద్యోగాన్నీ చూసి నవ్వారు కొందరు! పిల్లనివ్వమన్నారు మరికొందరు!

అలాంటి స్థితిలోనే అతనికి లభించిన ఆమె పరిచయం అతని జీవన గమనాన్ని ఏ దారుల్లో నడిపించింది? మనిషి ఆశలు, ఆశయాలకు తగిన హోదా, స్థిరత్వం లభించాయా?

ఆదర్శాల మందరపర్వతాన్ని కవ్వంగా సమస్యల వత్తిళ్ళొకవైపూ, మనోధైర్యం మరొకవైపూ ఆధారంగా చిలికిన అతని జీవన సాగరంలో

## అమృత బిందువు

ఉద్భవించిన వైనం ఎలాంటిది? తనదైన ఆకర్షణీయమైన శైలితో జీవితం కళ్ళకు గ్గా చిత్రించిన **దంతుర్తి చిన రామచంద్రరావు** రచన

"అమృత బిందువు" ఈ నెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల.

పెరట్లో మొహం కడుక్కుని ఇంట్లోకివస్తూ అన్నారు ప్రకాశరావుగారు— "ఏమేं... పైన లైటు వెలుగుతోందేమిటి? అప్పుడే లేచాడా ఆ కుర్రాడు ?" అని.

"అప్పుడే ఏమిటి ఎప్పుడో లేచిఉంటాడు" అంది శారదమ్మ.

"అంటే...?"

"పొద్దున్నే నాలుగున్నరకే లేస్తాడు... ఐదు కాకుండానే స్నానం పూర్తిచేస్తాడు"

"అదేంటీ... వంపు అరింటికిగాని రాదుగా?"

"వంపు మీకూ, నాకూను... అతగాడికి దానితో ఏం పనిలేదు... బావి ఉందిగదా..."

"ఏవింటీ... తెల్లారకుండానే బావిలో నీళ్ళు తోడుకుని పోసుకుంటాడా? ఏమంత ఖర్మకాలిందనీ? నిక్షేపంలా వెలుగొచ్చాక వేడినీళ్ళే పెట్టుకుపోసుకోవచ్చుగదా... ఉద్యోగం చేసి నాలుగు రాళ్లు సంపాదిస్తున్నాడు గదా..."

"ఆ మాత్రం ఆ కుర్రాడికి తెలియంది కాదులెండి— ఐదింటికే పూజకి కూర్చోవాలి కదా— స్నానంచెయ్యందే ఎవరైనా పూజకు కూర్చుంటారా? అందుకని..."

"ఆ అబ్బాయి ప్రతిరోజూ పూజచేస్తాడా... సూర్యోదయం కాకముందే పూజ పూర్తిచెయ్యడమంటే... నిజంగా... ఈ రోజుల్లో నూటికో కోటికో గాని సాధ్యపడేది కాదు. నిండా పాతికేళ్ల యినా లేవనుకుంటాను— అప్పుడే ఇంత నియమం, నిష్ఠాకలగడం..."

"ఏదైనా— మనిషి సంస్కారాన్నిబట్టి ఉంటుంది"

"కాదుమరీ— నెమ్మదిగా అంటావేంటి"

శారదమ్మ ఆయనకి కాఫీ కప్పు అందించడంతో ఆ టాపిక్ అక్కడ ఆగిపోయింది.

నిజానికి ప్రకాశరావుగారు మేడమీద లైటు చూడబట్టిగాని ఆయన అనలు ఆ కుర్రాడి ప్రసక్తే తెచ్చేవాడుకాదు. అనలుదేన్నీ పట్టించుకోడు. ఆయనకి అలవాటైపోయిన మార్గం దారంటా కళ్ళుమూసుకుని వెళ్ళిపోతుండటమే. మొహాన బొట్టుపెట్టుకోడం, చెవిలో పువ్వుపెట్టుకోవడం, గుళ్లోకి వెళ్లడం, పురాణాలు వినడం ఆయనకి అంతగా నచ్చదు. తీర్థయాత్రలకెళ్ళడం, ఉపవాసాలుండడం అంటే అస్సలు పడదు. అల్లుడినీ, కూతుర్నీ పండక్కి పిలవాలని ఆయనకి తోచదు. శ్రీమతిగారు జ్ఞాపకం చెయ్యాల్సిందే. 'బావగారినించి ఉత్తరం వచ్చి పది రోజులయింది— జవాబు రాయకపోతే మర్యాదగా ఉండదు' అనీ శారదమ్మే చెప్పాలి. బంధువులు ఎవరువస్తున్నారో, ఎవరు రావటంలేదో, వస్తే ఏం పనిమీద వస్తున్నారో, ఎన్నాళ్లుండి వెడుతున్నారో దేన్లోనూ ఆయనకి ప్రమేయంలేదు. అలాంటివాళ్లు వచ్చినప్పుడుకూడా ఆయన ఇంట్లోనే ఉండటం అంటూ ఉండదు. ఉన్నా ఏమైనా సలహాలు, సంప్రదింపులూ ఆయనతో ఎవరూ పెట్టుకోరు. అంతా శారదమ్మగారితోనే.

గవర్నమెంటు ఉద్యోగమే దీనికంతటికీ కారణం - అంటే అనొచ్చు. అయితే అందరు గవర్నమెంటు ఆఫీసర్లూ ఇలాగే ఉంటున్నారా అంటే అందరూ అలా ఎందుకుంటారు గానీ చాలామంది మాత్రం ఈ బాపతే అని శారదమ్మగారి అభిప్రాయం.

ఇంటి విషయాల్ని పట్టించుకోక, దేనిమీదా దృష్టి నిలపక మరి ఆయనగారు చేసే పనేమిటి అంటే ఎంతసేపూ ఆఫీను ఫైళ్లూ, కాగితాలూ, క్యాంపులూ— ఇదే లోకం. ఉన్న ఊరికి పందకిలోమీటర్ల దూరంలో ఉన్న సిటీలో ఉద్యోగం. సోమవారం పొద్దున్నే హడావిడిగా బస్సు అందుకోవడం, మళ్లీ శనివారం రాత్రికే ఇల్లుచేరడం. మరో ఊరు ట్రాన్స్ఫర్ అయితేనూ ఇదేవరస. ఒకటీ రెండూ కాదు ముప్పైఏళ్ళ బట్టీ జరుగుతూన్నతతంగమే ఇది.

"రిటైర్మెంట్ కూడా దగ్గరపడిపోతోంది. మీరు మరీ ఇంత అంటీ ముట్టనట్టు ఉండడం బాగాలేదు. ఇంటివిషయాలు కాస్తంత పట్టించుకోవాలి" అని శారదమ్మ ఈ మధ్య అంటూనే ఉంది. ఆవిడగారు అలా అన్నప్పుడల్లా "నువ్వున్నావు కదుటే అన్నీ చూసుకోడానికి..." అంటాడాయన. అంతగౌరవం తనకిస్తున్నందుకు సంబరపడిపోతూంటుందావిడ. అలా తనని ఉబ్బేసి, అన్నీ తనపైకి నెట్టేసి ఆయన హాయిగా ఉంటున్నాడని ఆవిడగారి కంప్లయింటు. కాని ఏంచేస్తుంది? అదంతా ఓ





అలవాటుగా సాగిపోతోంది. ఎన్నిచెప్పినా ఆయన పెద్దహోదాలో ఉన్నవాడు— గెజి టెడ్ ఆఫీసరు. చిన్న చితక సమస్యల్ని ఆయ నముందు పెట్టడం, ఇంటిపనులు ఆయనకి పురమాయించడం బాగుండదని శారదమ్మకి తెలును. అందుకే అలాంటివేమీ ఆమె చెప్పి ఎరగదు.

ఇల్లు, సంసారం సంగతి అలా ఉంచితే వ్యక్తిగా ప్రకాశరావుగారిది మంచి పెర్సనాలిటీ, మెచ్చుకోదగ్గ మంచితనం, కార్యదక్షత ఆయ నలో కనిపిస్తాయ్. శారదమ్మ లేని కుటుంబంలో పుట్టినందువల్ల లేనిపోని ఆశలేం పెట్టుకోలేదు చిన్నప్పుడు. పెద్దగా చదువు అబ్బకపోయినా బోలెడంత ప్రపంచ జ్ఞానం సంపాదించింది. పెళ్ళికి ముందున్న భయంఆపైనకూడా చాలా కాలం వరకూ పోలేదు. మెళ్లో నల్లపూసలతోబా టు వచ్చిన వల్లమాలిన సిగ్గు పెద్దది పుట్టాక గాని పోలేదు. రెండో పిల్లకి రెండేళ్ళు వెళ్ళ కుండానే మూడోదానికి బారసాల జరగడం, వంశోద్ధారకుడు కలగలేదే అని ఆమెకు బెంగ బయలుదేరడం అప్పట్లోనే జరిగింది. నాల్గవ సంతానంగా కూడా సుజాత పుట్టింది. దాంతో ఆవిడగారి పూజలు పునస్కారాల హడావిడి తగ్గిపోయింది. పడకగదిలోకి పరుగులాంటి నడకలు ఆగిపోయాయ్. అయినా 'మీరు అడ గకపోయినా ఇస్తున్నాను— అందుకోండి' అని వరం ప్రసాదించినట్లుగా వరలక్ష్మి ఆవరసలో చివరిదిగా పుట్టింది. "ముచ్చటగా మిగతా ముగ్గురూ పుట్టుకొస్తే అష్టలక్ష్మివైభవం వెలిగి పోయేది చెల్లెమ్మ ఇంట్లో" అని తోటి కోడళ్లు ఆటపట్టించారు జాయింటుగా.

ఈ ఐదుగురు సంతానం గురించి కాస్త చెప్పుకోవాలి. సీరియల్ ఆర్డరులో వాళ్లు - పద్మావతి, శకుంతల, శశిరేఖ, సుజాత, వరల క్ష్మి. వయస్సు 28, 24, 22, 19, 16. ఐదువేళ్లూ ఒకలా ఉండవన్నట్లుగానే వాళ్ల మనస్తత్వాలూ ఐదురకాలు. తెలివితేటల్లోనూ, నడవడికల్లోనూ తేడాలు ఉన్నాయి. అయితే ఉమ్మడిగా వాళ్లకి ఓ సమస్య ఎప్పట్నించో ఉంది. వాళ్లపేర్లు బాగాలేవనీ, ఎలాగైనా మార్చుకోవాలనీ పెద్దకోరిక. ఇంకా నయం— ఆ మాత్రం పేర్లయినా పెట్టేరు మరీ గంగాభ వానీ, చంద్రమతి లాంటి పేర్లు పెట్టలేదని కొంతలో కొంత సంతోషించారు. తన పేరు అంత అసహ్యంగా ఏముందీ? అని పెద్దదాని మనసులో ఉంది. కనుక మొత్తం మార్చేయ కుండా కొంత తగ్గించేసి 'పద్మ' అని పిలవడా నికి ఒప్పుకుంది.

'శకుంతల' అన్నది తలకాయ ఉన్నవాళ్లెవ రూ పెట్టేపేరు కాదు అని రెండో అమ్మాయి అభిప్రాయం. 'శకు' అని పిలిపించుకుంటే ఎలా ఉంటుందని ఓసారి ఆలోచన వచ్చింది. కాని ఎంచేతనో శకు అంటే ఏదో అపశకునం అన్నట్లు చెవికి బాగా తగలలేదు. ఓ మంచి రోజు చూసుకుని పేరు మొత్తం ఎత్తిపారేసి శ్రీలత అని పెట్టుకుంది.

మూడోపిల్ల వంద పేర్లు పరీక్షించినా ఒక్కటీ ఓకే చెయ్యలేదు! ఫిఫ్టీ పర్సెంట్ కట్‌చేసి 'రేఖ' అని ఉంచుకోవే- బాగుంటుంది అని నాలు గోది సలహా ఇస్తే రేఖేమిటి ఇహ పేర్లులేకనా? అని కొట్టిపారేసింది. నాన్సీ, రైసాలాంటి పేర్లు పెట్టుకోవాలని ఆమె ఉబలాటం. ఆమె ఊహ లు నక్షత్రాల మధ్య విహరిస్తూంటాయ్. ఆశల కి ఆసియా ఖండం సరిపోదు. అంటే రీగన్, గోర్బచేవ్ లంతటి గొప్పవాళ్లు నీకు రావాలనా నీ తాపత్రయం? - అని చుట్టుపక్కలవాళ్లూ, అప్పచెల్లెళ్ళూ ఆట పట్టించారు. విసిగి వేసారి చివరికి 'శ్వేత' అని పెట్టుకుంది.

దీంతో నాలుగోదానికి బాధ బయలుదే రింది. శ్వేతకి తాతలాంటి పేరు ఏరుకోవాలని శపథం పట్టింది. సబిత, మమత, శ్రీలేఖ, అఖిలలాంటి పేర్లు కూడా పాతబడి పోతూన్న ఈ రోజుల్లో తనకు నచ్చిన పేరు ఎలా దొరుకు తుంది? ఏది ఏమైతేనేం ఓ విజయదశమిరో జున సుజాత 'శ్రీప్రియ' అయికూర్చుంది.

ఇహ వరలక్ష్మికి ప్రమోషన్ వచ్చేరోజులు. నానా అవస్థపడి ఎలాగో 'అనూష' అని పెట్టు కుంది. అనూషేమిటి ఇదేదో తమాషాగా ఉందే అని ఎవరో అంటే లెఖ్ఖచెయ్యలేదు. కాని ఓ అనుమానం వచ్చింది. తన పేరు ఎంత బాగున్నా వచ్చే జీవిత భాగస్వామిగారి పే రుతో కలిపి తన పేరు అనూషా చిదంబరం, అనూషా పార్వతీశం, అనూషా గోపాలం అయితే ఎంత అసహ్యంగా ఉంటుందీ- అని.



'ఇంత చిన్న వయస్సులోనే నీకింత పెద్ద ఆలోచనలేమిటే?' అని శ్వేత అనబడే శశిరేఖ ఓ రోజున అంటే- "నువ్వు ముందు నోరుమూసుకో- నీ సంగతి నాకు తెలును- 'శ్వేత' అని పెట్టుకోగానే సరా... తలరాత బాగుండాలి గాని" అంది.

ఆ వరుసలోనే తల్లిపేరు మాత్రం ఏం బాగుందీ అని పిల్లల అభిప్రాయం. 'శారదమ్మ' అని ఉంటేనేం- ఆవిడ పాతకాలపు మనిషి అని దానికో సవరణ, అయితే అనూప నామకరణరోజునే తెలిసిందివాళ్ళకి- అమ్మపేరు మూడేళ్ళ క్రితమే లేడీస్ క్లబ్‌లో శారదాప్రకాష్ అని రిజిష్టరై ఉందని. అప్పుడనుకున్నారు "అబ్బో... అమ్మ పేరు ఎంత కమ్మగా ఉందీ" అని.

పిల్లల బాగోగులు, చదువుసంధ్యలు, వాళ్ళ పెళ్లిళ్ళ విషయం తలచుకున్నప్పుడల్లా శారదమ్మ పాపం కంగారుపడిపోతూ ఉంటుంది. ఔను మరి- తల్లి ప్రాణం అంటే అలాగే ఉంటుంది. ఒకరా ఇద్దరా ఇంకా నలుగురున్నారు పెళ్లికి. 'ఎందుకే అలా బాధపడిపోతావ్? ఏదీ మన చేతుల్లో లేదు. ఎవ్విరిథింగ్ ఈజ్ ప్రీడిటర్మిండ్' అంటారు ప్రకాశరావుగారు.

ఆ వేళ ముందు గదిలో కూర్చుని పేపరు చూస్తున్న ఆయనకి అప్పుడే గేటు వైపు వెడుతూన్న మేడ మీద అబ్బాయి కనిపించాడు.

"ఇదిగో బాబూ- ఓసారి ఇలా వస్తావా?" అని పిలిచారాయన.

అబ్బాయి పేరు చంద్రశేఖర్. పేరులో ఉన్నంత చక్కదనం మనిషిలోనూ ఉంది. వర్చస్సాలిటీకి, చురుకుతనానికి సినిమా హీరో లాగా ఉంటాడు.

చంద్రశేఖర్ లోపలికి వచ్చాడు.

"కాస్సేపు అలా కూర్చో..." అన్నారాయన.

అతను కూర్చోలేదు. కాస్త ఇబ్బంది ఫీలయినట్టు కనిపించాడు.

"ఫర్వాలేదులెండి- చెప్పండి" అన్నాడు.

"అలాక్కాదు... కాస్సేపు కూర్చోవయ్యా..."

'నేను అర్జంటు పనిమీద బయటికి వెడుతున్నానండీ! కాస్త చప్పుని తెమల్చండి' అన్నట్లుగా కూర్చున్నాడతను.

"నువ్వు మా ఇంట్లోకి వచ్చి నెల అయిందనుకుంటాను..." అన్నారాయన.

"లేదండి... ఇరవై రోజులైంది"

"మీ ఫాదరూ, మదరూ ఉన్నారా?"

"ఫాదర్ లేరండి... మా అమ్మా, మా సిస్టరూ ఉన్నారు"

"అన్నదమ్ములు లేరా... ?"

"లేరండి..."

ఆయన వ్యవహార సరళి, ఆతీరుబడీ చూసి ఈ కుశల ప్రశ్నలు ఇప్పట్లో అయ్యేవికావని గ్రహించాడు చంద్రశేఖర్.

"నాకోసం బయట నా ఫ్రండ్ వెయిట్‌చేస్తున్నాడు. నేను వెళ్ళొస్తానండి... తరువాత మళ్ళీ కలుస్తాను" అన్నాడు.

"ఏమంత అర్జంటు పని... సెలవుపూట?"

'... ... ... ...'

"ఈవేళ ఆఫీసు పనులేం ఉండవుగదా..."

"అది కాదండి.. వేరే పని ఉంది..."

"ఏమిటి... అంత అర్జంటా?"

"మరేం లేదండి... మార్నింగ్ షోకి వెడుతున్నాం"

"ఏ సినిమాకి?"

"... ... ... ..."

"సినిమాపేరు చెప్పడానికేమయ్యా...!"

"అఁ... ఏదో సినిమాలెండి... మంచిపిక్చరే..."

"అదే... ఏమిటని? సినిమాలంటే నాకూ ఇంటరెస్టే" నవ్వుతూ అన్నారాయన.

"ఆడపిల్లల తండ్రి..." అంటూ బయటికి వెళ్ళి పోయాడతను. గతుక్కుమన్నారు ప్రకాశరావుగారు.

'జంటిల్‌మన్ క్వాలిటీస్ ఉన్న కుర్రాళ్ళు ఏదైనా చెప్పడానికి తటపటాయిస్తుంటే ఊరుకోవాలేగాని తరమకూడదు...' అనిపించింది.

'అబ్బాయి చాకులా ఉన్నాడు. కావలసినంత కలుపుగోలుతనముంన్నా కాస్తంత చాదస్తం ఉన్నట్టుంది. ఇంకా పెళ్ళి అయినట్టేంలేదు. అయినా ఇలాంటి వాళ్లకి ఇల్లు అద్దెకివ్వడ

మేమిటీ?' అని ఏదేదో అనుకుంటూనే ఆయన మళ్ళీ పేపరు తీసారు.

"ఏమండీ... పదకొండుదాటింది... భోజనాని కి లేస్తారా? పెందలాడే భోంచేసి ఈ పూటైనా కాస్త నడుంవాల్చండి..." అంటూ శారదమ్మ లోపలికి వచ్చింది.

ఆయన ఏదో అనబోతుంటే మళ్ళీ ఆమెగా రే అంది - "అబ్బాయి చాలా బుద్ధిమంతు డండీ" అని.

"అని విన్నావా?"

"వినడమేమిటీ... రోజూ చూస్తూన్నేఉన్నాను గదా! అన్నం అంతా పట్టుకు చూడక్కర్లే దుగా..."

ఆయన ఏమీ అనలేదు.

"అతగాడి పూజాపునస్కారంమాట అలా ఉంచండి... పలకరించనిదే మాట్లాడడు. ఏం తీసుకోమన్నా వద్దంటాడు. మేడమీంచిదిగి అలా నరానరి ఆఫీసుకు వెళ్ళిపోతాడు. అలాగే సాయంత్రంవచ్చి నూటిగా పైకి వెళ్లిపోతాడు. ఎప్పుడు వెళ్లాడో, ఎప్పుడువచ్చాడో తెలియదు. వంచిన తల ఎత్తడు. పైన ఉన్నంతసేపూ ఉన్నట్లే అనిపించదు..."

ఆయన మనసులోఉన్న ఏదో డౌట్ క్లియర్ అయిపోయింది. వయసుచిన్నదైనా కేరక్టర్ మంచిదన్నమాట!

"అదినరే... ఫాదర్ లేడంటాడు... మరి తల్లినీ, చెల్లినీ తీసుకొచ్చి ఈ ఊళ్లోనే ఉండొచ్చుగదా" అన్నారు.

"ఇంతకుముందీ అబ్బాయి అవతలి వీధిలో కమలమ్మగారింట్లో ఉండేవాడుట. మొన్ననేను వాళ్లింటికి వెళ్ళినపుడు ఆవిడే చెప్పింది - పాపం. అతని చెల్లెలికి పోలియోవల్ల కాబోలు ఎడమచెయ్యి ఎఫెక్ట్ అయిందట - ఆ పిల్లకి ఇప్పుడు పాతికేళ్ళుట..."

"అయ్యోపాపం- ఔనుమరి - అవిటి పిల్లని తీసుకుని ఊరూరూ ఎక్కడ తిరుగుతాడూ?"

"తల్లి దేవతలాంటి మనిషిట... పాపం ఆవిడకి కష్టంతోపాటు ఆరేళ్ళక్రితం భర్తపోయాడుట..."





ఎదుటి మనిషిమీద తాత్కాలికంగా సింపతీ కల్గినా, అతనిలోని లోటుపాట్లనే భూతద్దంలో చూపిస్తుంది మనిషిబుద్ధి. చిన్న ఉద్యోగం, తండ్రిలేడు, ఇంకా పెళ్ళిగిళ్ళి ఏంలేదు, చెల్లెలు అవిటిది, అండదండలు తక్కువ, ఇవన్నీ కలిసి ఆయనలో చంద్రశేఖర్ మీద చిన్నచూపుకి దోహదపడ్డాయ్.

భోజనంచేస్తూ ప్రకాశరావుగారన్నారు-

"ఈ శేఖరానికి వచ్చేజీతం సరిపోతుందిటే... చేస్తూన్నది గుమాస్తాగిరీ కదా..."

"సరిపోవడానికి ఎక్కడికి దానికి? ఎనిమిది వందలదాకా వస్తుందనుకుంటాను. ఆర్.టి.సి.లో ఉద్యోగం - గుమాస్తాగిరీ అంటారేమిటి? మొదట్లో అందరూ అలాచేరిన వాళ్ళే గదా!" అంది శారదమ్మ.

" ఆ అబ్బాయిని గురించి అడిగితే నీకెందుకే అంత రోషం?"

"రోషం నాకేంలేదు - ఉన్న విషయం చెబుతున్నాను. కుర్రాడు పోస్టు గ్రాడ్యుయేట్ట. ఎం.కాం ఇంకా పైన ఏదో చదువుతున్నాడట"

"ఉద్యోగంచేస్తూ ఏంచదువుతాడులే..."

"లా సెకండియర్ అయిందట... అప్పుడే..."

"ఇన్ని విషయాలు నీకెలా తెలిశాయ్...!"

"చెప్పానుగా - కమలమ్మగారిని కలిశాననీ - ఆవిడేచెప్పింది... అది సరేగాని ... ఇంకో విశేషం - మన లూసీకి అతనంటే ప్రాణం. ఎప్పుడూ ఆమేడ మెట్ల దగ్గిరే పడుకుంటుంది. అతను మనింటికి వచ్చిన మొదటిసారికూడా అది అతన్నిచూసి అరవలేదు... ఏమిటో మరి! దానికింత పెట్టనిదే తానేమీ తినడు"

"అలాగా... అదినరే... అసలు సంగతే మరిచిపోయాను. ఏలూరు ఓసారి వెళ్ళిరానా? వాళ్లు వెళ్ళి ఉత్తరం రాస్తానన్నారేగాని, మళ్ళీ ఉలుకూపలుకూలేదు" అన్నారాయన.

"మన సంబంధం నచ్చితే వాళ్ల మాటల తీరే వేరుగాఉండేది. "వెళ్ళి ఉత్తరం రాస్తాం" అంటేనే మనం అర్థంచేసుకోవచ్చు. కాని వ్వండి. ఏంజరగబోతోందో.."

"అన్నీ అపశకునం మాటలు మాట్లాడతావ్

- ఇప్పుడేం ముంచుకుపోయిందనీ... వాళ్లు వెళ్లి పదిహేను రోజులుకాలేదు"

"పదిహేను రోజులు చాలవుటండీ - ఔనోకాదో రాసి పడేయ్యడానికి? మరి మీరెందుకు అడిగారు ఏలూరు వెళ్లనా అని?".

ఆయన ఏమీ మాట్లాడలేదు.

ఈ పెళ్ళిచూపుల తతంగం చాలా విచిత్రమైంది. పిల్లను కన్న తండ్రి ఎక్కేగుమ్మం, దిగే గుమ్మంగా ఎందరిళ్లకో వెళ్లడం, అమ్మాయి వయసు, పొడుగు, బరువు, రంగు, చదువు అన్నీ చెప్పిన మీదట అవతలివాళ్ళు గుసగుసలు పోయిన అనంతరం "సరే- పిల్లని చూసుకోడానికి వస్తాంలెండి" అనడం; అదే ఓ మహాప్రసాదంలా ఆయన భావించడం, ఆ వచ్చేరోజు కోసం ఎప్పుడెప్పుడా అని ఎదురుచూడ్డం, వచ్చివెళ్ళేక ఏం చెప్పనేలేదే అని బాధపడ్డం, ఆ తర్వాత పోస్టుమాన్నే భగవంతుడిలా ఆరాధించడం, ఇది సర్వసాధారణంగా ప్రతి ఇంటా జరిగేదే... జరుగుతున్నదే. 'పిల్లనచ్చింది' అని అక్కడే చెప్పేసేవాళ్లూ, తర్వాత పోస్టు ద్వారా తెలియబరిచినవాళ్ళూ ఉన్నారు. 'నచ్చలేదు' అని కార్డు రాసి పారేసేవాళ్లూ ఉన్నారు. ఇద్దరు పిల్లల్ని చూసివచ్చినా మొదటి పిల్ల వరస కుదర్లేదు, రెండోది ఈడు సరిపోలేదు అనే బాపతూ ఉన్నారు. పిల్ల తారాబలం, చంద్రబలం చూసినవేళా అన్నీ కలిసొచ్చి 'పిల్లనచ్చింది' అనే అమృతం లాంటి మాట కన్యాదాతగారి కర్ణపుటాలనలంకరించినా, తర్వాత కట్నకానుకల దగ్గరో, స్కూటరు దగ్గరో తుస్సు మనవచ్చు. ప్రపంచంలో ఎక్కడైనా ఎప్పుడైనా ఇచ్చేవాడికి పుచ్చుకొనేవాడు లోకువ. కాని పెళ్ళిళ్ళ విషయంలో ఇచ్చేవాడే పుచ్చుకొనేవాడికి లోకువ. పిల్లాడి తండ్రి కరణం, పిల్లతండ్రి కలక్టరు అయినా ఈ రూలు ఇంతే. అంతటి మహోన్నత స్థానం వుంది కన్యాదాతకి ఈరోజున. ఇంటరు చదివిన మొహానికైనా బి.ఎ.పిల్ల కావాలి. అబ్బాయి అరగుండు బ్రహ్మానందంలా ఉన్నా అమ్మాయి శ్రీదేవిలా ఉండాలి. ఉద్యోగంలో ఉన్నపిల్ల అయితే మరీ మంచిది. ఇన్నీ ఉన్నా మోస్ట్ ఒబీడియంట్ గళ్ అయి ఉండాలి. కట్నం రేటు మాత్రం తగ్గదు. కనుకనే కళ్ళనీళ్ళపర్యంతమై ఎప్పటికీ ఏ సంబంధం కుదరక, ఈ బాధ కక్కలేక మింగలేక యాతన భరించలేక ఆడపిల్లల పేరెంట్స్ నరకం ఎక్కడోలేదు అని ఇక్కడే తెలుసుకుంటున్నారు...

ఇలా ఆలోచిస్తూనే కంచంలో చెయ్యి కడుక్కుంటున్న ప్రకాశరావుగారికి పోస్ట్ అనే కేక వినిపించింది. ఆత్రుతగా బయటికి నడిచారు. ఆ వచ్చింది ఓ కార్డుముక్క. అందులో ఉన్నవి రెండే మాటలు- 'ఉభయకుశలోపరి. మీరోసారి ఏలూరు రావలసిందిగా కోరుతున్నాను' అని. అయితేగియితే కాబోయే వియ్యంకుడుగారు గీకిపారేసిన రెండు ముక్కలవి.

చాటంత మొహం అయింది శారదమ్మగారికి.

"ఇప్పుడు చెప్పవే- వాళ్లకి నచ్చినట్టేగదా దీని అర్థం." అన్నారు కాస్త హుషారుగా ప్రకాశరావుగారు.

"ఇప్పుడే ఏం చెప్పగలంలెండి" అంది ఆవిడ.

అబ్బాయి పోస్ట్ గ్రాడ్యుయేట్ అని తప్ప ఇక చెప్పుకోవడానికి పెద్దగా ఏం లేవు. ఇదే పీకుతోంది శారదమ్మ మనస్సులో; శ్రీలతకీ డిటో.

★ ★ ★

ఏలూరులో బస్సు దిగారు ప్రకాశరావుగారు. బావమరిది సత్యంని కూడా తీసుకొచ్చారు.

ఊళ్ళోకి వెళ్తూ 'ఏలూరు చాలా పెరిగిపోయిందే' అనుకున్నారాయన. అసలు పెరగని ఊరంటూ ఎక్కడుంది ఈరోజుల్లో. తను ఈ ఊరు వచ్చి పదిహేను ఇరవై ఏళ్ళయి ఉంటుంది. మళ్ళీ ఏం అవసరం రాలేదు కనుక ఇటురాలేదు.

మగపెళ్ళివారి ఇంటిముందు ఆటో ఆగింది. ఇద్దరూ దిగారు. సుందరరామయ్యగారు ముందు వరండాలోనే కూర్చుని ఉన్నారు. అక్కడే అబ్బాయీ ఉన్నాడు.

"రండి- రండి..." అన్నారు సుందరరామయ్యగారు.

'రండి బావగారూ' అనలేదే అనిపించింది ప్రకాశరావుగారికి. తర్వాత ఆయన బావమరిది సత్యం అని పరిచయం చేశారు.



"నమస్కారమండి..." అన్నాడు అబ్బాయి చిరునవ్వు నవ్వుతూ. నమస్కారాలూ, నవ్వులూ ప్రకాశరావుగారు చాలా చూశారు ముప్ఫైఏళ్ళ సర్వీసులో. కాని ఇది ఏతరహా నవ్వో ఆయనకి అంతుబట్టలేదు. పెళ్ళిచూపుల రోజున అబ్బాయిని చూసీ చూడగానే 'నల్లనివాడు... పద్మనయనమ్ములవాడు...' అనే పద్యపాదం గుర్తుకొచ్చింది. అందులో మొదటిదే నిజం. పద్మనయనాలు లేవు.

సుందరరామయ్యగారు కూర్చున్న ఈజీఛైర్‌కి ఎదురుగా ఉన్న కుర్చీల్లో ప్రకాశరావుగారూ, సత్యం కూర్చోబోతుండగా 'పదండి- లోపలికే వెడదాం' అంటూ లేచారు సుందరరామయ్యగారు.

లోపలికి వెళ్ళారందరూ.

ఇల్లు చాలా పెద్దది. మండవాలోగిలి. అంతా పాతతరహా కట్టుబడి. మొత్తం పన్నెండు గదుల్లో సగం అద్దెకిచ్చేశారు. వెనక కావలసినంత పెరడు ఉంది. కొబ్బరి చెట్లూ గట్రా చాలా ఉన్నాయ్. ఇంటికి విశాలం ఎక్కువకాని వెలుతురు తక్కువ. గదులెక్కువే-డీసెన్సీ తక్కువ. పాత ట్రంకుపెట్టెలు, బి.సి.నాటి మంచాలూ కనిపించాయ్.

ప్రకాశరావుగారిని కూర్చోబెట్టి కొన్ని వివరాలు అడిగారు సుందరరామయ్యగారు.

"అమ్మాయి బి.కాం. పాసైందన్నారు. క్లాస్ వచ్చిందా?" అని అడిగాడు అబ్బాయి విశ్వనాథం.

"ఏదైనా ఉద్యోగం వస్తే చేయటానికి ఏమైనా అభ్యంతరమా అమ్మాయికి?" అడిగారు సుందరరామయ్యగారు.

కుర్రాడికే ఉద్యోగంలేదు. కుర్రదాని ఉద్యోగం మాటెత్తుతారేమిటి వీళ్ళు- ఏదో సామెత చెప్పినట్టు అనిపించింది ప్రకాశరావుగారికి.

సుందర్రామయ్యగారు సెకండరీ గ్రేడు టీచరు. మరో రెండు మూడేళ్లలో రిటైర్అవుతారు. ఇది స్వంత ఇల్లే. ఒక్కడే కొడుకు. ఇంతవరకే తెలును ప్రకాశరావుగారికి. ఆస్తిపాస్తుల విషయాలు, ఇంకా మంచిచెడ్డలూ ఏం తెలియవు. ఆ విషయమేమీ కదలటంలేదే అని ప్రకాశరావుగారు అనుకుంటూ ఉండగానే సుందర్రామయ్యగారు అన్నారు—

"చూడండి— నా ఆస్తిపాస్తుల విషయం చెబుతున్నాను. ఈ ఇల్లు నాది. మూడులక్షలు చేస్తుంది. ఓ లక్ష క్యాష్ బ్యాంకులో ఉంది. నేను రిటైరవ్వగానే ఓ అరవై డెబ్భైవేలు వస్తాయ్. విశ్వనాథం ఒక్కడే మాకు మగ సంతానం. ఆడపిల్లా ఒక్కత్తే. పెళ్లయి హైదరాబాద్‌లో ఉంటోంది. ఇంట్లో బంగారం ఓ ముప్పై కాసులవరకూ ఉంటుంది"

'కూచుని తింటే కొండలు తరిగిపోతాయ్— ఎంత ఉంటే మాత్రం ఏంలాభం? ఉద్యోగం లేకపోయిందే' అనిపించింది సత్యంకి. ప్రకాశరావుగారూ అదే అను కున్నారు.

"ఈ సంబంధం నచ్చిందని చెప్పాడు మావాడు. అందుకే మీకు లెటర్ రాశాను" అన్నారు సుందర్రామయ్యగారు.

ఇహ కట్నం విషయం కదలాలి.

సత్యంకేసి చూశారు ప్రకాశరావుగారు. సంగతి గ్రహించి సత్యం సబ్జెక్ట్‌ని కదిపాడు.

"యాభైవేలు..." అని సెలవిచ్చారు సుందర్రామయ్యగారు.

'యాభైవేలే...' అని ప్రకాశరావుగారు అనుకుంటూంటే-

'కాను తూకానికి దాదాపు రెండువేలు లెక్కసవడింది...' అనుకున్నాడు సత్యం.

"మీరు అరిచి గీపెట్టినా పైసా తగ్గదు..." అన్నట్టు దర్జాగా మీసాలుదువ్వుకుంటున్నారు సుందర్రామయ్యగారు.

'మేం కాస్త అలా బయటికి వెళ్ళి ఓ అరగంటలో వస్తాం...' అన్నాడు సత్యం.

"ఎంతమాట అలాగే వెళ్ళిరండి"

దారిలో ప్రకాశరావుగారు అన్నారు బావమరిదితో

"ఏమిటయ్యా ఏభైవేలంటాడు? ఏం చూసి ఇస్తారనీ ఏభైవేలు?"

"బావా నీకు ప్రపంచం ఎలా మారిపోతోందో తెలియడంలేదు. నీకెప్పుడూ ఆఫీసుగొడవే యాభై అంటే కాస్త ఎక్కువే. కావచ్చు... కానీ అలా ఉన్నాయి రేట్లు ఇప్పుడు"




"అదిసరే సత్యం! యాభై అయినా ఇస్తాం ఏదో బాధపడి సంబంధం మంచిదైతే. పిల్లాడి రూపురేఖలూ బాగా లేవు, ఉద్యోగమూలేదు గదా"

"బావా ఓ మాట చెబుతాను విను వాళ్ళది పొలకవక్షం. వాళ్ళు దయదలిస్తే మన పిల్ల వాళ్ళింటి గుమ్మంలో అడుగుపెట్టేది. కనక వాళ్ళ ఇల్లే మీ మేడకంటే గొప్పది, ఆయన ఉద్యోగమే నీ హొదాకంటే దొడ్డది, నీ మీద ఆయనే సుపీరియరు..."

"బాగానే ఉంది నువ్వు చెప్పింది. మరీ అంత ప్రాధేయపడినట్లుగా అడిగిందానికొప్పే సుకోవలసినంత అగత్యమేం వచ్చిందని...?"

"అగత్యం ఏం వచ్చిందంటే ఏంచెప్పనూ? అబ్బాయి ఎం.బి.ఎ చదివాడు. రేపో మాపో మంచి ఉద్యోగం ఏదో రాకపోదుగదా మరి క్రితంసారి వచ్చిన సంబంధం ఎలాంటిది...? కుర్రాడిది ఎ.ఎస్.ఎమ్. ఉద్యోగం. అయితే మనిషి చూస్తే చిన్నసైజు విఘ్నేశ్వరుడిలా ఉన్నాడు. ఆస్తిపాస్తులు అసలులేవు. పైపెచ్చు కావలసినంత కట్నం అడిగారు. కుర్రాడి తండ్రి" 

ప్రకాశరావుగారు ఏదో ఆలోచిస్తున్నారు.

"అంతకు ముందొచ్చిన సంబంధం ఏమయింది? వాళ్ళది జమీందారీ ఫామిలీ నలభైవ కరాల వల్లం మామిడితోటలు. కాని కుర్రాడు ఇంటరుతో ఆగిపోయాడు నాకు డిగ్రీ లెందుకు? ఉద్యోగం ఎందుకు? స్వంత వ్యవసాయం చేసుకుంటే అదే ఎక్కువ అన్నాడు. శకుంతల ఏమంది? లక్షలుంటే ఏమిటి. ఎవడిక్కావాలి మంచి ఉద్యోగం ఉండాలికాని అంది. మా శారదా అదేమాట అంది. దాంతో అదీ వదులుకున్నాం. ఇలాగే ఉంటాయి సంబంధాలంటే ఒకటుంటే ఒకటుండదు..." అన్నాడు సత్యం.

"అదంతా సరేనయ్యా ఇప్పుడు ఈ కేసు మాటేమిటని... కుర్రాడికి పెర్సనాలిటీ అయినా లేదు. తండ్రికి దాహం ఎక్కువ. తల్లిని చూస్తే ఆ మాటతీరు కటువుగా ఉంది. మనపిల్లకేమో చాలా పౌరుషం వచ్చినా మాటపడదు. ఒకటికి రెండనే రకం డబ్బు కాదు అది చూసేది ఆఫీషియల్ స్టేటస్‌లో ఉన్న సంబంధంకావాలి దానికి" అన్నారు ప్రకాశరావుగారు.

"కావాలి నిజమే కానీ మనదాకా రావద్దూ? సరే అయితే మరో రెండు మూడు నెలలు ఆగుదాం. ఇంకోటేదో తగలకపోతుందా...?"

"అలాగని చేతిలోఉన్న ఈ సంబంధం వదులుకుంటామా అని ఆలోచిస్తున్నాను"

"అన్నీ నువ్వే అంటే ఎలా బావా ఇది కాస్త ఆలోచించవలసిన సంబంధమే అంటే పిల్లకి నచ్చదన్నావ్. పోనీ మరోటి చూద్దామంటే చేతిలో ఉన్నదాన్ని వదులుకుంటే ఎలా అంటావ్. సరే ఓ పనిచేద్దాం కట్నం విషయంలో బేరాలకి ఇప్పుడే దిగకుండా మళ్ళీ కలుస్తామని చెప్పి పోదాం" అన్నాడు సత్యం.

తిరిగి సుందర్రామయ్యగారింటికి వెళ్ళారు ఇద్దరూ.

"ఈవేళ పంచమి గదా రేపు దశమి ఏకాదశిల్లో మళ్ళీ కలుస్తాను డబ్బునంగతి కాస్త చూసుకోవాలి గదా..." అన్నారు ప్రకాశరావుగారు.

"కాదుమరి. అలాగే అలాగే కానివ్వండి" అన్నారు సుందర్రామయ్యగారు.

ఇద్దరూ బస్‌స్టాండు చేరుకున్నారు.

ఆఫీసుకు చేరగానే జరిగినసంగతి భార్యకు ఓ ఉత్తరంరాసి పడేశారు ప్రకాశరావుగారు. శనివారం రాత్రి ఇంట్లో ఈ సంగతి మళ్ళీ డిస్కస్ చేద్దామనీ, అవసరమైతే ఆదివారం ఏలూరు మళ్ళీ వెళ్ళి సంబంధం ఒప్పుకోవచ్చనీ రాశారు.

శనివారం రాత్రికి ఇల్లుచేరారు ప్రకాశరావుగారు.

ఆయన ఫలహారం చేస్తూంటే పక్కనే కూర్చుని శారదమ్మ ఏలూరు విషయం కదిపింది. జరిగినదంతా మరింత వివరంగా చెప్పుకొచ్చారాయన. సత్యం అభిప్రాయాలు కూడా చెప్పారు.

అంతావిని ఆవిడ అంది

"మా తమ్ముడన్నట్టు రేపోమాపో అబ్బాయికి ఉద్యోగం రాకపోదు... వాడి అంచనా ఎప్పుడూ కరక్ట్..."

"సంతోషించాం మీవాళ్లని వెనకేసుకురావడం ఒక్కటే నీకు తెలిసిన విద్య..." అన్నారాయన.

"అది కాదండీ మీరే అన్నారటగదా చేతిలో ఉన్న సంబంధం వదులుకుంటామా అని? అన్నీ చెప్పాడండి వాడు ఇంటికి పోతూ ఇలా వచ్చే వెళ్లాడు... అందామె.

"అయితే సంబంధం నీకు నచ్చినట్టేనా? ఖాయం చేసుకు రమ్మంటావా? యాభైవేలు కాక మరో ఇరవై వేలదాకా ఇతర ఖర్చులకవు తాయ్"

ఆమె ఏమీ అనలేదు.

"ఏం మాట్లాడవ్? ఇందాక అమ్మాయినడి గితే అదీ మాట్లాడలేదు. అయితే మీ ఉభయు లకీ అంగీకారమే అన్నమాట. ఇహ నాదే ముంది! నేనూ ఓ.కె. అంటాను"

ఇక ఆపైన రాత్రంతా ఈ విషయం ఎవరూ మాట్లాడలేదు.

తెల్లవారింది.

బ్రష్‌మీద పేస్ట్‌వేసి భర్తకి అందించింది శారదమ్మ.

దొడ్లో మొహంకడుక్కుని వంటింట్లోకి ఆయన అడుగుపెట్టేసరికి మేడమీద గంట గణగణ మోగుతోంది.

"అబ్బాయి పూజల్లో ఉన్నట్టున్నాడు" అన్నారాయన.

"రోజూ ఈ పాటికే దిగివచ్చి ప్రసాదం ఇచ్చేవాడు. ఇప్పుడూ వస్తాడు మరో ఐదు నిమిషాల్లో. అయినా రోజూ అతనే రావాలా? ఈ పూట ఒక్కసారి మీరు పైకివెళ్ళి రాకూడదూ?" అందామె కాఫీ అందిస్తూ.

కాఫీ తాగుతూ 'ఓ-అలాగే వెడతాను' అన్నా రాయన.

కాఫీ కప్పు తిరిగి ఆమెకు అందించి మేడ పైకి వెళ్లారు.

చంద్రశేఖర్ పూజ అప్పుడే ముగుస్తోంది. హారతి ఇస్తుండగా ప్రకాశరావుగారు రావడం చూసి 'అలా కూర్చోండి' అన్నట్టు చేతితో సంజ్ఞచేశాడు.

ఆయన ఓ కుర్చీలో కూర్చున్నారు.

పూజ అయిపోయాక కూడా శేఖర్ లేవలేదు. ఏదో ధ్యానంలో కళ్లుమూసుకునే ఉన్నాడు. దేవతా విగ్రహాలముందు పట్టుబట్టలతో పద్మా సనం వేసుకుకూర్చున్న అతన్ని చూసి ఆయన ముచ్చటపడ్డారు. కాసేపు గదంతా కలియచూశా రు. అది చాలా విశాలమైన గది. తను రిటైర యాక ప్రశాంతంగా కాలం గడవడానికని కట్టించుకున్నగది. అబ్బాయి ఆ గదిని అలంకరించిన తీరు, అక్కడి ప్రశాంత వాతావ రణం, పరిశుభ్రత, ఆయనకి ఆశ్చర్యం కలి గించాయ్. రోజుకు నాలుగుసార్లు తుడిచిన నేలకూడా అంత శుభ్రంగా ఉండదు. గదికి ఓ వైపున కాస్త ఎత్తున అమర్చిన ఆంజనేయ సహితసీతా, రామలక్ష్మణుల వెండి విగ్రహాలు, విఘ్నేశ్వర ప్రతిమ, దేవుళ్ళ పటాలు వాటిపై పసుపుకుంకుమలు, పూజా పుష్పాలు, పక్కనే వెండికుందెల్లో వెలుగుతున్న జ్యోతులు- గదంతా అలుముకున్న అగర్ వత్తుల సువా సన, కర్పూర సుగంధం ఆయన్ని ఉక్కిరిబి క్కిరి చేశాయ్. ఆ గదే ఓ గర్భ గుడిలా అనిపించింది.

శేఖర్ కళ్ళు తెరిచాడు.

ఆయన చేతిలో తీర్థం పోసి ప్రసాదం పెట్టాడు.

"ఇంకా స్నానం చెయ్యకపోతే ఏంలెండి- ఒక్కసారి లేచి మీరూ దణ్ణం పెట్టుకోండి" అన్నాడు.

ఏదో తప్పుచేసినవాడిలా ఫీలయ్యాడా యన.

"మీరిక్కడికి వస్తారని నాకు తెలుసు" అన్నాడు శేఖర్.

ఆయన ఆశ్చర్యంగా చూసారతనికేసి.

"ప్రసాదం అమ్మగారికిచ్చి వస్తాను" అని అతను కిందికి దిగబోతుంటే ఆయన అన్నా రు-

"నాకు ఇవ్వు-నేను తీసుకువెడతాను"

"మీరు పెద్దలు... ఇప్పుడే వచ్చేస్తా" అంటూ మెట్లు దిగాడు శేఖరం.

అతను మళ్లీపైకి వచ్చాక.

"నేనొస్తానని నీకెలా తెలుసు?" అన్నారా యన.

"మీరు మొన్న ఏలూరు వెళ్లారుగదా"

"ఔను- నీకెవరు చెప్పారు"



"గేదలకి చెవులే కాదు-గాలికి నోరు కూడా ఉంటుంది- బాబుగారూ"

"అంటే...?"

"మీ సత్యంగారు ఇక్కడికి వచ్చే వెళ్లారు. ఆయన విషయమంతా మీ యింట్లో చెప్పడం విన్నాను. ఏలూరునుంచి ఇరవై రోజులక్రితం వాళ్ళువచ్చి వెళ్లినప్పుడు నేనూ ఆ కుర్రవాణ్ణి చూశాను"

"అలాగా- ఆ సంబంధం నిశ్చయించేద్దా

మని రాత్రే డిసైడ్ చేసుకున్నాం"

అతను మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తున్నాడు.

"కుర్రవాడు ఎమ్.బి.ఎ. కదా..." అన్నారాయన.

"ఈ సంబంధం డ్రాప్ చేసెయ్యండి" అన్నాడతను.

ఆమాటకి దిగ్భ్రాంతి చెందారు ప్రకాశరావు గారు.

"అదేమిటి... ఎందుకని? వాళ్ళని నువ్వు ఎరుగుదువా?" అన్నారాయన

"వివరాలు ఇప్పుడుకాదు. విషయం మీకు తర్వాత అదే తెలుస్తుంది" అన్నాడు శేఖరం.

కిందికి హడావిడిగా దిగి శారదమ్మతో చెప్పారాయన శేఖరం అన్నమాటలు. ఆమె అవాక్కయిపోయింది.



'మన ఇంటి విషయాలు ఇతగాడికెందుకో' అని ఆమెకు కాస్త కోపం రాకపోలేదు. కాని ఎంచేతనో అది అంతలోనే తగ్గిపోయింది.

ఆవేళంతా 'శేఖరం ఎందుకిలా అన్నాడా' అనే మీమాంసలో పడ్డారంతా. కారణం అడిగి తెలుసుకోడానికైనా 'మీకు అదే తెలుస్తుంది' అంటున్నాడు.

మర్నాడు పొద్దున్నే బస్సుకు బయలుదేరుతూ మళ్లీ ఓసారి మేడమీదికి వెళ్లాలనిపించి, వెళ్లారు ప్రకాశ్‌రావుగారు.

ప్రసాదం పుచ్చుకున్నాక ఇంకా అక్కడే నిలుచుని ఉన్న ఆయన్ని చూసి శేఖరం అన్నాడు.

"కారణం తెలుసుకుందామనే మీ ఆత్రుత నాకు తెలుసు. ఆ కుర్రాడి విషయం ఏం చెప్పను? ఓ మనిషి అయోగ్యతను గురించి మరోమనిషి చెప్పడం భావ్యంకాదు. చెప్పనక్కరలేకుండా దానంతట అదే తెలుస్తుంది. అయితే ఆ తెలిసేది ఆలస్యంగా తెలిస్తే ఆడపిల్ల జీవితం దుఃఖ భాజనమవుతుంది కనుక చెబుతున్నాను. ఆ కుర్రవాడి కారెక్టర్ మంచిదిగాదు. బుద్ధికూడా చెడ్డది"

కళ్లు తెరుచుకున్నట్టయింది ప్రకాశరావుగారికి.

"అయితే డ్రాప్ చేసేస్తాం" అన్నారు.

శారదమ్మగారితో ఈ సంగతి చెప్పి బస్టాండుకి వెళ్ళిపోయారు.



"రేపు అన్నయ్య వస్తున్నాడమ్మా. లెటర్ వచ్చింది" అంటూ తల్లికి ఉత్తరం అందించింది విజయగౌరి.

"ఏ రాత్రికో ఇల్లు చేరతాడు. ఒక్క ఆదివారం పూట ఉంటాడు. ఉన్నాడా లేడా అన్నట్టు. తెల్లవారడం భయం. మళ్ళీ పరుగు... ఇలా ఎన్నాళ్లో..." ఉత్తరం చూస్తూ అంది మాణిక్యాంబ.

"ఆ ఉన్న ఒక్కరోజయినా పొద్దుట్నించీ నీకు చదువు చెప్పడంతోనే సరిపోతుంది వాడికి" అని మళ్లీ ఆవిడే అంది.

అన్నయ్యకి తనంటే ప్రాణం అని గౌరికి తెలుసు. తనకి ఓచెయ్యి డిఫెక్ట్ అని అతని మనసులో ఎంత బాధ గూడుకట్టుకుని ఉందో తల్లికీ తెలుసు.

గౌరి టెన్త్ చదువుతున్న రోజుల్లోనే శేఖరం అనేవాడు "అమ్మా- 'విజయని వచ్చేసంవత్సరం కాలేజీకి పంపడం మానేద్దాం. క్లాస్‌మేట్స్‌మధ్య అది ఎంత అవమానపడుతోందో నీకు తెలీదు. విజయ పైకిచెప్పకపోయినా అంతా నాకు తెలుసు. ఇంటర్ రెండేళ్లు ఇంట్లోనే చదువుకుంటుంది" అని. అన్నది అక్షరాలా అమలు చేశాడు. గౌరి ఇంట్లోనే చదువుకుంది. బి.ఎ. కూడా తానే చదివి ఆమెకి చెప్పి చదివించాడు. బి.ఎ.లో 72% సాధించగలిగిందంటే అది ఆమె ప్రతిభేకాదు. అందులో ఎక్కువభాగం అతని కృషి. అయినా ఆ 'ఘనత' విజయదే అంటాడతను. 'వి ఫర్ విక్టరీ' అన్నట్టు విజయ విక్టరీకి మారుపేరు అంటాడు. ఆనందంతో ఆమె కళ్లు మెరిసిన రోజు అతనికి దీపావళి. సంతోషంగా ఆమె ఓ నవ్వు నవ్వితే అతని మనసుకి పూలవాన. చెల్లెల్ని తండ్రిలేని లోటు ఎప్పుడూ ఫీలవ్వనివ్వలేదు. తోబుట్టువుని అంత అపురూపంగా చూసుకునే మనస్తత్వం కొడుక్కిరావడం తన అదృష్టం అనుకుంటుంది మాణిక్యాంబ.

తర్వాత కూడా చదువులో చెల్లెలి మెరిట్ ఏమాత్రం తగ్గకుండా చూడ్డమేకాక మెరుగులు కూడా దిద్దాడు. ఇప్పుడు విజయ ఎం.ఎ ఫైనల్ చదువుతూంది. ఆ మధ్య ఏడాదిపాటు మెడికల్ ట్రీట్‌మెంట్ కోసమని చదువు ఆగిందికాని లేకపోతే ఈపాటికి ఎం.ఎ పూర్తి అయిపోయేది. గత రెండేళ్లబట్టీ ప్రపంచ విషయాలెన్నెన్నో చెబుతూనే ఉన్నాడు. అతడు చెబుతున్న విషయాలు విన్నవాళ్లెవరికైనా





# మీరు నమ్మే ఫారెక్స్ ఇప్పుడు రుచిలో సర్వోత్తమం!

నాలుగు నెలలు నిండిన తర్వాత, మీ పాపాయికి
క్రొత్త రుచికరమైన ఫారెక్స్‌ను పరిచయం చేయండి.
ఒక చిన్న చెంచాడు ఫారెక్స్‌ను 3-4 చిన్న చెంచాల
వెచ్చటి నీటితో కలిపి ఇవ్వడం ప్రారంభించండి.
ఫారెక్స్ మరింత రుచికరమైనది.
మునుపటికంటే మరింత ఎక్కువ పుష్టికరమైనది.




- ఎక్కువ రుచికరం
- ఎక్కువ పుష్టికరం

**ఫారెక్స్®-పెరుగుదల కోసం రుచికరమైన విధానం.**

Gx/65/172 Tel.

'ఇంత నాలెడ్జి ఉందా ఇతనికి' అని ఆశ్చర్యం కలుగుతుంది. ఫస్ట్ వరల్డ్‌వార్ దగ్గర్నుంచి అమెరికా వాళ్ళ స్టార్‌వార్స్ కార్యక్రమం వరకు, చెప్పాడు. పాశ్చాత్యుల ఆలోచనాసరళి, అమెరికాలో జీవనపరిస్థితులు, ఫ్రాన్స్‌లో రాజ్యాంగ మార్పులు, ఫిలిప్పీన్స్‌లో ఫెర్డినాండ్ నిరంకుశత్వం, తర్వాత అక్వినో ప్రజాపాలన, పాకిస్థాన్‌లో జియా మిలిటరీ పవర్, శ్రీలంకలో సంక్షోభం, ఇండియాపట్ల చైనా ధోరణి, ఇండోరష్యా స్నేహ సంబంధాలు, వీటన్నిటికీ వెనుకఉన్న రాజకీయాలు- ఇలా ఎన్నెన్నో విషయాలు విజయకి చెప్పాడు. కొన్ని వ్యాసాలు తనే రాసి ఆమెచేత కంఠతా పట్టించాడు. రాజకీయ విషయాలేకాక కళ, కళాకారులు, సాంస్కృతిక విషయాలూ ఎన్నో చెప్పాడు. ప్లేటోనుంచి కెన్నెత్‌కౌండా వరకు ప్రఖ్యాత పురుషుల గురించి చెప్పి వాళ్ళకి ప్రపంచ ప్రఖ్యాతి ఎలా వచ్చిందో వివరించాడు.

వీటి ఫలితం విజయలో స్పష్టంగా కనిపిస్తుంది. ఏ సబ్జెక్ట్‌మీదనైనా ఆమె అవలీలగా మాట్లాడగలదు. వ్యాసాలు రాయగలదు. కామెంటరీలోనూ, కంపారిజన్‌లోనూ సమర్థులరాలనిపించుకుంది. ఈ బలంతోనే ఇప్పటికి కొన్ని పొలిటికల్ సెటైర్స్, లిటరరీ ఆర్టికల్స్ రాసింది. కొన్ని లవ్ ఎపిసోడ్స్ కూడా పత్రికల్లో వచ్చాయ్. మనిషి చూస్తే చక్కనిచుక్క. నిండైన విగ్రహం. ఆమెకు అందం భగవంతుడిస్తే విజ్ఞానం అన్నయ్య ఇచ్చాడు.

ఆవేళ ఉదయం ఎనిమిదింటికే విజయకి పాఠాలు చెప్పడం ప్రారంభించాడు శేఖరం. 'చాలా పొద్దుపోయింది, ఇహ భోజనాలకి లేవండి' అని తల్లి కేకేసేవరకూ అలా చెబుతూనే ఉన్నాడు. ముందుగా విజయేలేచి డైనింగ్ రూమ్‌లోకి వెళ్ళింది. అలా వెళుతున్న ఆమెను చూసి శేఖర్‌కి అనిపించింది. 'విధాత, ప్రకృతి కూడా వికలాంగులకి అతి తెలివితేటలనిస్తాయ్. కాని బ్రతుకుబాట చూపించవు' అని.

నిజానికి ఆమెది చక్కని రూపం. పచ్చని పసిమిఛాయ. ఆ కాస్త అంగవైకల్యమే లేకపోతే ఎప్పుడో ఓ ఇంటి ఇల్లాలుగా వెళ్లి ఉండేది. భగవంతుడు ఎవరికి ఎందుకు అలాంటి లోపం సృష్టిస్తాడో తెలియదు. పుట్టుకతో వచ్చిన లోపానికి ఎవరు మాత్రం ఏంచెయ్యగలరు?

చెల్లెలు చదువుతున్నప్పుడు కాకపోయినా, రాస్తున్నప్పుడు చూసి బాధపడతాడు శేఖరం. ఎడమచేయి ఆసరా అంతగా లేకుండా కుడిచేత్తో రాయడం ఎంత ఇబ్బందో అని అతను అనేకసార్లు అనుకున్నాడు. అయినా ఆమె రాసే అక్షరాలు మంచి ముత్యాల్లా ఉంటాయ్. తండ్రి బాగున్న రోజుల్లోనే ఆమెకు ఎన్నో సంబంధాలు చూశారు. అన్నీ ఫెయిలయ్యాయ్. అందులో ఒకటి దాదాపు ఖాయమై తప్పిపోయింది. అబ్బాయి ఎం.ఎస్.సి చదివినవాడు, అందగాడు, మంచి ఉద్యోగమూ ఉంది. 'అమ్మాయి నాకిష్టమే అని చెప్పాడు' అయినా చివరికి ఆమెలోని ఆ చిరులోపమే కారుమబ్బులా కమ్ముకొచ్చి అతని పేరెంట్స్ చేత 'నో' అనిపించింది. 'ఈ పిల్లకి పెళ్లి అవడమేమిటీ? వాళ్ళ పిచ్చిగాని...' అని చాలా మంది అనుకున్నారు. యధార్థంగా ఆ సంఘటనే ఆమెను చాలా కృంగదీసింది. ఆ తర్వాత కూడా రెండుమూడు ఫెయిల్యూర్స్ చూసిన మీదట ఆమెలో నిరుత్సాహం పేరుకుపోయింది. దరిమిలా ఇంకో రెండు మ్యాచ్‌లు చూశారు గానీ ఉద్యోగం చేస్తున్న పిల్లకావాలని ఒకరూ, మేమడిగే కట్నం మీరు ఇవ్వలేరు అని మరొకరు దాటవేశారు. విజయకి తెలుసు ఈ ఎక్స్‌క్యూజెస్ అన్నిటి వెనుకున్న అసలు కారణం. అందుకు కుమిలి కుమిలి ఏడ్చింది- చాలా కాలం తర్వాత అన్నయ్యతో చెప్పింది. సంబంధాలు ఇక చూడొద్దనీ, ఆ గీత అంటూ ఉంటే పెళ్లి అదే అవుతుందనీ. శేఖరం కూడా ఆమెను అర్థం చేసుకున్నాడు. అతనికీ బాధగానే ఉంది. పిల్లతరపువాళ్లు అవతలివాళ్ళని అమ్మాయిని చూసుకోడానికి రమ్మని ప్రార్థించడం, అక్వేరియంలో చేపపిల్లల్ని చూసిపోవడానికి వచ్చినట్లు వాళ్లు వచ్చివెళ్ళడం. చివరికి 'నచ్చలేదు' అని సావధానంగా సెలవివ్వడం, వీళ్లు అవమానపడ్డం, అన్నిచోట్లా జరుగుతున్నదే. వాళ్ళు పిల్లని ఏ దృష్టితో చూస్తారో తెలియదు. ఏంచూసి కాదంటున్నారో తెలియదు. అడగడానికి హక్కులేదు. అడిగినా అసలు విషయం బయటికి రాదు. వాళ్లు ఔనంటేనే





పిల్లమొహంలో వెలుగు. ఇదీ ఆడదాని బతుకు!

"కంచం దగ్గర కూచుని అరగంటైంది" అన్న తల్లి కేక విని ఉలిక్కిపడ్డాడు శేఖరం.

భోజనం చేస్తూ అన్నాడు

"అమ్మా మొన్ననీమధ్య తాడేపల్లిగూడెంలో మా హౌస్ ఓనర్‌గారి అమ్మాయికి ఓ సంబంధం చూశారు. అబ్బాయి ఎవరనుకున్నావ్... మన విశ్వనాథం"

"అంటే సుందర్రామయ్యగారి కొడుకే కదా"

"ఔను వాడే..."

"సరిసరి ఆ సంబంధమే దొరికిందా వాళ్ళకి"

"అదే నేనూ అనుకున్నాను వివరాలు చెప్పలేదుగాని సంబంధం మంచిదికాదని చెప్పాను"

"మంచిపని చేశావ్ ఏమన్నారు వాళ్ళు?"

"ఏమంటారు?- డ్రాప్ చేసేశారు"

"అదృష్టవంతులు.కుర్రాడు తిన్ననైనవాడు కాదు పిల్లరాత మంచిదనుకుంటాను లేకపోతే మీనాక్షిలాగే ఏడుస్తూ ఉండును ఈపాటికి"

"ఔనమ్మా నాకు తెలియకడుగుతాను కట్నం నలభైవేలని చెప్పి అంతా సెటిలయ్యాక, ముహూర్తంకూడా పెట్టాక మరో పదివేలు అడగటమేమిటే...?"

"అదే పుర్రెలో పుట్టిన బుద్ధి పుడకలతోగాని పోదనీ"

"పాపం మీనాక్షికి ఆ తర్వాత మళ్లీ ఏ సంబంధమూ రానేలేదు"

"ఎలా వస్తుందిరా జరిగింది జరిగినట్టు చెప్పినా ఆడపిల్ల విషయంలో ఎవరూ నమ్మరు. లోకంతీరే అది. పిల్లలో ఏదో లోపం ఉండడంవల్లే అలా జరిగిందంటారు. కనుకనే పెళ్లికాని పిల్లల బతుకులు ఇలా తగలడుతున్నాయ్"

"నిజమే మరి"

"ఇంకో విషయం చెప్పనా? నీకు తెలిసేవుంటుందిలే పెళ్లవగానే వేరింటి కాపురం పెట్టాలని పిల్ల తల్లిదండ్రులు వత్తిడి చేశారనీ, అందువల్లే సంబంధం మానుకున్నామనీ వాళ్లు చెబుతున్నారంట.ఆ మాట ఆ నోటా ఆ నోటా పాకి చివరికి ఏ సంబంధమూ రాకుండా పోయింది దానికి"

"పరమ దుర్మార్గుల్లే. ఆ సంగతి అందరికీ తెలుసు. వాళ్లమ్మాయి మాత్రం సుఖపడుతోందా హైదరాబాద్‌లో? నానా చిత్రహింసా పెడుతున్నాట్ట మొగుడు"

"అలాంటివాళ్లకి అలాగే జరుగుతుంది. అయినా వాళ్లూ వీళ్లూ అనికాదుగానీ, ప్రపంచం అంతా ఇలాగే తయారైందిరా ఆడపిల్ల విషయంలో. మా రోజుల్లో ఇంత ఘోరకలి ఎరుగం"

సాయంత్రం సరోజా వాళ్లింటికి వెళ్లడానికి తయారవుతున్నాడు శేఖరం. మాణిక్యాంబ కనిపెట్టింది.

"ఎక్కడికిరా సరోజా వాళ్లింటికేనా?" అంది.

"ఔనమ్మా ఎంతా- ఓ అరగంటలో తిరిగి వచ్చేస్తాగదా"

వచ్చినప్పుడల్లా అక్కడికి వెళ్లకుండా ఉండడు. వాళ్లేమైనా అనుకుంటారేమో అనైనా అనుకోడు. వీడు ఓ ఆదివారం రాకపోతే అదేం విచిత్రమో ఆవిడగారే వచ్చేస్తుంది' 'శేఖరం రాలేదా అత్తయ్యా' అని అడగదు ఇల్లంతా వెతుకుతుంది అని ఏవేవో అనుకుంటూందామె.

"నువ్వేమనుకుంటున్నావో నాకు తెలుసులే అమ్మా. సరోజకంటే వాళ్ల పేరెంట్స్‌కే ఎక్కువ పట్టింపు నేను రావడం. సరోజ ఇక్కడికి రాకుండా నేనే అక్కడికి వెళ్లడం న్యాయం. ఎకనామిక్స్‌లో పూర్‌గా ఉందట. మొన్న ప్రీవియస్‌లో 42% వచ్చాయట. అదేమిటో కనుక్కుని వస్తాను..." అన్నాడు శేఖరం.

'వాళ్ల పేరెంట్స్...' అంటాడు వాళ్లసంగతి వీడికేం తెలుసు! ముందో మాటా, వెనకోమాటా రకం అది అనుకుంది మాణిక్యాంబ.

దారిలో శేఖరానికి ఏవేవో ఆలోచనలు వచ్చాయి.

ఆడపిల్ల పుట్టినప్పట్నించీ పెళ్లికి ఆయత్త పడటంతోనే సరిపోతోంది కన్నవాళ్లకి. ఓ అయ్యచేతిలో దాన్ని పెట్టేందుకు కాస్తంత చదువు, వంటా వార్పూ వీటి మీదికే వాళ్ల





దృష్టి పోతోందిగాని ఆమె వ్యక్తిత్వం, టాలెంట్, హాబీలు, మానసిక పరివర్తన ఇవేమీ వాళ్లు పట్టించుకోటంలేదు. అమ్మాయికీ అర్థమైపోతూ ఉంటుంది చిన్నప్పట్నించీ పెళ్లికే తనని తయారు చేస్తున్నారనీ, అందుకు తగినట్టే తను మసులుకోవాలనీ. ఔనుమరి తను ఎక్కడికో వెళ్లిపోవడానికని ఇక్కడ పుట్టినమనిషి. ఈ ఇల్లు తనది కాదు. తనకి స్వతంత్రం లేదు. స్వంత వ్యక్తిత్వం లేదు. తను పడాలి గాని అనకూడదు. పెద్ద చదువులు అనవసరం, తల ఎంతవంచుకుంటే అంత అణకువ గల పిల్ల కిందలెక్క. అదే గొప్ప క్వాలిఫికేషన్ పెళ్లికావల్సిన పిల్లకి. ఆడది అణిగిమణిగి ఉండడమే ఈ పురుష సమాజానికి కావలిసిందీనూ. అందులోంచి ఊరే ప్రయోజనాన్ని వాళ్లు జుర్రుకోవచ్చు. ఇందువల్లనే ఆడజాతి ఓ జడపదార్థంగా తయారైంది. చలం ఎప్పుడో చెప్పాడు- "మగవాడు సంఘానికి బానిస. ఆ బానిసకి బానిస ఆడది" అని. ఆడపిల్లలకి చిన్నప్పట్నించీ ధైర్యసాహసాలు, కర్టెసీ, డిసిప్లిన్ నేర్పుతూ, స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకునే స్వభావం, సమస్యల్ని పరిష్కరించుకునే టాలెంట్ పెంపొందించగలిగితే ఈ రోజున స్త్రీజాతికున్న అధోగతి ఎందుకుంటుంది? పెళ్లయిన దగ్గర్నించి వెళ్లూడే వయసువరకూ తను మగాడిమీదే ఆధారపడివలసి ఉంటుందని ముందే తెలిసిన ఆడపిల్లకి తన జీవితమంతా సజావుగా సాగుతుందనే మనోధైర్యం ఎక్కడుంటుంది? ఆడదానికి పెళ్లి, పిల్లలు, సంసారం అనేవి ముఖ్యమే అయినా అందుకోసం తన వ్యక్తిత్వాన్ని తాకట్టుపెట్టుకోనక్కరలేదు. దేహీ అన్నట్టు బతకనక్కరలేదు. ఇందుకు కావలసింది తమ కాళ్లపై తాము నిలుచోగలిగే శక్తి సంపాదించడం. ఈ లక్ష్యసాధనకే ఇల్లూ, స్కూలూకూడా ఉపయోగపడాలి. పిల్లకి పెళ్లి అవసరమేగాని అదే జీవితానికి పరమావధి కాదు. ఆడదాని ప్రస్తుత దుస్థితి తొలగకపోతే మనకి మరో సరోజినీదేవి, మరో దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్ ఎలా లభిస్తారు? వాళ్లని చూసైనా మనవాళ్లలో చైతన్యం పుంజుకురావాలి. ఆడపిల్లల్ని చదవగలిగినంతవరకు చదివించి వాళ్లకి అభిరుచి ఉన్న రంగంలో వాళ్లు నిలదొక్కుకునే స్థితి వచ్చాక పెళ్లిమాట ఆలోచిస్తే స్త్రీజాతికి చేయవలసిన మేలు చేసినట్టే. పెళ్లి ప్రయత్నాల్లోకూడా వరుడివైపు చూడవలసింది ఆస్తిపాస్తులూ, ఆడంబరాలూ కాదు అతగాడి మనస్తత్వం, గుణం, వ్యక్తిత్వం.

గేటుముందే నిలబడి ఉన్న కృష్ణమూర్తిగారి పలకరింపుతో ఈ లోకంలోకి వచ్చాడు శేఖరం.

"రా శేఖరం క్రితంవారం అసలు రానేలేదే" అన్నారాయన.

"గూడెంలోనే ఉండిపోయానండి. రావడం కుదరలేదు" అన్నాడు శేఖరం.

ఇద్దరూ లోపలికి వెళ్లారు.

కృష్ణమూర్తిగారికి యాభై దాటినా చాలా దృఢమైన మనిషి. ఎప్పుడూ నవ్వుతూ ఉండే మొహం. ఓ ప్రిన్సిపిల్డ్ మాన్. చిన్నప్పుడు నేర్చుకున్న ఫొటోగ్రఫీనే ప్రొఫెషన్‌గా చేసుకుని చాలా కాలంక్రితమే ఓ స్టూడియో ప్రారంభించాడు. అదే ఇప్పుడూ నడుస్తూంది. పాతికేళ్లయినా దానికి పెద్దగా ఎదుగూబొదుగూ లేదు. వైసెస్ ఏంలేనివాడుకనక ఉన్నంతలోనే కాస్త వెనకేసి ఆ ఇల్లు కట్టాడు నాలుగేళ్ల క్రితం. ఆయనకి తీరుబడి ఒక్క ఆదివారమే. శేఖరం వచ్చేదీ ఆదివారమే. పాతికేళ్ల క్రితం కృష్ణమూర్తిగారిచేత ఆ స్టూడియో పెట్టించింది శేఖరం నాన్నగారే.

"ఐ డోంట్ బాదర్ ఫర్ మనీ, ఐ హేవ్ నో లైకింగ్ ఫర్ అఫిషియల్ పవర్" అంటూండడం కృష్ణమూర్తిగారికి అలవాటు. 'చాలామంది డబ్బున్నవాళ్లలో కేరక్టర్ ఉండదు. పవర్ ఉన్నచోట కరప్షన్ ఉంటుంది. లీడర్‌షిప్ ఉన్నచోట సెబటేజ్ వుంటుంది. కనుకనే నాలాంటి సింపుల్ లైఫ్ అన్నిటికంటే శ్రేష్ఠం' అంటాడాయన. 'నా భార్యకోసం, నా పిల్లల కోసం అంటూ వయసులో ఉన్నన్నాళ్లూ నానాగడ్డీ తిని, వేలకు వేలు పోగేస్తే వయసు మళ్లేక ఆ డబ్బే నీ భార్యను నీ మాట విననివ్వదు, పిల్లల్ని నీదగ్గర ఉండనివ్వదు, అదీ ఉండదు' అన్నారాయన ఓసారి.

చాలామటుకు ఆయన లక్షణాలే సరోజవిను. వీటికి ఎక్స్‌ట్రాగా కాస్త పెంకితనంకూడా ఉంది. దానికి బ్రాంచీలుగా పిసరంత కోపమూ ఉంది. రవ్వంత పట్టుదలా ఉంది.



ఆ ఇంట్లో ఓ గది ప్రత్యేకంగా సరోజకే ఎలాట్ చేసేశారు. ఆవిడగారి చీరలు, పుస్తకాలు, టేబిల్, కుర్చీలు, సింగిల్‌కాట్ వగైరా అన్నీ ఆ గదిలోనే ఉంటాయ్. గది బాగా విశాలం. ఎం.ఎ ఫైనల్ చదువుతూంది. ఈమధ్య ఏదో కాన్వెంట్‌లో జాబ్ కూడా సంపాదించిందిట. టీనేజ్ బోర్డరు దాటి మూడేళ్లయినా మేరేజ్ మాట ఎత్తనివ్వదు. తన మనసులోకి రానివ్వదు. పెళ్ళి విషయం ఈమధ్య అమ్మా, నాన్నా మాట్లాడుకుంటూంటే 'పెళ్ళేమిటి అప్పుడే- రిడిక్యులస్...' అందిట చాలా సీరియస్‌గా.

సరోజలో కొన్ని క్వాలిటీస్ చూసి ఆవిణ్ణి అడ్మైర్ చేస్తాడు శేఖరం. కొన్ని లక్షణాలకి నవ్వుకుంటాడు.

దర్జా ఒలికించడంలో ఆమెకి ఆమేసాటి. ఈజీ ఛైరులో కూర్చుని ఊగుతూ చదువుకోడం ఇష్టం. ఆ ఊగుడు చదువులోనే ఉందేమో మహత్యం. ఆమెకు అన్నీ ఫస్ట్‌క్లాసులే.

ఊళ్లో పూజారి నాలుగువైపులా చూసి బార్‌లో దూరినట్లు, నాన్నగారు స్టూడియోకి వెళ్ళేక, అమ్మ మడిగట్టుకున్నాక సెక్స్ పుస్తకం తీస్తుంది ఎప్పుడేనా.

ఆదివారం అంటే హాయి. సోమవారం అంటే ఎలర్జీ.

చిన్న శబ్దమైనా ఏమిటో చిరాకు.

రెండు కాకులు ఒకదాన్నొకటి పొడుచుకోడం చూసినా అది ఓ విడ్డూరం.

శేఖరం రావడంలో ఓ వారం గ్యాప్ వస్తే ఇహ విసవిసలు, రుసరుసలు.

మెళ్లో గొలుసుకున్న లాకెట్‌తో ఆడుకుంటూ ఆలోచించడం, మాట్లాడ్డం ఓ అలవాటు.

పువ్వులంటే పిచ్చి. ఎదురింట్లో కొనుకురావడం, పక్కిళ్లల్లో పంచిపెట్టడం- ఇదేపని.

తల పిన్నుల దగ్గర్నుంచి బ్రాల దాకా ఎప్పుడు ఎక్కడ కొనుక్కుని తెచ్చుకుంటుందో ఎవరికీ తెలియదు.

ఆడదానికి బ్యూటీ ఎంత ముఖ్యమో, ఫిజికల్ స్ట్రెంగ్త్ కూడా అంత అవసరం అనేది ఆవిడ సెంటిమెంట్.

స్త్రీ తనకి కావలసిందేమిటో తెలుసుకుని దాన్ని సంపాదించుకోడంకోసం కృషి చెయ్యగలిగిన స్థితికి వస్తే సమాజం అడ్వాన్స్ అయినట్టే అన్నది ఆవిడ కన్విక్షన్.

లోపలికొస్తున్న శేఖరాన్ని చూసి-

"ఏంబాబూ- క్రితం వారం రానేలేదే" అంది పార్వతమ్మగారు.

"కుదరలేదండి..." అన్నాడు శేఖరం నవ్వుతూ.

"నిన్నటినించీ అంటూనే ఉంది సరోజ" అని ఆవిడ అంటూండగానే, గుమ్మం దగ్గరకొచ్చి ఏంమాట్లాడకుండా నుంచుంది సరోజ.

"కోపమేమో- కనీసం పలకరింపైనా లేదే" అనుకున్నాడతను.

"అమ్మాయి ఎకనామిక్స్‌లో బాగా వెనకబడిందోయ్- అదేమిటో కాస్త చూడు- నేనలా బజారుకి వెళ్లి వస్తాను" అన్నారు కృష్ణమూర్తిగారు.

సరోజ గదిలోకి వెళ్లింది. శేఖరమూ వెళ్లాడు.

'అభిమానధనుల్ని అవమానిస్తే ఏంజరుగుతుందో తెలుసా?' అన్నట్లు చూశాడు ఆమెవైపు.

సరోజ ఏమీ అనలేదు. ఈజీ ఛైర్ అతనికి వదిలేసినట్లుగా మరో కుర్చీలో కూర్చుంది.

"ఇంకా మౌనమేనా?.. రెచ్చగొట్టడంకంటే రాజీకిరావటం ఎప్పుడూ మంచిది" అన్నాడు.

కిలాకిలా నవ్వింది సరోజ. అతను తెల్లబోయాడు.

"అదికాదు సరోజా-..." అని అతడు ఏదో అనబోతూంటే-

"ఇలా నువ్వు గైర్‌హాజరవుతూంటే నేనేమైపోవాలి?" అంది సరోజ- బుంగమూతిపెట్టి. అతనికి జాలివేసింది.

శేఖరం ఏదో సంజాయిషీ యిచ్చుకున్నాక, అది ఆమె ఆమోదించాక ఎకనామిక్స్ థియరీ బైటకు లాగిందావిడ.

'ఇండిఫరెన్స్ కర్వ్స్' గురించి చాలాసేపు చెప్పాడతను. ఫిగర్స్ వేసి చూపించాడు. తరువాత నేషనల్ ఇన్‌కమ్‌ను గురించి చెప్పినప్పుడు చాలా ప్రశ్నలు వేసింది సరోజ. 'నువ్వు

ట్లులేదు' అన్నాడతను మధ్యలో ఓచోట. ఆ అన్నది కాస్త గట్టిగానే అన్నాడు. ఏదో షాక్ తిన్నట్లయింది ఆమెకు. ఆ మాత్రం కటువుగా కూడా ఎప్పుడూ అతను మాట్లాడ్డం ఆమె ఎరుగదు.

కృష్ణమూర్తిగారు ఇంకా తిరిగి రాలేదు.

'వస్తానండి...' అని పార్వతమ్మగారితో చెప్పి వెళ్లిపోయాడు శేఖరం.

అతను వెళ్లేటప్పుడు ఎప్పుడూ తను వీధి గుమ్మంవరకూ వచ్చేది సరోజ. ఇప్పుడు రాలేదు.

* * *

"ఏం నూరయ్యగారూ ఆ నాయుడుగారు మొన్న దశమినాడు మీ ఇంటికొచ్చాడా?"

"నాయుడా? ఆయనెవరు?"

"అదేనండి కంట్రాక్టరు స్వామినాయుడు"

"ఆయనా? నర్లెండి- ఆయన సంగతే అడిగారూ?"

"అంటే రాలేదా"

"ఎందుకొస్తాడండి బాబూ ఆయన!"

"వస్తానని మాట ఇచ్చాడుగా"

"దేవుడి ముందు ప్రమాణాలు చేస్తేనే దిక్కులేదు ఈ రోజుల్లో- నోటిమాట ఓ లెక్కా పంతులుగారూ"

"అది కాదండీ- మరి"

"మీరేం చెప్పకండి ఆయనరాడు అవసరంనాది గదా"

"అదేంటి! అప్పు ఇచ్చింది మీరుగదా మీ అవసరం అంటారేమిటి?"

"అక్కడే ఉంది తిరకాను నేనేఎల్లి వడ్డీ వసూలు చేసుకోవాలి అదీ ఆయనగారి దర్జా లేకపోతే కోర్టుకెళ్ళాల. నేను లిటిగేషను మని షిని కానని ఆయనకి తెలును"

"బాగానే ఉంది వరస"

"చూస్తూ ఉండండి మూడేళ్ళు కాణీ జమ కట్టడు"

"కొంపములగదూ? అప్పుడైనా లీగల్ నోటీను ఇవ్వాలి గదా. ఎలాంటివాడైనా చూస్తూ

"నోటీను ఏం చేస్తుందండీ నేనిచ్చింది యాభై వేలు. ఈ లోపలే ఐ.పి పడేసినా ఆశ్చర్యపోనక్కరలేదు. అప్పుడేం చెయ్యాల?"

"అదేంటి- ఆస్తి జప్తు చేస్తారు గదా"

"ఉన్న ఆస్తి పెద్దదే కాని ఆయన పేర ఉన్నది మాత్రం ఓ పడిపోతూన్న ఇల్లు, వంద గజాల పశువుల దొడ్డే అంతే. మొత్తం అంతా ముప్పైవేలు చెయ్యదు. వేలం వేస్తే అందులో సగం కూడా రాదు"

"మరి ఇంత తెలిసీ అంత అప్పు ఎలా ఇచ్చారు?" "ఇవ్వకేం చేస్తాను? ఊళ్ళో పెద్ద లీడరు గదా ప్రాణం మీదికి తెచ్చిపెట్టడూ?"

"బాగానే ఉంది ఇహ నేనేం చెబుతాను" బస్సులో పక్కపక్కనే కూర్చున్న ఇద్దరు మాట్లడుకుంటున్న మాటలివి. ఇద్దరూ ఓ ఊరువాళ్ళు. స్నేహితులు.

ఓ పది నిముషాలు పోయాక పంతులుగారన్నారు.

"ఔనుగాని... నూరయ్యగారూ... మన సుబ్రమణ్యంగారి అబ్బాయికి మీ మిల్లులో ఉద్యోగం ఇచ్చారా?"

"ఎలా ఇస్తామండీ?"

"అంటే? కుర్రాడు బి.కాం. పాసయ్యాడు గదా".

"అయితే? ఏమిటండీ మీరు చెప్పేది?"

"అది కాదండీ పాపం ఏడాదిబట్టి మీ చుట్టూ తిరుగుతూనే ఉన్నాడు గదా"

"తిరుగుతే? అవసరం ఉన్నవాడు తిరక్క ఏంచేస్తాడు?"

"పాపం పేద కుటుంబంకదండీ. తండ్రి కూడా మంచానపడ్డట్టున్నాడు"

"అందుకు నేనేం చేస్తానండీ బాబూ అదీ నాతప్పేనా?"

"అహ నేనన్నది అదిగాదండి మీ వ్యాపారం లెక్కలు అప్పుడప్పుడు చూసిపెడుతూనే ఉన్నాడు గదా ఆ కుర్రాడు రెండేళ్ళబట్టి"

"అందుకు యాభైయో, వందో ముట్టజెబుతూనే ఉన్నాను గదండీ ఊరికే చాకిరీ చే





యించుకోటంలే''

''కుర్రాడికి ఏదో ఉద్యోగం అంటూ ఇచ్చి మిల్లులో వేసుకుంటే వాళ్ళని ఓ ఒడ్డున చేర్చిన వాళ్ళవుతారు. ఆ పుణ్యం ఊరికే పోదు. వాళ్ళ నాయన కూడా ఇరవైఏళ్ళపాటు మిల్లులో మిమ్మల్ని కనిపెట్టుకుని ఉన్నవాడే గదా''

''ఏమండోయ్ పంతులుగారూ. మీకు సెప్ప తగ్గంతటోణ్ణి కాదుగాని పుణ్యం మాట నాకాడ ఎత్తబోకండి ఆళ్లని ఓ ఒడ్డుకు చేర్చమంటున్నారు. మరి నా మాట ఆళ్ళుయిన్నారా? ఆళ్ళకున్న ఎకరం పొలం నాకు రాసెయ్యమన్నాను. పాతికవేలు ఇస్తానన్నా ఆళ్ళు లెఖ్ఖ చేస్తేనా?''

''ఎకరం అరవై వేలుచేసే బంగారం చెక్క వాళ్ళ పొలం. పాతికవేలకి అడగడమేమిటి? ఏం న్యాయం?'' అని అనబోయి, అలా అన కుండా-

''పాతికవేలు మరీ తక్కువ కదండీ'' అన్నాడాయన.

''ఆ పాతికైనా ఇచ్చేదెవడు ఈ మొహాలకి. కాటికి కాళ్ళు జాపుకున్నవాడికి కూడా అంత పొగరైతే ఎలా? నా మాటకాదన్నప్పుడు ఆళ్ళు ఎలాపోతేనాకేటి?''

వాళ్ళ మాటలన్నీ వింటూ వాళ్ళ ప్రక్కనే కూర్చున్న మూడో ప్యాసింజరు శేఖరానికి అనిపించింది. మనుషుల మనస్తత్వాలు ఎలా మారిపోతున్నాయో అనడానికి ఇది తాజా ఉదాహరణ అని.

''ఇహ నీ సమాజం ఏంబాగుపడుతుందీ'' అనిపించింది.

అనూహ్యమైన మేరకు పాడైపోయింది సమాజం. ఈరోజున మోసం చెయ్యడం తెలియనివాడు తెలివితక్కువ సన్యాసి. పుచ్చుకోడం తెలియనివాడు చేతగాని చవట. లౌక్యం ఎరగనివాడు ఫిట్‌ఫర్ నథింగ్ ఫెలో. జాలిపడకూడదు ఎవరిమీదా. జాలిచూపితే వదిలిపోయేది మనదే. కనికరం చూపకూడదు. ఖర్చు పెట్టవలసి వస్తుంది. మంచి సలహా అయినా చెప్పకూడదు అవతలివాళ్ళు బాగుపడిపోవచ్చు! ఇదీ లోకం!

నిప్పు, నీళ్లు, గాలి, వెలుతురు, చీకటి- ఇవి చూడగలవు. వినగలవు. కాని మాట్లాడలేవు. పైగా వీటిమధ్య ఏదో కనిపించని యానిమాసిటీ వుంది. కనుకనే చీకటితప్పులు వెలుగులోకి రావడంలేదు. పగటిపూట బేరం కుదిరిన సెక్సు రాత్రిపూట రవాణా అవుతోంది. నిప్పులాంటి ఈవేళటి మనిషి రేపటికి నీళ్లు కారిపోతున్నాడు. బాధ్యతల్ని ప్రజలు గాలికివదిలేస్తున్నారు. కనీవినీ ఎరుగని ఏదో తరహా సంస్కృతి ఊరూ పేరూ చెప్పకుండా ఏ మూలనుంచో వచ్చిపడింది దేశంలో. మనిషి మనసునీ, బుద్ధినీ మార్చేసింది. మనిషేమారిపోయాడు. మానవత్వం మటుమాయమైపోయింది. ఇప్పుడు కనిపిస్తున్న ఘోరమైన ట్రెచరీ, గోగరీ, చీటింగ్ ఒకప్పుడు ఈ దేశం ఎరుగదు. ఇప్పుడున్నంతగా స్మగ్లింగ్, రాబరీ, డిబాచరీ ఓ అర్థశతాబ్దం క్రితం లేవు. దీనికి విరుగుడు వుందో లేదో, వుంటే ఎప్పుడో ఎక్కడో చెప్పేందుకు ఎవడున్నాడీరోజున? ఉంటే మరునాటికి వుండనివ్వరు. అయినా ''ఇది పతనం కాదు పురోగమనం'' అంటోంది సమాజం.

గూడెం కాంప్లెక్స్‌లో బస్ దిగాడు శేఖరం. ఇంకా ఇవే ఆలోచనలు అతన్ని వెంటాడుతున్నాయ్. రిక్షా ఎప్పుడెక్కాడో గుర్తేలేదు. ఇంటి ముందు ఆగిన రిక్షాలోంచి దిగి లోపలికి వెళ్లాడు. లూసీ తోక ఊపుతూ స్వాగతం పలికింది. గేటుదగ్గరే నుంచున్న శ్వేత ''బస్సులో వచ్చారా?'' అంది. అది వ్యంగ్యమో, వెటకారమో, కొంటెప్రశ్నో కుశలప్రశ్నో అర్థంకాలేదతనికి.

''కాదు... కారులో వచ్చాను'' అని మేడమీదికి వెళ్లిపోయాడు.

ఏమనుకుందో ఏమో అతని వెనకాలే వెళ్లి ''కారులో రావడానికి అంత కెపాసిటీగలవాడివా?'' అన్నట్టు చూస్తూ, కిటికీదగ్గర నుంచుంది వివేకానంద ఫోజులో. అతను ఆశ్చర్యపోయాడు.

''చనువు చాలా పెంచుకుందే...'' అనుకుని.

''ఈ టైములో ట్రైన్స్ లేవు ఏ టాక్సీలోనో రావలసినంత అర్జెన్సీ ఏంలేదు, ఇంత దూరం నడిచీరాలేను, మరి బస్సులో రాక ఎలా

వస్తాను? అయినా అనలా ప్రశ్నేమిటి? ఏదో వలకరించాలనిగాని" అన్నాడు.

"నిన్ను వలకరించకపోతే నాకు ఊడిపోయే దేం లేదు" అనుకుంటూ.

"మిల్క్‌వాన్‌లో వచ్చారని విన్నాను" అంది శ్వేతన్కాచ్స్టిక్‌గా.

"సిల్క్‌స్మిత చెప్పిందా?" అన్నాడతను.

స్టన్ అయిపోయిందామాటకి శ్వేత.

"ఇతనికెలా తెలిసింది?" అనుకుంది.

"నాకు దారిలో కనిపించిందిలే" అన్నాడు.

ఓ నిమిషం ఆమె ఏం మాట్లాడలేదు.

"మీ ఇద్దరికీ చాలా దగ్గర పోలికలున్నాయ్ అన్నింటిలోనూ మీ పేర్లలో కూడా" అన్నాడత ను.

మనస్సు చివుక్కుమంది శ్వేతకి అలా పోల్చి నందుకు. ఆవిడ పేరు స్మితే. ఈ మధ్యనే 'సిల్క్‌స్మిత' అని ఆటపట్టిస్తున్నారు ఆ పేటలో కుర్రాళ్ళు. ఆ పేరుకూడా ఇతగాడికి తెలిసిపో యిందంటే అసాధ్యుడే. పాతికేళ్లంటారేమిటి డాడీ ఈయనగారికి ముప్పైదగ్గరే వుంటాయ్" అనుకుంది.

ఇంతలోనే 'శ్వేతా' అన్న తల్లి కేక సైరన్‌లా వినిపించింది. అర్థంకాని చూపొకటి అతని మీద విసిరేసి కిందికి వరుగెత్తింది.

చివర మెట్టుమీద అడుగు పడకముందే- "ఏమిటీ ఈయనతో ఫస్ట్ ఇంప్రెషన్ ఇలా అయిందీ" అనుకుంది.

"ఎక్కడికి పోయావే ఇంతసేవు?" అంది తల్లి.

"ఆయనొచ్చారే- ఇప్పుడే వాళ్ళ చెల్లెలు కులాసాగా వుందా అని అడుగుతున్నాను" అంది శ్వేత.

"వాళ్ల చెల్లెలి కులాసా సంగతి నీకెందుకే! బాగానే వుంది ఆఖరికి"

"అదేనే- బాగా చదువుతోందా అని అడిగా ను"

"ఇంతపాటిదానికి మేడె ఎక్కాలా?"

ఇహ ఏం చెప్పాలో తట్టక, ఇంకా అక్కడే నుంచుంటే మరిన్ని అక్షింతలు తప్పవుకనుక, అసలే మనసు పాడైవుంది, అక్కణ్ణించి జారు కుంది శ్వేత.




అసెంబ్లీ ఎలక్షన్లకి ముమ్మరంగా ప్రచారం సాగుతోంది.

ఐదారు పార్టీలవాళ్లు వాళ్ల అభ్యర్థుల్ని ఆ నియోజకవర్గంలో నిలబెట్టారు. ఇండి పెండెంట్ అభ్యర్థిగా వీర్రాజుగారు నిలబడ్డా రు. ఇతర అభ్యర్థులకి కొంతలో కొంత పూర్వరా జకీయ చరిత్ర వుంది. కావలసినంత డబ్బూ వుంది. ఆ రెండూ లేవు వీర్రాజుగారికి. ఆయన కున్నదల్లా మంచిపేరు. ఆ ఊళ్లోనూ, చుట్టుప క్కలా గౌరవం. పిత్రార్జితం తాలూకు రెండెకరా లు ఓ అనాథ శరణాలయానికి దానం చేశాడు. డెబ్బై అయిదువేలు ఓ స్కూలుకి విరాళంగా ఇచ్చాడు. గత ముప్పైఏళ్ళుగా నలుగురు పేదవిద్యార్థులకి తన ఇంట్లోనే ప్రతి సంవ త్సరం వసతి, భోజనం ఏర్పాట్లు చేస్తున్నాడు. ఆయన తండ్రి కూడా చాలా దానధర్మాలు చేసినవాడు. అయితే వీర్రాజుగారిని ఓ విశిష్ట వ్యక్తిగా గౌరవం చూపేవాళ్లలో చాలామంది పాతతరంవాళ్ళు, రిటైరైనవాళ్ళు, బడుగు వర్గా లవాళ్లు. ఇప్పటి కుర్రకారుకి తెలిసింది చాలా తక్కువ. నిజానికి వీర్రాజుగారి పూర్వీకులు 'జమీందారీ దర్జావెలిగించిన వాళ్ళు. చాలా ఆస్తివరులు. అరవైఎకరాల పల్లం, ఇరవై ఎకరాల మామిడితోట, మూడు మేడలు, కారు వుండేవి. తండ్రి చేతులమీదగానే కొంత దాన ధర్మాల రూపంలో తరిగిపోయింది. వీర్రాజు గారి హయాంలో దాదాపు అంతా హరించుకు పోయింది. దానగుణం వాళ్లకి వారసత్వంగా వస్తున్న సుగుణం. వీర్రాజుగారికి వయసు అరవైదాటినా ఒకప్పటి ఆ రాజసం, దర్పం

చెక్కు చెదరకుండానే వున్నాయ్. మనిషి అజా నుబాహువు. స్ఫురద్రూపి.

కిరీటం తీసి పక్కనపెట్టి, సింహాసనం వదిలి విశ్రాంతి తీసుకుంటున్న రారాజులా ఉంటాడాయన. లలితలలితంగా ఆయన మాట్లాడినా ధీర గంభీరతే తొణికిసలాడు తుంది ఆయన స్వరంలో. కూలీనాలీ చేసుకు బతికే అట్టడుగువర్గాల వాళ్ళ పిల్లలు చదువు కుంటామని వస్తే వాళ్ళకి పుస్తకాలు, పలకలతో పాటు నిక్కర్లూ, చొక్కాలూ కూడా దానంచేసేవా డు. ఓ కళాకారుణ్ణి చూస్తే ఆయనకి మహదా నందం. అలాంటివాళ్ళని ఆదుకునేవాడు. పె ద్ద చదువులకని వచ్చేవాళ్ళకి పెద్దగానే ముట్ట జెప్పేవాడు. కడుపేద కుటుంబాల్లో జరిగిన చాలా పెళ్ళిళ్లలో పెళ్లికూతురు మెడలో కట్టిన మాంగల్యం ఆయన ప్రసాదమే.

ఈనాడు ఈ దుస్థితిలో ఉన్నారేం అంటే అది ఆయన తెలివితక్కువే అని అజ్ఞానులు అనుకున్నా ఆయనలోని విశిష్టత ప్రాజ్ఞులకు తెలును.

అప్పటి మేడలు, పాడి పశువులు, వ్యవ సాయం ఇప్పుడు లేవు. అప్పటి తోటలు, కార్లు ఇప్పుడు లేవు! ఆ ప్రాభవం లేదు. ఏమ య్యాయ్ అంటే అది ప్రజలకే తెలును. దేవుడిచ్చిన ఐశ్వర్యం మళ్లీ దేవుడికే ఇచ్చేశాను అంటారాయన. మనుషులు దేవుని రూపాలే గదా అని దాని అంతరార్థం.

రాజకీయ కసరత్తులో కండలు తిరిగిన యోధులు, తలపండిన ఘనాపాటీలు, కళ్ళ ముందే తలలు మార్చగల మొనగాళ్లు వీర్రా జుగారి ప్రత్యర్థుల్లో ఉన్నారు. అందులో కొంద రు వచ్చునోట్లతో మనుషుల్ని కొనగల కోటీశ్వరు లు. వీళ్లమీదా 'ఏమీలేని' వీర్రాజుగారి పోటీ? అని చాలామంది అనుకుంటూంటే "నిజమైన ప్రజాసేవ చేయగలవాడు ఆయనే ఇతరులు చేయాలన్నా చేయలేరు" అని మొట్టమొదట అన్నవాడు శేఖరమే.

గూండాయిజం, రౌడీయిజంలేందే రాజకీ యాలే లేవు అనే ఈరోజుల్లో వీర్రాజు బ్రాండ్ సోషలిజం ఏం పని చేస్తుందని చాలామంది చులకనగా మాట్లాడుతూంటే -"మీరు ధై ర్యంగా నిలబడండి - నేను చేయగలిగింది నేను చేస్తాను" అని ఆయనకి భరోసా యిచ్చిన వాడు శేఖరం.

ఇప్పుడు వీర్రాజుగారికి నామమాత్రంగా మి గిలింది ఆ ఇల్లుకాక మరో పది సెంట్ల భూమి. 'నేను పోయేలోగా ఓ రామాలయం కట్టించడా నికి ఆ స్థలం ఉంచుకున్నాను' అంటాడా యన.

ఆయన మేధావి. విద్యావంతుడు. కాలేజీ లెక్చరర్ చేసి రిటైరయ్యారు.

ఆయనికి ఇప్పుడు ఆస్తిలేకపోతే ఏం ఆయన ఉపకారం పొంది డిగ్రీలు చదివినవా ళ్లు, ప్రభుత్వోద్యోగాల్లో చేరినవాళ్లు, చల్లగా కాపురాలు చేసుకుంటున్నవాళ్లు నిత్యం ఎవరో ఒకరు వచ్చి ఆయనకి పాదాభివందనం చేసి వెడుతూంటారు. ఇదంతా ఆయనకి ఆస్తికాదా అంటే అంతకంటే ఎక్కువే అంటారు ఆయన అభిమానులు. 'నిజమైన ప్రజాసేవ చేయగల వాడు ఆయనే' అని శేఖరం అన్నది అందుకే.

'ఏమిటి-ఈ కుర్రకుంక ఏవో పెద్ద కబుర్లు చెబుతున్నాడు. ఏమిటి ఇతగాడు ఊడబొడి చేదేం?' అని ప్రత్యర్థివర్గాల్లో విసుర్లు వినిపిస్తు న్నాయ్ శేఖరం గురించి.

నిజానికి వీర్రాజుగారికి అభిమానులు, మద్ద తుదారులు ఉండటానికి చాలామందే ఉన్నా రు. కానీ-వాళ్లంతా కలిసి ఆయనకి చేయగలి గేది చాలా తక్కువ. కారణం వాళ్ళంతా పేద వాళ్లు. ఆ పేదవాళ్ళకి సాయపడి తను పేదవా డై పోయినవాడు వీర్రాజుగారు.

'రోజులు ఇలా తగులడ్డాయి కనక గానీ, ఆయనకేమండీ దేవుడు. అలాంటాయన ఎం.ఎల్.ఏ అయితేనే 'పేదోళ్ళకి వెలుగు' అనే చైతన్యం ఇప్పుడిప్పుడే నియోజకవర్గంలో పుంజుకుంటోంది.

వీర్రాజుగారి కొడుకు ఉన్న ఊళ్లోనే లాయ రుగా ఉంటున్నాడు. ఒక్కగానొక్క కూతురు ఢిల్లీలో ఉంటోంది. వీర్రాజుగారికీ, శేఖరానికీ ఏదో దూరపు బంధుత్వం ఉందంటారు.

ఎలక్షన్లరోజు దగ్గరపడడంతో నియోజకవ ర్గంలో వేడి అందుకుంది. ఇంక పదిహేనురో జులే గడువుందనగా అప్పటికే రోజుకి మూడు గ్రామాలు చొప్పున తిరుగుతూ ఊపిరాడ





కుండా ప్రచారం చస్తున్నారు వీర్రాజుగారి మనుమలు. వాళ్ళకి లీడరు శేఖరం. ఆఫీసుకి నెల్లాళ్ళు సెలవు పెట్టేశాడు.

కంటిమీద కునుకు లేకుండా అహోరాత్రులు శ్రమిస్తున్న శేఖరాన్ని చూసి ప్రజలు ఆశ్చర్యపోతున్నారు. అతనికున్న గొప్ప ఆయుధం అతని ఉపన్యాసం. అది భగవంతుడతనిచ్చిన వరం. చెప్పింది చెప్పకుండా, చెప్పే దాంట్లో చెత్తలేకుండా గంటలకొద్దీ సాగిపోతుంది అతని ఉపన్యాసం నల్లేరు మీద బండిలా. మధ్యలో పిట్టకథలు, పొట్టచెక్కలయ్యే పొడుపు కథలు, సామెతలు, ఉపమానాలు పాలరాతిమీద మంచి ముత్యాల్లా పరుగు పెడతాయ్. వినేవాళ్ళ స్థాయిని బట్టి, ప్రజల నాడినిబట్టి అతను మాట్లాడతాడు. అవి మాటలు కావు; అది ఉపన్యాసం కాదు అది ఓ మహాశక్తి. అసాధారణ ప్రజాకర్షణ శక్తి అనుకున్నారు కొంతమంది. ఆ ఆకర్షణలో కొట్టుకుపోతున్నారు జనం. శేఖరంగారి ఉపన్యాసం రుచి అరవై ఏళ్ళ వృద్ధుల దగ్గర్నించి కాలేజీ పిల్లల దాకా తెలిసిపోయింది. అతని శ్రోతల్లో అధిక భాగం ఆడవాళ్లే కావడం విశేషం. అతగాడు మాట్లాడే టైము మండుటెండైనా, అర్ధరాత్రైనా లెక్కలేదు ఎవరికీ ఇనుకవేస్తే రాలని జనం. 'ఇదేమి విపరీతమో' అని ప్రత్యర్థుల శిబిరాల్లో పాత అంచనాలు కంపించడం మొదలైంది. అమాయకపు ప్రజలకి తెలియనివి, ఎవ్వరూ చెప్పనివి, చెప్పలేనివి ఎన్నో విషయాలు, రాజకీయ రహస్యాలు ప్రజా హృదయాల్లోకి దూసుకుపోయేలా చెబుతున్నాడు శేఖరం.

కారణాలు తెలియవుగాని ఇద్దరు అభ్యర్థులు రంగంనించి ఉపసంహరించుకున్నారు. దీంతో వీర్రాజుగారి విజయావకాశాలు మెరుగు పడ్డాయ్.

ఎన్నికలు ఇహవారం రోజులే ఉన్నాయ్. 'వీర్రాజుగారు గెలుపొందడం దాదాపు ఖాయం' అని చాలాచోట్ల వినబడుతోంది. తెల్లవారు ఝామున పూజటైములోతప్ప శేఖరం ఇంట్లో ఉండటంలేదు. ఆ టైముకొచ్చి వెదుతున్నారు ఎంతోమంది. అతనితో మాట్లాడేందుకు వచ్చేవాళ్ళు, వెళ్లేవాళ్ళు, వీధి గుమ్మంలో ఆటోలు, కార్లు, మహాకోలాహలంగా తయారైపోయింది ప్రకాశరావుగారిఇల్లు. ఆ ఇంటికే పెద్ద పాప్యులారిటీవచ్చేసింది. ఏమిటీ ఈ కుర్రాడిలో ఇంత అసాధారణ టాలెంట్ ఉందా? అని ఆశ్చర్యపోతున్నారు, ప్రకాశరావు, శారదమ్మ. శ్వేత సంగతి చెప్పనే అక్కర్లేదు. ఏదో తేలిగ్గా తీసుకుందతన్ని మొదట్లో.

వోటింగ్ రోజుకి ఇహనాలుగు రోజులే వ్యవధి ఉండనగా శేఖరం ఉపన్యాసాల జోరు తారాస్థాయికి చేరింది. వీర్రాజుగారు తమ బృందంతో ఊరూరా తిరిగి ఇంటింటికీ వెళ్ళి వోట్లు అర్థిస్తున్నారు. వందలూ, వేలూ ఐదూ షదీలా ఖర్చయిపోతున్నాయ్. చేతిలోఉన్నదంతా కర్పూరంలా హరించుకుపోయింది. వీర్రాజుగారు కంగారుపడుతున్నారు. ఖర్చుకు వెనుకాడితే పనులు జరగవు సరిగదా నవ్వులపాలు కావలసివస్తుంది చివరికి.

మర్నాడు తెల్లవారుఝామున ఐదుకాకుండానే వీర్రాజుగారు శేఖరం గదికివచ్చారు. ఆయనవెంట పదిమందిదాకాఉన్నారు. ఆయన శేఖరానికి విషయం చెప్పారు. శేఖరం ఆయన చేతిలో తీర్థంపోసి "మీ యింటిమీద ఓ యాభైవేల అప్పుతీసుకోండి వచ్చేనెల తీర్చెయ్యవచ్చు" అన్నాడు. తలెత్తి అతని ముఖంలోకి చూశారాయన. ఎర్రబారిన కళ్ళూ, ఎర్రనిబొట్టూ కనిపించాయ్. ఏమనుకున్నారో ఏమో - "సరే" అంటూ వెళ్ళిపోయారు.

మరో రెండు రోజులపాటు నిర్విరామంగా శ్రమించారు వీర్రాజుగారి మనుమలు. ఆ రెండు రోజులూ శేఖరం నిద్రపోలేదు.

టాపులేని జీపులో వీర్రాజుగారిని ఊరేగించి తీసుకువచ్చారావేళ వందలాది అభిమానులు. శేఖరం ఉపన్యాసాల ఊపు ఊరూరా కనిపించింది. జనం వీర్రాజుగారిని సత్కరించారు. ఆశీర్వదించారు. ప్రజల్లో వచ్చిన మార్పును చూసి వీర్రాజుగారే ఆశ్చర్యపోయారు.

తెల్లవారింది. ఆవేళే ఓటింగ్.

ఒళ్ళు తెలియని జ్వరంతో మూలుగుతున్నాడు శేఖరం. మేడమీద గదిలో కోడికూతకు ముందే వెలుగులు విరజిమ్మే జ్యోతులు గదిలో వెలగలేదు మూసిన తలుపులు మూసినట్టే

ఉన్నాయ్. గది ముందరకూర్చుని లూసీ అరుస్తోంది. శారదమ్మగారు పైకివచ్చి చూశారు. పిల్లలంతా ఇంకా పడుకునేఉన్నారు.

శారదమ్మ అతని నుదుటిపై చెయ్యివేసి చూస్తే చుర్రున చెయ్యికాలినంత పనయింది. నూట నాలుగు డిగ్రీలికి తక్కువుండదు. అతనికి స్పృహలేదు.

శ్వేత పరుగెత్తి డాక్టర్ని తీసుకొచ్చింది. శ్రీలత మందులుకొని తెచ్చింది. శ్రీప్రియని అక్కడే ఉండమనిచెప్పి శారదమ్మగారు కిందికి వచ్చేసింది. అప్పుడే అనూష పైకి పరుగెత్తుకు వెళుతూండటం చూసిందావిడ. 'పీళ్లందరికీ అతనంటే అభిమానమే' అనుకుంది.

'ఓమూల వోటింగు ప్రారంభమైపోతుంటే ఇంకా శేఖరం రాకపోవడమేమిటీ' అని కంగారుగా వీర్రాజుగారి మనుమలు వచ్చారు. విషయం తెలునుని చాలా బాధపడ్డారు. శృతిమించిన శ్రమ - అవధులు దాటిన అలసట - వీటివల్ల బ్రెయిన్‌తోపాటు, గుండెకూడా దెబ్బతింటుంది. ఇదే అనుకున్నారు వాళ్ళు. 'శేఖరం మేథావి. ఇతని రుణం తీర్చుకోగలరా వీర్రాజుగారు?' అనుకున్నారు. ఇద్దర్ని శేఖరానికి సాయంగా ఉంచి మిగిలిన వాళ్ళు వెళ్లిపోయారు.

సాయంత్రానికి ఓటింగ్ పూర్తి అయింది. ఊళ్లో టాక్‌నిబట్టి విజయలక్ష్మి ఎవరిని వరిస్తుందో చెప్పడానికి వీలులేకుండాఉంది. ఆ టైముకే శేఖరం స్పృహలేకుండా పడిఉండటం వీర్రాజుగారికి మతిపోయినట్టయింది. వెంటనే వెళ్ళి శేఖరాన్ని చూసివచ్చారాయన.

మర్నాడే ఓట్లు లెక్కింపు. ఆ అర్ధరాత్రికి ఓపదో పదిహేనో నియోజకవర్గాల ఫలితాలు తెలిశాయ్. వీర్రాజుగారి వరకూ ఇంకారాలేదు. ఆ రాత్రంతా ఆయనకి నిద్రపట్టలేదు. శేఖరందాదాపు నెల్లాళ్ళు తనకోసం తిరిగాడు. వోటు విలువ ఎంతో, ఎం.ఎల్.ని ప్రజలు అసలు ఎన్నుకోవడం ఎందుకో, ఇతర దేశాల్లో ప్రజలు ఏ అర్హతలు చూసి ఓటుచేస్తారో శ్రోతలకి చెప్పాడు. ప్రజాప్రతినిధుల నీతి నియమాలు ప్రజలకి ఎంత అవసరమో చెప్పాడు. వీర్రాజుగారి నైతిక ప్రవృత్తి, మేథాశక్తి వివరించి చెప్పాడు. విజయం సాధిస్తేనే ఈ శ్రమంతా ఫలించినట్టు అవుతుంది.

మర్నాడు ఉదయానికి శేఖరానికి కాస్త స్వస్థత కలిగినట్టు తెలిసింది. అప్పుడే గుండె ఆగిపోయేంతటి శుభవార్త కూడా తెలిసింది. వీర్రాజుగారు ఎలెక్షన్స్‌లో నెగ్గారు. క్షణాల్లో అన్నిచోట్లా తెలిసిపోయిందీ వార్త. వేలాదిమంది అభిమానులు, సామాన్యులు, వ్యాపారస్తులు, పురప్రముఖులు పూలదండలతో ముంచెత్తారు వీర్రాజుగారిని. ప్రశంసల పరంపరతో ఆయనికి ఊపిరాడలేదు. ఎప్పుడూ ఊహించని కీర్తి శిఖరాన్ని అందుకున్న అనుభూతి కలిగిందాయనకి. అంతరాంతరంలో శేఖర్ రూపం మెదిలింది. చటుక్కున లేచి, అంతమంది మధ్యలోంచి బయటకువచ్చి మారుమాటలేకుండా కారులో తిన్నగా శేఖరం గదికివెళ్లారు.

'వీర్రాజు జిందాబాద్' అనే నినాదాలతో ప్రకాశరావుగారి మేడ ఊగిపోయింది. ఆయన వెనకవచ్చిన జనంలో ఉప్పొంగిన విజయోత్సాహం చెప్పనలవికాకుండా ఉంది. వీర్రాజుగారు స్వయంగా శేఖరం మెడలో పూలమాలవేశారు. 'ఇది నాకృతజ్ఞత' అంటూ ఆనందాతిశయంలో అతన్ని కౌగలించుకున్నారు. ఇద్దరికీ కళ్లుచమర్చినయ్. గుండెలోని ఆనందం కన్నీరై పొంగిన వేళ అది! "శేఖరం నువ్వు నాకు చేసిందెంతో నాకు తెలును. నేను చెయ్యగలిగింది కూడా నీకు నేను చేస్తాను" అన్నారాయన.

ఆ సాయంత్రం ఊరేగింపు జరిగింది. వీర్రాజుగారికి ప్రజలు బ్రహ్మరథంపట్టారు. తర్వాత ఏర్పాటయిన బహిరంగసభలో శేఖరం ఎక్కువగా మాట్లాడలేక రెండేరెండు మాటలు చెప్పాడు "పవిత్రమైన అంతఃకరణగల మచ్చలేని మనిషిని మీరు ఎన్నుకున్నారు. ఫలితం త్వరలోనే మీరు చూస్తారు" అన్నాడు.

"గెలిచినవాడికంటే గెలిపించినవాడే ఎప్పుడూ ఎక్కువ. విజయం పొందినవాడు నరుడు విజయసారధి నారాయణుడు అంతటిభావం నాకు శేఖరంపట్ల ఉంది" అన్నారు వీర్రాజుగారు.

సభలో మాజీపార్లమెంటు సభ్యుడు, పారిశ్రా




మికవేత్త నాయుడుగారన్నారు "వీర్రాజుగారు హైదరాబాదు వెళ్లి, ప్రమాణస్వీకారం అయాక తిరిగి రాగానే ఆయనకి మాకుతోచిన రీతిలో చిన్న సన్మానం చెయ్యాలని సంకల్పించాం. సన్మానం పదోతేదీన జరుగుతుంది. అది ఆయన జన్మదినం కూడా".

తెల్లవారేసరికి రాష్ట్రం నలుమూలలనుంచి మొత్తం ఆరువందల టెలిగ్రాంలు వచ్చాయి. ఫోన్‌కాల్స్‌కి ఇకలెక్కలేదు.

వీర్రాజుగారు హైదరాబాదు వెళ్లిరావడం అయింది.

వీర్రాజుగారికి నభూతో నభవిష్యతి! అన్నట్టు మహావైభవంగా సన్మానం జరిగింది. ప్రజలు ఏదోమెప్పుకోసమో, మొక్కుబడిగానో చేసిందికాదది. మనస్ఫూర్తిగా చేసింది కనుకనే ఆశోభ. అరవైదాటిన వీర్రాజుగారికి రెండు అరవైలు నూట ఇరవైవేలు 'పర్సు' బహూకరించారు ప్రజలు. అందులో రిక్షావాళ్లు సైతం సంతోషంగా ఇచ్చిన రూపాయి, రూపాయిన్నరా కూడా ఉన్నాయ్. సభ ముగిసేసరికి రాత్రివదయింది.

తెల్లవారు ఝామున శేఖరం పూజముగిసే టైముకి వీధిలో రెండు కార్లు వచ్చి ఆగాయ్. ఎం.ఎల్.ఏగారు, మరికొందరూ తిన్నగా శేఖరం గదిలోకి వెళ్లారు. గదిలో రెండు బుట్టలతో పువ్వులు, మరో రెండు బుట్టలతో పళ్లు అక్కడ ఉంచారు. 'ఏమిటిదంతా?' అన్నట్టు శేఖరం చూస్తుంటే "ఏదో ఉడతాభక్తిగా" అన్నారు వీర్రాజుగారు. ఓపెద్దప్యాకెట్టు, దానిమీద మరో చిన్నప్యాకెట్టు పెట్టి అతని చేతిలో పెట్టారాయన. నిరాకరించే ధోరణిలో ఉన్న శేఖరం రెండుచేతులు పట్టుకుని— "నువ్వు నాకోసం ఇది తీసుకోక తప్పదు ఏదో చంద్రునికో నూలుపోగు" అన్నారు వీర్రాజుగారు.

మరో రెండు నిమిషాలకి వచ్చినవాళ్లంతా వెళ్లిపోయారు. వాళ్లు వెళ్లేక చూశాడు శేఖరం పెద్ద ప్యాకెట్‌లో ఉన్నవి ఆరుజతల బట్టలు చాలా ఖరీదైనవి. చిన్న ప్యాకెట్లోది డబ్బు. ఇరవైవేలు! ఎంత ముక్కుసూటి మనిషీ, నీతిమంతుడూ అయినా, తనూ ఓ మనిషే అనిపించిందికాబోలు 'ఈ డబ్బు మా గౌరి పెళ్లికి పనికొస్తుంది' అనిపించింది అతనికి.

యాపిల్‌పళ్లు, బత్తాయిలు, కమలాలు, చక్రకేళీలు, గులాబీలు, చామంతులు- అన్నీ పది ఇళ్లవాళ్లకి పంచిపెట్టేడు శేఖరం. 'వద్దు-వద్దు' అంటున్నా అతని వెనకాలే సాయంగా వెళ్లొచ్చింది శ్వేత. ఇంకా మిగిలిన పువ్వులతో దండలు కట్టింది శ్రీప్రియ. దేవుళ్ల పటాలన్నీ దండలతో నిండిపోయాయ్. ఆఫీసుకి వెళ్లే ముందు ఓ గులాబీ పువ్వు శ్వేతకీ, ఓ పండు శ్రీప్రియకీ ఇచ్చాడు శేఖరం. శ్రీప్రియకి పండు చేతికి అందించాడు. పువ్వు శ్వేత చేతిలో ఎత్తిపడేశాడు. కొరకొరా చూసిందతనికేసి శ్వేత.

"మొన్న మీరు నాకోసం పడిన శ్రమకి బహుమానం ఇది" అన్నాడతను.

ఇద్దరూ కిందికివెళ్లిపోయారు. మెట్లు దిగుతున్నప్పుడు శ్రీప్రియతో శ్వేత అంది. "ఈమాత్రానికే బహుమతి ఇచ్చాడు. ఇకరోజూ వంట చేసి పెడతాను. ఏమిస్తాడోమరి" అని.

'డోంట్ బి సిల్లీ...' అంది శ్రీప్రియ చిరాగ్గా.

శేఖరం మళ్ళీ డ్యూటీలో జాయిన్ అయ్యాడు.

మూడునెలలు గడిచిపోయాయ్.

ఇప్పుడు ఊళ్లోనూ, చుట్టుపక్కలా కూడా అతన్ని ఎరగని వాళ్లు లేరు. ఆఫీసుకి వెడుతున్నప్పుడు, వస్తున్నప్పుడు చాలామంది 'నమస్కారంసార్' అంటున్నారు. ఏషాపుకి వెళ్లినా కుర్చీచూపించి 'కూర్చోండి' అంటున్నారు.

పుస్తకాలు కట్టలు కట్టేసి కనబడిన చోటుకి నెట్టేసి వేసవి సెలవులు ఎంజాయ్ చేస్తున్నారు కాలేజీ పిల్లలు.

ఆవేళ పేపర్లో ఓ వార్త చూసాడు శేఖరం. రాజమండ్రిలో ఈవ్‌టీజింగ్ చేసిన ఓ కాలేజీ కుర్రాడి చెంప చెళ్లుమనిపించిందిట ఓ కరాటే రాణి. ఆ రాణీగారెవరో కాదు సరోజే.

శనివారం సాయంత్రం వాళ్ల ఊరు చేరాడు శేఖరం.

రాత్రి వాళ్ల అమ్మ అంది "ఒరేయ్ శేఖరం నువ్వు బ్యాంకులో డబ్బు వేసి మూడు నెలలవుతోంది. అందులో కొంతతీసి గౌరికి కాసునన్నర పెట్టి ఓ గొలుసు చేయిస్తే బాగుంటుంది.



మరోముప్పావు కాసుతో దానికి జూకాలూ వచ్చే స్తాయ్''

శేఖరానికి తెలుసు. అవి చెల్లెలికి అవసరమే అని. పాపం ఇప్పటికే గౌరి మెళ్ళో చైనూ, చెవులకున్న రింగులూ రోల్డుగోల్డువే. ఆమె పెళ్ళికోసమేగదా తను బ్యాంకులో వేసింది. ఈ ఖర్చు కూడా అందుకోసమే అవుతుంది.

తల్లి మళ్ళీ అంది ''పాపం అది ఏనాడూ నాకదికావాలి ఇదికావాలి అని అడుగలేదు. పిల్ల బంగారపు బొమ్మ కాని. దానికి భగవంతుడు ఆ చిరులోపం పెట్టాడు'' అని కళ్ళు తుడుచుకుంది.

'అలాగే చేయిద్దాంలే అమ్మా' అన్నాడు శేఖరం.

గౌరికి ఇంత మొహం అయింది ఆ మాటకి. నగలంటే చాలు ఆడవాళ్ళు అంత సంతోషిస్తారని అతనికి తెలియదు.

గౌరి పరీక్షలు బాగా రాసిందని తెలిసింది.

సరోజ కూడా బాగా రాసిందట.

శ్వేత ఎలా రాసిందో చెప్పనేలేదు. అడిగినా చెప్పదు- చెప్పినా నగం నగం చెబుతుంది.

ఏదో చాలా హేపీగా ఫీలవుతున్నాడు శేఖరం ఆవేళ.

సాయంత్రం యధావిధిగా కృష్ణమూర్తి గారింటికి బయలుదేరాడు. క్రితం ఆదివారం తను అసలు రాజమండ్రియే రాలేదు. దీనికి మళ్ళీ సరోజ గొడవచేయటం ఖాయం అనుకున్నాడు.

కాని అలా జరగలేదు.

చిరునవ్వుతో ఆహ్వానించింది తన గదిలోకి. అక్కడే పార్వతమ్మగారూ కనిపించారు.

''ఏం బాబూ... గౌరి చాలా బాగా రాసిందిట పరీక్షలు'' అందావిడ

''ఔనండీ... మీ సరోజకంటే మా గౌరే బాగా చదువుతుందని మీ ఉద్దేశం. నాకు తెలుసు కాని అది సరికాదు- ఇద్దరూ ఈక్వెల్' అన్నాడతను.

'నీ సర్టిఫికెట్ నాకేం అఖర్లేదు' అన్నట్టు చూసింది సరోజ.

'ఐతే దీనికీ క్లాస్ వస్తుందన్నమాట' అంటూ లోపలకి వెళ్ళిపోయిందావిడ.

సరోజ గది పరిశీలనగా చూసి అతను ఓ క్షణం అలాగే ఉండిపోయాడు. 'ఇది సరోజ గదేనా?'

అతని మూమెంట్స్ కనిపెడుతూంది సరోజ.

ఎంత మార్పు!

నాలుగు గోడలకి లైట్‌గ్రీన్ ఇంగ్లీష్ కలర్ వేయించారు. కిటికీలకి పాతచెక్క తలుపులు తీయించేసి గ్లాస్ డోర్స్ పెట్టించారు. ఓ గోడకి గాజు షట్టర్స్‌తో షోకేస్ చేయించారు. లోపల నిగనిగలాడే తెల్లపెయింట్. అరలలో అందమైన బొమ్మలు. మొజాయిక్ ఫ్లోరింగ్. ఇదివరకు కుర్చీలకి బదులు స్టీల్‌కుర్చీలు. ఆవిడ గారి ఈజీ చైర్‌కి పాలిష్ పెట్టించారు.

'ఎలా ఉంది?' అన్నప్రశ్నతోఉలిక్కిపడ్డాడతను.

'సింప్లీ సుపర్బ్'

''అంటే - వివరంగా చెప్పాలి''

''వివరించి చెప్పడానికి నేను కవినిగాను. అందం గురించి చెప్పడానికి ఆర్టిస్టునీకాను''

కవులకు మించిన భావన. అంతకు మించిన ఆర్టిస్టిక్ సెన్సూ అతనిలో ఉన్నాయి అని ఆమెకు తెలుసు.

''ఈ మాత్రం చెప్పడానికి కవిత్వం, ఆర్టూ అంటావేమిటి?''అంది

అతను నవ్వాడు.

''నవ్వకు- ఎలా ఉందో ముందు చెప్పు''

''మినీ సైజు గవర్నరుగారి గదిలా ఉంది''

ఇక ఆమె సంతోషం ఏం చెప్పాలి!

ఇంతలో శేఖరం ఓమాట అన్నాడు-

''ఇన్ని చేసి ఆ మంచాన్ని అలా ఉంచేసేరేమిటి?''అని.

ఆమె ఏమీ అనలేదు.

''ఓహో అది సింగిల్ కాట్ గదా అందుకేనేమో''

''ఛీ అన్నీ పాడుమాటలు!''

నవ్వాడతను.

''నేనన్నదాంట్లో తప్పేముంది? నువ్వు ఏదేదో అనుకుంటే అందుకు నాకు బాధ్యత లేదు''





అన్నాడు.

ఏదో జ్ఞాపకం వచ్చినదానిలా లేచి లోపలి గదిలోకి వెళ్లింది సరోజ. రెండు నిమిషాల్లో తిరిగొచ్చింది ఓ చేత్తో టిఫిన్ ప్లేటూ, మరో చేత్తో ఫ్రిజ్ వాటరూ పట్టుకుని.

టీపాయ్ మీద పెట్టి "తీసుకోండి" అంది.

అది కోపమో తెలియదు. ఆత్మీతో తెలియదు.

కోపమైతే ఎందుకో, ఆత్మీతైతే దేనికో తెలియదు!

ప్రశ్నార్థకంగా ఆమె ముఖంలోకి చూస్తే సమాధానంలేదు.

ప్లేటులో చూస్తే ఓ బాదుషా, ఓ జాంగ్రీ, కొద్దిగా జీడిపలుకులు.

'ఏమిటి విశేషం చెప్మా...' అనుకుని తక్కున లేచి వంటింట్లోకి వెళ్లి

"ఈమధ్య ఎవరైనా వచ్చి చూసుకువెళ్లారా అత్తయ్యగారూ సెటిలైపోయిందా?" అన్నాడు.

"అంత భాగ్యమా బాబూ అనలామాటే రానివ్వదుగదా మహాతల్లి" అందావిడ.

తిరిగి గదిలోకొచ్చిన శేఖరాన్ని నిలదీసి అడిగినట్టు అడిగింది సరోజ- "ఏమిటలా అడుగుతావ్? అందుకు వంటింట్లోకే వెళ్ళాలా?"

"మరి? ఇక్కడ నిన్నే అడిగితే చెబుతావా?"

"ఏమిటో- మాట మాటకీ వేళాకోళం - ప్రతిమాటలోనూ ఇంప్లైడ్ మీనింగ్ - చాలా బాధొచ్చిపడింది నీతో"

"బాధా? ఏం బాధ?"

"మాటల్లో మొనగాడివిగదా నువ్వే చెప్పు"

"అయితే చెబుతాను కడుపులో కోరికను కళ్లల్లో చూపడంలోనూ, చూపకపోడంలోనూ, వాళ్లకి వాళ్లే సాటి ఆడవాళ్లు. ఒప్పుకుంటావా? ఇది ముందు చెప్పు"

ఆమె ఏమీ మాట్లాడలేదు.

"నువ్వు ఇది చెప్పకపోతే నేను అదీ చెప్పను"

"ఒప్పుకుంటాను" అంది లాకెట్ పెదవుల మధ్య పెట్టుకుంటూ.

"గుడ్ ఇహ బాధ విషయం చెబుతాను విను"

చెప్పుకుందామనుకున్నా వీల్లేని బాధ శ్రీలతది.

చెప్పుకున్నా తీరని బాధ శ్వేతది.

చెప్పకపోయినా తెలిసిపోయే బాధ సరోజది అన్నాడు.

"నీ ముందు కూర్చోడమే పొరపాటు" అని ఆమె లేవబోతూంటే ఆమెను ఆపి

"ఏదో మాటవరసకి అలా అన్నాను చెప్పమన్నావుగదా అని ఏదో చెప్పాను. అదిసరే అసలు నీకోమంచి మాట చెబుదామని ఇలా వచ్చాను" అన్నాడు.

"మంచి మాటా ఏమిటది?"

"నువ్వు ఓకే అంటావో లేదో మరి"

"అదిగో మళ్లీ మాటలగారడీ మొదలు అసలు విషయం చెప్పు"

ఇంతలో పక్కింటి సూరిబాబు వచ్చి

"ఆంటీ ఈ పుస్తకం మా అమ్మ నీకిచ్చెయ్యమంది" అని చెప్పి తుర్రుమన్నాడు.

"ఈ అబ్బాయిని నీకు తెలుసా- వీడికి క్రికెట్ అంటే మహాపిచ్చి. టెన్త్ పుస్తకాలన్నిటి మీద ఉన్న తన పేర్లు కొట్టేసి 'కపిల్‌దేవ్ కపిల్‌దేవ్' అని రాసేశాడు. ఫ్రేంలో ఉన్న వాళ్ళనాన్నగారి ఫొటోతీసేసి రవిశాస్త్రి ఫొటో పెట్టేశాడు" అని నవ్వింది సరోజ. శేఖరమూ నవ్వాడు.

"సరే అసలు విషయానికొద్దాం ఇది సమ్మర్ వెకేషన్‌గదా"

"ఔను అది మాకు నీకు కాదు"

"అది సరే నేనో ప్రపోజల్ పెడుతున్నాను. ఏమంటే ఈ సమ్మర్‌లో పులికాట్ సరస్సుకి ఎక్స్‌కర్షన్ వెడదామని. నాతో వచ్చేవాళ్ళు రావచ్చు"

"పులికాట్ అంటే ఎక్కడుందది?"

"అది మన రాష్ట్రంలో పెద్దపక్షుల సంరక్షణా కేంద్రం. నెల్లూరు జిల్లాలో దుగిరాజపట్నం నుంచి తమిళనాడు సరిహద్దుగా ఉన్న ఆరంబాకం వరకూ పులికాట్ లేక్ ఉంది".

"ఏమిటీ అక్కడున్న విశేషం?"

"దేశదేశాలనుంచి రకరకాల పక్షులు ప్రతి





సంవత్సరం అక్కడికి వస్తాయ్. కొన్నాళ్ళుండి వెళ్ళిపోతాయ్. అవి వచ్చివెళ్ళేది అక్టోబరు మే మధ్యకాలంలో. ఇది బెస్ట్ టైం వాటిని చూడ్డానికి. ఆ పక్షులది మతి చెడగొట్టే అందం. అవి చేసే శబ్దాల్లో వాటి కూతల్లో వినబడే సంగీతం వినసొంపుగా ఉంటుందిట"

"నీతో మా గౌరి వస్తుందేమో తీసుకువెళ్ళు"

"నీమాటల గారడీ నాకూ తెలుసు నీ మాటేమిటో ముందు చెప్పు"

"గౌరి వస్తానంటే నేనూ ఓకే"

"గౌరి రానంటే"

"నేనూ రాను"

"ఎవరూ నాతో రాకపోతే ఎలా?"

"ఎవరూ రాకపోయినా నీకు మీ శ్వేత ఉందికదా ఆవిడగారు రాకపోదు నాకు తెలుసు"

"ఏమిటో కొత్తమాటలు వినిపిస్తున్నాయ్"

"ఇందులో కొత్తేంలేదు పాతదే అందరికీ తెలిసిందే. ఇంతకీ ఆమెగారితో చెప్పకుండానే ఉన్నావా ఇప్పటివరకూ?"

"ప్రామిస్. ఇంతవరకు ఈ ప్రపోజల్ ఎవరితోనూ చెప్పలేదు మా గౌరికి కూడా - ఫస్ట్

ప్రిఫరెన్స్ నీకే"

"అన్నీ ఉత్త కబుర్లు శ్వేతతోబాటు శ్రీలతా బయలుదేరుతుందని నీ ఉద్దేశం"

"అబ్బ వాళ్ళమాటెందుకు? నీ సంగతి ముందు చెప్పమంటుంటే..."

"గౌరి వస్తే నేను రెడీ"

"గుడ్... మరి ఫీ పేరెంట్స్‌కి ఇది నువ్వు చెబుతావా, నేను చెప్పనా?"

"అదేం ప్రశ్న? ఇద్దరం చెబుదాం"

"ఓకే" అంటూ లేచాడు శేఖరం.

అప్పుడు అంది సరోజ "నా గదిని నేనే బాగుచేయించుకొన్నాను. సంవత్సరంపాటు నాకొచ్చిన జీతం అంతా ఇలా ఖర్చుచేసేశాను. నా సాలరీలో ఏమీ తీసుకోరుగా మా ఫాదరు ఏదో నా టేస్ట్‌కి తగినట్టు చేయించాను"

"గుడ్ .యూ లైక్ అట్ మోస్ట్ డీసెన్సీ" అన్నారు.

"ఓ చిన్న సందేహం..." అంటూ మొదలెట్టి

"మనం ఎక్స్‌కర్షన్‌కి వెడితే అక్కడ కనీసం రెండు రోజులైనా ఉండాలిగదా ఎక్కడుంటాం?" అందామె.

"లాడ్జిలో..."

"హమ్మో- లాడ్జిలోనే..."

పకపకా నవ్వాడతను.

"ఊరికే అన్నాను సరోజా- అయినా కరాటే నేర్చిన కాంతలు అంత కంగారు పడకూడదు" అన్నాడు.

"సరేగానీ ఆ లాకెట్‌ని కాస్త వదిలిపెట్టు చాలాసేపటి బట్టీ నీ వేళ్ళమధ్య నలిగిపోతోంది" అన్నాడతను.

"అడగడం మరచాను" అని సరోజ ఏదో అనబోతుంటే

"నువ్వు అడగడం మరచిపోతావ్ చెప్పడం మరచిపోతావ్ ఇప్పుడు అడుగుతావో చెబుతావో ఏదో ఒకటి కానియ్" అన్నాడు నవ్వుతూ.

సరోజ నవ్వింది.

"గౌరి చాలాబాగా పేపర్స్ ఆన్సర్ చేసిందని విన్నాను. వినడమేమిటీ గౌరే చెప్పింది. ఆమెకి ఎంత పర్సెంట్ ఎక్స్‌పెక్ట్ చేస్తున్నావ్?" అంది.

"చెప్పడం కష్టం"

"అదిగో అక్కడేఉంది నీతో పేచీ"

"ఎలాగైనా- నీకంటే నాలుగు మార్కులు తక్కువే రావచ్చు"

"మనుమల్ని ములగచెట్టెక్కించడంలో నీ తర్వాతే ఎవరైనా" అంది సరోజ.

★ ★ ★

గూడూరులో వీర్రాజుగారి మిత్రుడైన అక్కడి ఎం.ఎల్.ఎ ఏర్పాటు చేసిన బసలో దిగారు శేఖరం, సరోజ, శ్వేత, గౌరి, శ్రీలత. అది ఓ బిజినెస్ మాగ్నెట్‌గారి భవనం. ఆ వేళ ఉదయం షవర్‌బాత్ ముగించి శ్వేత తలచిక్కు తీసుకుంటుంటే కలర్ టీవీలో క్లోజప్‌షాట్‌లా అనింది శేఖరానికి. మనోహరంగా అలంకరించుకున్న సరోజ స్వయంవరంనాటి సీతలా ఉంది.

"ఎక్స్‌కర్షన్‌మాట ఎలాఉన్నా బస ఇంద్రలోకంలా ఉంది" అంది శ్రీలత.

"ఈ ఎ.సి. నాకసలు పడదు బాబూ" అంది గౌరి.

ఆ వేళంతా అక్కడ రెస్ట్ తీసుకుని మర్నాడు పులికాట్ లేక్‌కి బయలుదేరారు బృందమంతా.

స్పాట్ చేరాక మతిపోయినట్టయింది వాళ్ళకి.ఎన్నివందల రకాల పక్షులున్నాయ్ అక్కడ! వాటి రంగులు ఎవుడూ ఎవరూ చూసి ఎరుగరు. డిసెంబరు నాటికే అన్నీవచ్చి చేరాయట. ఇంకో నెల్లాళ్ళకంటె ఇక్కడ ఉండవట. ఎక్కడికి ఎగిరిపోతాయో మరి!

"ఏ దేశం నుంచి వచ్చినవి ఆదేశానికి వెళ్ళిపోతాయ్" అన్నాడు అక్కడ ఓ ఉద్యోగి.

పక్షుల్నిచూస్తూ ఓ చోటునించి మరో చోటుకి వెడుతుంటే మధ్యలో ఐదుగురూ వాళ్లలోవాళ్లు వేళాకోళాలు, ఎత్తిపొడుపులు, కేరింతలు, నవ్వులు, నానాగోల చేస్తున్నారు. భలే హుషార్‌లో ఉన్నారు వీళ్లు అనుకున్నారు శేఖరం.

పులికాట్ విశేషాలు చెప్పాడతను. అందరూ శ్రద్ధగా విన్నారు. తమిళనాడు బోర్డరునుంచి నెల్లూరుజిల్లా బోర్డరువరకు విస్తరించి ఉంది





ఆ ప్రదేశం. ఎటుచూసినా వెయ్యికి తక్కువకాకుండా పక్షులు ఒక బారులో కనిపిస్తున్నాయ్. అవి తెల్ల పక్షులైతే చలవరాతితో కట్టి తెల్లపెయింట్ వేసిన బ్రిడ్జిలా కనిపిస్తుంది ఆ వరస. ఖండ ఖండాంతరాల్లో ఉండే పక్షులకి వేసవి విడిది పులికాట్ సరస్సు. అందులో పక్షులు కేరింతలు కొడుతుంటే చూసేవాళ్ళ మనసు ఆనందంతో పొంగిపోతుంది. దాదాపు వంద రకాల పక్షులు, విభిన్న జాతులకు చెందిన పక్షులు అక్కడ స్వేచ్ఛగా విహరిస్తాయ్. ఆకాశంలోకి ఎగిరే పక్షులు ఒకటీ రెండుగా ఎగరక గుంపులుగుంపులుగా ఎగురుతాయ్. అదే ఓ అద్భుతమైన దృశ్యంగా అపూర్వమైన అనుభూతిగా చూపరుల మస్తిష్కంలో మిగిలిపోతుంది.

అప్పుడే మింటికెగిసిన ఫ్లెమింగోస్‌లను వాళ్ళకి చూపించాడు శేఖరం. వాటినే మనం సముద్రపు రామ చిలుకలంటాం. ఫ్లెమింగోస్ ఎగిరినట్టు గ్రేపెలికాన్‌లు ఎగరలేవు- అంటూ గ్రేపెలికాన్లని కూడా వాళ్ళకి చూపించాడు.

రంగురంగుల పక్షుల్ని చూసి ఆశ్చర్యపోతున్నారు- పేర్లు తెలియని పక్షులు ఉన్నా వాటిలో అందం, ఆరోగ్యం, చురుకుదనం చూస్తే సృష్టి వైచిత్ర్యం ఎంత గొప్పది అనిపిస్తుంది. మానవమాత్రుల్లాగా వాటిలో బక్కబక్కగా ఉన్నవీ, కుంటివీ, గుడ్డివీ ఎక్కడా కనిపించవు. పుష్కలమైన ఆహారం వాటికి ఆ సరస్సు అందజేస్తుంది.

పని గట్టుకుని వాళ్లని దూరం తీసుకువెళ్లి బ్రవున్‌హెడెడ్‌గుల్, సన్‌బర్డ్ పక్షుల్ని చూపించాడు శేఖరం. మరోచోట డార్టర్, పర్పుల్ రంప్ట్, ఇండియన్ రఫ్‌హెరాన్ పక్షుల్ని చూపించాడు. అరగంటసేపు వాటిని అలా చూస్తూనే ఉండిపోయారు వాళ్లు. ఇంకోచోట బ్లాక్ హెడెడ్‌గుల్, వైట్‌ఐబీస్ జాతి పక్షుల్ని ఆపక్కనే స్పూన్‌బిల్, ఇండియన్ మూరుహెన్, పెలికాన్ డాబ్‌చిక్ జాతుల్నికూడా వాళ్లు చూశారు. ఆశ్చర్యం! మంచుకొండలా ఓచోట కుప్పలా ఉన్న వందలాది పక్షులు ఒక్కసారి పైకి ఎగిరాయ్ అప్పుడే. తెల్లటి ఆ రంగు పోయి ఎర్రని రంగు కనిపించింది కింద నుంచి. ఆ పక్షులకి పొట్టకింద అంతా ఎర్ర రంగు ఉంటుంది.

"వాట్ ఎ వండర్‌ఫుల్ సైట్" అని చప్పట్లు కొట్టింది సరోజ.

"ఇక్కడికి మమ్మల్ని తీసుకొచ్చినందుకు మీకు మెనీ మెనీ థాంక్స్" అంది శేఖర్‌తో శ్రీలత.

"మీరేం చేసినా గొప్పగానే ఉంటుంది అందులో ఈ ఎక్స్‌కర్షన్ ఒకటి" అంది శ్వేత.

కాస్సేపు ఆగి మళ్లీ శ్వేతే అంది "నేను రానంటే అసలు శేఖరం ఈ ట్రిప్పే కాన్సిల్ చేసి ఉండేవాడు" అని.

ఆమాట సరోజకి కష్టం కలిగించింది.

అసలు విషయం అందరికీ తెలిసిందే శ్రీలత రావడం శ్వేతకి యిష్టంలేదు. శ్వేత రావడం సరోజకిష్టం లేదు. శ్వేతా, సరోజా రావడం గౌరికి నచ్చలేదు.

ఇదంతా ఆడవాళ్ళ అడ్డగోలు వ్యవహారం!

అక్కడినుంచి అందరూ సూళ్లూరుపేట వెళ్లి అక్కడే భోజనాలు చేసి రాత్రికి గూడూరు చేరుకున్నారు.

దార్లో శ్రీలత అడిగింది గౌరిని

"మొన్న నువ్వు చేయించుకున్న గొలుసూ, జూకాలూ ఇవేనా?" అని.

ఔనని ఎంతో ఇదిగా చూపించింది గౌరి.

'ఎక్కడి విషయాలు ఎక్కడికైనా ఇట్టే తెలిసి పోతాయే ఈ ఆడవాళ్ళకి' అనుకున్నాడు శేఖరం. నాలుగు రోజులక్రితం తనే ఈ విషయం శారదమ్మగారికి చెప్పిన సంగతి అప్పుడు గుర్తుకొచ్చిందతనికి. రాజమండ్రిలో వాళ్లు అయిదుగురూ కలిసిన ఐదు నిమిషాల్లోనే-

"ఈవిడేగా మీరు చెప్పిన ఫస్ట్ క్లాస్ పోస్ట్ గ్రాడ్యుయేట్?" అని సరోజని చూపిస్తూ ఆమె మొహంమీదే అతన్ని అడిగింది శ్వేత.

'ఔను' అని తప్ప ఇంకేమీ అనలేదతను.

అతన్ని పక్కకి పిలిచి, "ఏదో లోపల పెట్టుకుని, ఏవేవో పైకి మాట్లాడేది ఈవిడేగా?" అని శ్వేత గురించి సరోజ అడిగింది.

నవ్వి ఊరుకున్నాడేగాని ఏమీ అనలేదు శేఖరం.



ఇవన్నీ మళ్లీ మళ్లీ జ్ఞాపకానికి వస్తున్నాయ తనికి.

'కొంప దీసి ఇక్కడి కబుర్లు అక్కడా, అక్కడి సంగతులు ఇక్కడా చెబుతున్నాడా ఏమిటి, అన్నయ్య. అతననుకున్నంత బ్రాడ్ మైండెడ్ కాదు ఆడవాళ్లు' అనుకుంది గౌరి.

'ఆడవాళ్ళ మధ్య ఇల్ ఫీలింగ్‌కి అర్థమూ ఉండదు అవధులూ ఉండవు' అనుకున్నాడు శేఖరం.



వీర్రాజుగారింటికి వెళ్లాడావేళ శేఖరం.

ఎప్పుడూ పదిమందితో సందడిగా ఉండే ఆ ఇల్లు ఏ హడావుడి లేకుండా ఉందావేళ. 'హమ్మయ్య కాస్త తీరుబడిగా మాట్లాడవచ్చు' అనుకుంటూ లోపలికి వెళ్లాడు. వీర్రాజుగారు ఒక్కరే గదిలో పేపరు చదువుతూ కూర్చున్నారు.

శేఖరాన్ని చూసి "రావయ్యా రా, రా" అన్నారు.

చిరునవ్వు నవ్వుతూ ఆయనకెదురుగా సోఫా మీద కూర్చున్నాడు శేఖరం.

"ఏమిటి విశేషాలు? రాజమండ్రిలో అంతా కులాసాగా ఉన్నారా?" అన్నారాయన.

"ఆఁ... మీ దయ వల్ల..."

"నాదేముందయ్యా అంతా పైవాడి దయ"

అక్కడే ఉన్న మరో పేపరు హెడ్‌లైన్స్ చదువుతున్నాడు శేఖరం. పేపరంటే ప్రాణం అతనికి. వీర్రాజుగారికి తెలుసు శేఖరంలో విశేషం ఏమిటంటే పేపరంతా చదువుతాడు. చదివిందంతా జ్ఞాపకం ఉంటుంది. చెప్ప మంటే వినసొంపుగా చెబుతాడు. ఆ నేర్పు అందరికీ రాదు.

ఇంతలో వీర్రాజుగారన్నారు

"ఏమిటయ్యా రాజకీయ విశేషాలు? రెండు రోజులబట్టీ సరిగ్గా పేపరే చూడలేదు. ఎక్కడా తీరిక ఉండటంలేదు"

"నాకు తెలుసండి నిన్న ఏదో ఊరు వెళ్ళారటగదా. మీటింగ్ ప్రిసైడ్ చెయ్యడానికి?"

"ఒక్క మీటింగులే ఏమిటయ్యా- ప్రతిదానికీ చంపుకుతింటున్నారు నన్ను- ఈ మాత్రమైనా ఓపిక భగవంతుడిచ్చాడు కనకగాని..."

"ఎం.ఎల్.ఎ.గారంటే మరి అలాగే ఉంటుందండి- ఆయన అందరికీ కావలసిన మనిషి..."

ఆవేళ కొంతసేపు ఇద్దరూ ఎన్నో విషయాలు చర్చించారు. కదిపితే చాలు కావలిసినంత ఇన్‌ఫర్‌మేషన్ వస్తుంది శేఖరం నించి అనిపించింది ఎం.ఎల్.ఎ గారికి. డాక్టర్ అంబేద్కర్ చేసిన వర్క్ గురించి చెబుతూన్నప్పుడు కుల, మత బేధాలను గురించి కాస్త స్ట్రెస్ చేసి చెప్పాడు శేఖరం.

ఇప్పుడు కులం, మతం పేరుతో కొట్టుకుచస్తున్న ప్రజల్లోని విరోధభావం శతాబ్దాలక్రితంనించీ వస్తున్నదే. అయితే ఇందులో ఉండే ప్రమాదాన్ని అన్యాయాన్ని గుర్తించి కొందరు పెద్దలు మత సామరస్యానికి కృషి చేశారు. స్వార్థపరులెందరో 'నా మతం, నా కులం' అంటూ జనాన్ని రెచ్చగొట్టి దేశంలో చిత్త క్షోభని, రక్తపాతాన్నీ కలిగించారు.

పన్నెండో శతాబ్దంలో ఆవిర్భవించిన శైవ వైష్ణవ మత దుమారం ఇంతా అంతాకాదు. పల్నాటియుద్ధం ముందే కులం మీద దండెత్తిన బ్రహ్మానాయుడికి యుద్ధవీరుసిగానే గాకుండా సంఘసంస్కర్తగా ప్రజలు బ్రహ్మారథం పట్టారు. వివిధ వర్ణాలకి చెందిన స్త్రీలని వివాహమాడి తన ఆదర్శం ప్రదర్శించాడని ప్రతీతి.

పదిహేనో శతాబ్దంలో జీవించిన కబీరు మత సామరస్యాన్ని గురించి ప్రబోధించినవాళ్లలో అగ్రగణ్యుడు. వేమన, తులసీదాసు, పోతులూరి వీరబ్రహ్మం లాంటివాళ్లు కుల మత విబేధాలు పాటించడం అనాగరిక





# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి,
పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి
సెరిలాక్ లాభాన్ని అందించండి.
పోషకాహార లాభం : సెరిలాక్
ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి
కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు,
కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు,
విటమిన్లు, ఖనిజాలు అన్నీ వున్నాయి.
అన్నీ సమ పాళ్ళల్లో వున్నాయి.
రుచి లాభం : పాపాయికి సెరిలాక్
రుచి ఇష్టం.
సమయం ఆదా లాభం : సెరిలాక్
ముందుగా వండినది. దానిలో పాలు,
పంచదార వున్నాయి. దానిని వెచ్చటి
నీటితో కలిపితే చాలు.
ఎంపిక లాభం : ఎంచుకొనేందుకు
మూడు రకాల సెరిలాక్ వుంది.
మీ పాపాయికి సమతూకంలో
పోషకాహారాన్ని అందించేందుకూ,
తయారుచేయటంలో పరిశుభ్రతను
పాటించేందుకూ, డబ్బా మీద
సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాల నుంచీ




4 మాసాల నుంచీ




6 మాసాల నుంచీ

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008




FSL/5112/TEL

సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణంఎంతో రుచికరం

లక్షణం అని చెప్పారు. అయినా కులాల మధ్య కీచులాటలు, కొట్లాటలు పెచ్చు పెరిగి ఈనాటికీ కులం కులం మధ్య కోటగోడలు లేచిపోయాయ్' మీకంటె మేం ఏవిధంగా తక్కువవాళ్ళం?' అంటూ ఒకళ్ళ మీద ఒకళ్లు నిప్పులు పోసుకోడం పరిపాటి అయిపోయింది.

కులాలతోనే చస్తుంటే మళ్లీ అందులో శాఖలు. మనిషికి ఔన్నత్యాన్ని తెచ్చేది గుణంకాని కులం కాదు. ఇది ఎవరూ పట్టించుకోరు. దేశానికి ఆయువుపట్టు గ్రామం. దేశంలో లక్షల సంఖ్యలో గ్రామాలు ఉన్నాయ్. ఇవన్నీ కుల కక్షలతో కుతకుతలాడిపోతున్నాయ్. పాతరాతి యుగాన్ని గుర్తుచేసే హింసా ప్రవృత్తి చోటు చేసుకుంటూంది. ఇండియా ఓ సెక్యులర్ స్టేట్ అంటోంది మన రాజ్యాంగం. అయినా దేశంలో ఎక్కడ చూసినా మత సహనం కనిపించదు. వృత్తుల్నిబట్టి కులాలు ఏర్పడ్డాయి అని అనుకున్నా ఒకప్పటి ఆ వృత్తులూ, పద్ధతులూ ఇప్పుడు లేవు. బ్రాహ్మలు పౌరోహిత్యమే చేయటంలేదు బార్లూ, కార్లూ కూడా నడుపుతున్నారు. క్షత్రియులు వ్యవసాయమూ చేస్తున్నారు, వ్యాపారమూ చేస్తున్నారు. వైశ్యులు ఉద్యోగాలు చేస్తున్నారు, రాజకీయాలు నడుపుతున్నారు. శూద్రులు సేవా వృత్తే చేయడంలేదు. ఐ.ఎ.ఎస్. అధికారులుగానూ ఉన్నారు, పారిశ్రామికవేత్తలుగానూ ఉన్నారు. మరి ఎందుకు ఈ కుల సమరం? ఒకనాటి మహారాష్ట్ర పీష్వాలు కులానికి బ్రాహ్మలు. వృత్తిరీత్యా రాజులు. అలాగే కొందరు క్షత్రియులు కులానికి రాజులయినా వృత్తిరీత్యా వ్యాపారస్తులు. ఇప్పుడు కులాలని బట్టి వృత్తులూ లేవు. వృత్తుల్నిబట్టి కులాలూ చెప్పలేం. మరి ఎందుకీ కుల వ్యవస్థ? ఆర్థిక వ్యవస్థే సమూలంగా మారిపోతూంటే ఎందుకీ కులాల కుమ్ములాటలు?'' అన్నాడు శేఖరం.

"నిజమేనయ్యా మనదేశంలో ఉన్నంతగా ఈ కులజాడ్యం ఇతర దేశాల్లో లేదు'' అన్నారు వీర్రాజుగారు.

"ఔనండి- అక్కడవాళ్ళకి మతం మీదే వాళ్ళకి దృష్టి. క్రిష్టియన్ మతంలో ఉన్నవాళ్ళంతా క్రిష్టియన్స్. అలాగే మహమ్మదీయులదంతా మహమ్మదీయ మతమే. ఇండియాలో అయితే ముస్లింల్లోనే అనేక కులాలు, వర్గాలు. వాటికి రకరకాల పేర్లు. ఆషాఫ్, షేక్, సయ్యిద్, మొగల్, పఠాన్ మొదలైన పేర్లు అవే. అన్సారీ, ఖురేషి అనే పేర్లు గలవాళ్ళు తక్కువ కులాలవాళ్ళుగా చూడబడతారట. క్రైస్తవుల్లో కూడా మాల క్రైస్తవులనీ, రెడ్డి క్రైస్తవులని ఇలా ఏవేవో పేర్లతో పిలుస్తుంటారు. వీళ్ళలో వీళ్ళకి స్టేటస్‌లో ఏదో తేడాలు ఉన్నట్టు ఫీలవుతారు. కనుకనే జాషువాలాంటి కవులు అర్థం పర్థం లేని ఈ వైషమ్యాలను ఎంతగానో నిరసించారు. ఏది ఏమైనా కులం మాత్రం పదిలంగా పెంచి పోషింపబడుతూనే ఉంది. ఉత్తరాదిని అంబేద్కర్, కర్నాటకలో బసవ లింగప్ప, మహారాష్ట్రలో మహాదేవ రెనెడె, ఆంధ్రలో త్రిపురనేని రామస్వామి, గోరాగార్లు ఈ కుల జాడ్యం మీద దండెత్తారు. అయినా ఎక్కడ వేసిన గొంగళి అక్కడేలా ఉంది.

ఇంతకీ నే చెప్పదలచుకున్నదేమంటే- మీరు పెద్దలు- మీహయాంలో మీకు సాధ్యమైనంతవరకు ఈ కుల భేదాలని, వర్గవైషమ్యాల్ని రూపుమాపేందుకు ప్రయత్నించండి. అది కొంతలో కొంత జనసామాన్యాన్ని రక్షిస్తుంది.- మీకు చెప్పగలంతటివాణ్ణి కాను'' అన్నాడు శేఖరం.

"తప్పకుండా...''అన్నారు ఎం.ఎల్.ఎ గారు.

"ఇంక వెళ్ళి వస్తానండి'' అని శేఖరం లేచాడు.

"నేను కాస్త తీరుబడిగా ఉన్న టైములో నువ్వు వచ్చావు- శేఖరం. నిన్ను ఓ విషయం అడగాలి. ఇంత నాలెడ్జి ఉన్నవాడివి, ఎం.కాం చదివినవాడివి నీకు ఈ ఉద్యోగమేమిటయ్యా? ఇంతకంటె మంచిది దొరకలేదా?'' అన్నారు వీర్రాజుగారు.

"ఏదో నాకు ప్రాప్తమున్నంతవరకు ఇదే దొరికింది- దీనికే సంతోషం'' అన్నాడు శేఖరం.

"అలా కాదు- మంచి పోస్టులకి నువ్వు ప్రయత్నం చేయలేదా?''

"నా ప్రయత్నంలో లోపం ఏం లేదండి- కాలం కలిసి రాలేదు- అంతే''

"అంటే...?''

"మీకు తెలియందేముందండీ- ప్రపంచం





ఎంత మారిపోయిందో నేను చెప్పనక్కర్లేదు- ఈ రోజుల్లో క్వాలిఫికేషన్ ఎవడిక్కావాలి? సమర్థత చూసేదెవరు? ఎవరికైనా కావలసింది "అస్మదీయుడు"- రికమండేషన్లతో వచ్చే మనిషి- బరువుతో తమను తృప్తిపరచగల మనిషి. వీటన్నిటికీ నేను దూరం. రెండు మూడుచోట్ల నా క్వాలిఫికేషన్ నాకు అవరోధమై కూర్చుంది..."

"అంతేగాదు- నీ నాలెడ్జి కూడా నీకు శత్రువే"

నవ్వాడు శేఖరం.

"మీ ఫైనాన్సియల్ పొజిషన్ నాకు తెలును. మీ నాన్నగారిని నేను బాగా ఎరుగుదును. ఆయన ఉత్తముడు. నువ్వు లా పూర్తి చెయ్యి- చూద్దాం"

ఏమీ అనలేదు శేఖరం.

"అన్నట్టు మీ చెల్లెలికి ఆమధ్య ఏదో వైద్యం చేయించారని విన్నాను- ఇప్పుడు కాస్త నయమేనా?"

"పెద్ద ఇంప్రూవ్‌మెంట్ ఏం లేదండి"

"మీ ఇంటికి ఎప్పుడో మీ నాన్నగారు బాగున్నరోజుల్లో వచ్చేను. పది పదిహేనేళ్ళయి ఉంటుంది. అప్పుడే చూడ్డం మీ గౌరిని" అన్నారాయన.

"మొన్న ఎం.ఎ. ఫైనల్‌కి వెళ్ళిందండి"

"అలాగా- వెరీగుడ్- నువ్వున్నావ్ కదటయ్యా వెనకాల- క్లాసులో పాసవుతుంది.అన్నట్టు నీకూ ఇది ఎల్.ఎల్.బి. ఫైనలియర్ అనుకుంటాను?"

"ఔనండి- పరీక్షల ముందు ఓ రెండు నెలలు సెలవు పెడదామనుకుంటున్నాను"

"వద్దు వద్దు సెలవు పెడితే ఏ చిక్కైనా రావచ్చు- నువ్వు ఇక్కడే ఉండాలి- అయినా నీకు సెలవెందుకయ్యా?"

"మరి నేను వెళ్ళివస్తానండి"

"మంచిది- రేపు ఏలూరు వెడుతున్నాను. నువ్వు మళ్ళీ ఓ వారం రోజుల తర్వాత నన్ను కలుసుకో" అన్నారాయన.

తిరిగి రూంకి బయలుదేరాడు శేఖరం.

నిజానికి అతను ఉద్యోగాన్వేషణలో కొన్నిచోట్ల అవమానపడ్డాడు. కొన్నిచోట్ల దగాపడ్డాడు. ఒక దశలో ఉద్యోగమే రాదేమో అని భయపడ్డాడు.

నాలుగేళ్ళ క్రితం తను సర్వీస్ కమిషన్ పరీక్షలకి వెళ్ళాడు. లెక్చరర్ కావాలనే ఉద్దేశంతో చాలా బాగా రాసాడు. సెలక్షన్ కాలేదు. తర్వాత ఎక్సైజ్ డిపార్ట్‌మెంటులో ఖాళీలున్నాయని తెలిసి ప్రయత్నం చేసాడు. ఫలించలేదు. 'రోజుల్ని బట్టి నువ్వు పోవాలయ్యా' అన్నారు మిత్రులు. ఆలోచించాడు. ఆ దారే తొక్కాడు. మూడు వేలు వదిలిపోయాయ్. ఫలం దక్కలేదు. ఎవరికి చెప్పుకోగలడు? చెప్పి ఏం ప్రయోజనం. ఎవడు ఎంత బాధపడితే ఎవడిక్కావాలి ఈ రోజున? అందరికీ కావాల్సింది డబ్బు. ప్రజల్ని మోసం చేసి ధనవంతుడైనవాణ్ణి 'మోసగాడు' అనటం లేదు లోకం. అతని మోచేతి కింద నీళ్ళు తాగడానికే వెంపర్లాడుతోంది.

తను చేసే పూజల్ని గురించి కూడా అవహేళన చేసినవాళ్ళున్నారు. 'ఏమిటో వీడి పిచ్చి గాని- పూజల వల్ల పనులు జరుగుతాయా' అన్నవాళ్ళు తనకు దగ్గరవాళ్ళే. ఎం.కాం చదివింది చాలక ఇంకా 'లా' చదువుతున్నాడుట ఎందుకూ? మంచి ఉద్యోగమే చూసుకోలేకపోయాడు అని కృష్ణమూర్తిగారే అన్నారని తెలిసి బాధపడ్డాడు. ఇదంతా వీర్రాజుగారికి చెబుదామని ఒకటి రెండు సార్లు అనిపించకపోలేదు. చెబితే తాను ఇంకా చులకన అవుతాడు తప్ప ఏం ప్రయోజనం? కనుకనే చెప్పలేదు. చెప్పకపోయినా గ్రహించగలవాడు ఆయన.

★ ★ ★

మేడమీద శేఖరం చెయ్యికాల్చుకుంటున్న టైములో టెలిగ్రాం వచ్చింది. విప్పి చూశాడు.

సరోజ ఎం.ఎ ఫస్ట్‌క్లాసులో పాసయింది.

అది తను ముందునుంచీ అనుకుంటున్నదే కనుక పెద్దగా ఆశ్చర్యపడలేదు శేఖరం. పైగా నిన్న పొద్దున్నే రిజల్సు పత్రికలో చూశాడుకూడా.

మర్నాడు ఉత్తరం వచ్చింది గౌరినుంచి-

"నేను ఎం.ఎ పాసయ్యాను. ఫస్ట్‌క్లాస్ వచ్చింది. నీకు ఋణపడివున్నాను అని రాయడానికే ఈ ఉత్తరం మొదలుపెట్టాను. కాని



తేడబుట్టినవాడికి ఋణపడ్డం ఏమిటి? అని అమ్మ తప్పుపట్టింది కనుక ఆమాట రాయటంలేదు. నా జీవితాంతం నీకు కృతజ్ఞురాలిని- విజయగౌరి"

సరోజ, గౌరి యిద్దరి సంస్కృతిలో ఎక్కడో సూక్ష్మమైన తేడా ఉన్నట్టు అనిపించింది శేఖరానికి.

నిజానికి ఈ ఇద్దరికీ తీసిపోని తెలివితేటలు శ్వేతవి. కల్చర్‌కూడా చెప్పుకోదగ్గదే. కాని అవి ఎంతవరకు సద్వినియోగం అవుతున్నాయా అన్నదే ప్రశ్న- అనుకున్నాడు.

ఇంతలోనే ఒగర్చుకుంటూ మేడ మెట్లెక్కి వస్తున్న శ్వేత కనిపించింది. చేతిలో పేపరు ఉంది.

"సార్.. నేను బి.కాం పాసయ్యాను. సెకండ్ క్లాసులో" అంది ఆయాసపడుతూనే.

'కంగ్రాచ్యులేషన్స్' అన్నాడతను.

ఎందుకో ఆమె కంటనీరు పెట్టుకుంది.

"అదేమిటి శ్వేతా... ఏమయిందనీ?"

"నాకు మీరు పాఠాలు చెప్పలేదుగా- నేనంటే మీకు కోపం. లేకుంటే నాకూ ఫస్ట్‌క్లాస్ వచ్చేది సరోజలాగే"

"సరోజకి ఫస్ట్‌క్లాస్ వచ్చిందని నీకెలా తెలుసు?"

"మీ చేతికి టెలిగ్రాం చేరింది నేను చూశాక"

శ్వేతలో మంకుతనం పదిశాతం ఉంటే పెంకితనం ఇరవై ఉంటుంది. మాటల నేర్పు మరో పదిశాతంవుంటే ఇంటిలిజెన్స్ నలభై శాతం. తక్కిన ఇరవై చురుకుతనం. అంటే ఎంత చురుకో అంత పెంకి. సరోజ విషయానికొస్తే ఆమెగారూ దాదాపు ఈ బాపతే. కాకపోతే పర్సంటేజిల్లో కాస్త తేడా ఉండొచ్చు. సరిగ్గా తూకం వేసినట్టు చెప్పడం కష్టం. ఔను మరి- ఇద్దరూ ఒకలా ఎప్పుడూ మసలుకోరు, వినుక్కోరు. పట్టువిడుపుల్లో ఇద్దరూ ఒకలాగే కనిపించినా శ్వేతే కాస్త మెతక. కోపం వస్తేమటుకు ఉతికి ఆరేసే విద్యలో ఇద్దరి ఫోర్సూ ఒకటే!

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" అంది శ్వేత.

"అబ్బె... ఏంలేదు... ఏదో..."

"సీన్‌లోకి ఎవరొచ్చారో తెలుస్తూనే వుంది"

"అదేంకాదు శ్వేతా- మా గౌరినించి ఉత్తరం వచ్చింది. దానికీ ఫస్ట్‌క్లాస్ వచ్చిందట"

"ఇది చెప్పడానికి అంత ఆలోచన ఎందుకు?"

నవ్వేడు శేఖరం.

"ఈ సంవత్సరమైనా నాకు పాఠాలు చెప్పండి- ప్లీజ్... ఎం.కాం చదువుతాను. మీ అంతటి చదువు చదవాలని ఉందినాకు" అంది శ్వేత.

'అంతవరకూ నేనిక్కడ ఉండొద్దూ?'

"ఆఁ ! వెకేట్ చేసి వెళ్లిపోతారా? నిజంగా?"

"మా లా రిజల్ట్స్ కూడా వచ్చాయి.ఎల్.ఎల్.బి పూర్తయింది. ఓ మంచి పోస్టుకోసం ట్రై చేస్తున్నాను"

ఏదో తను పోగొట్టుకుంటున్నట్టు బాధ. రాబోయే మంచిరోజులు దారిలోనే ఆగిపోయినట్టు ఏదో నిస్పృహ- ఆమె కళ్లల్లో.

"మీకు ఆ పెద్ద పోస్టు ఏదో రాకుండా ఉండుగాక! అపుడిక ఇక్కడే ఉండక ఏంచేస్తారు?" అంది శ్వేత.

అంతఃకరణ మంచిదైనచోట మాటకాస్త రివగ్నింట్‌గా ఉన్నా అది మంచిమాటే అవుతుంది అనిపించింది శేఖరానికి.

"నామీద నీకంత అభిమానం ఉందనుకోలేదు" అన్నాడు.

"ఎలా అనుకుంటారులెండి- అయినా అనుకోడానికీ, అనుకోకపోవడానికీ మీ చేతుల్లో ఏముందనీ? సెంట్రల్ పవర్ అంతా రాజమంత్రి ఈజీ చైర్‌లో ఉంటే...." అంది శ్వేత.

నవ్వాడతను.

"ఎందుకానవ్వు?"

ఇంతలో కిందనుంచి సైరన్ మోత వినిపించింది శ్వేతా.... అంటూ.

చటుక్కున వంగి శేఖరం పాదాలకి నమస్కరించి వెళ్లిపోయింది శ్వేత. 'అంతా క్షణకాలం పట్టలేదు. ఏమిటీ విపరీత చర్య?' అనుకున్నాడు.

ఈ ప్రణామం ఏ పరిణామానికి దారితీ





స్తుందో!

'మన దారికే...' అని పకపకా శ్వేత వెనక నిలబడి నవ్వినట్టు అనిపించిందతనికి.

కాస్సేపు కింద అమ్మకళ్లముందు ఏదో పని చేస్తున్నట్టు అదీ ఇదీ సర్ది శ్వేత మళ్లీ మేడమీదికి తుర్రుమంటూంటే-

"ఎక్కడికే ఆ పరుగు మళ్లీ? ఆయన వెళ్లిపోయి అరగంటైతేనూ?" అంది అమ్మ.

"అదేమిటే- నేను చూడనేలేదే. ఆఫీసుకి ఇంకా టైము కాలేదే"

"ఆఫీసుకి కాదు వెడతా... రాజమండ్రి..."

"నిజం? రాజమండ్రీ ఎందుకు? మొన్ననే గదా వెళ్లొచ్చారు?"

"ఇప్పుడే ఇంకో టెలిగ్రాం వచ్చిందిగా?"

"ఆఁ ! ఇంకో టెలిగ్రామా?"

"ఏమిటో... అంతా గుడ్డి మాలోకం. వాళ్ల చెల్లెలికి ఏదో సంబంధం వచ్చిందట. విశాఖపట్నం నుంచి పిల్లని చూసుకోడానికి రేపు పొద్దున్నే దిగుతున్నారట వాళ్లు. అందుకు- పాపం పరిగెత్తుకెళ్లాడు"

'నాకు తెలియనే తెలియదు' అంది శ్వేత.

"ఏమిటే మాటిమాటికీ నేను చూడనేలేదే- నాకు తెలియనేలేదే అంటావ్ అర్థంపర్థం లేకుండా. అసలు నీ ఉద్దేశం ఏమిటి? ఎలా తెలుస్తుంది నీకు?" అందామె.

"అను- ఇంకా అను.. ఆపేశావేం? చదవేస్తే ఉన్న మతిపోయిందనికూడా కలుపు. అప్పటికి ఆ ఫోర్స్ కంప్లీట్ అవుతుంది" అంది శ్వేత.

★ ★ ★

కాబోయే చుట్టాలు స్టేషన్‌లో దిగారు. అరగంట ముందునుంచే కాసుకుకూర్చున్న శేఖరం వాళ్లని రిసీవ్ చేసుకున్నాడు. ఎప్పుడో రెండు నెలలక్రితం తను వైజాగ్ వెళ్లడం, వాళ్లని పెళ్లిచూపులకి ఆహ్వానించడం, వాళ్లు చూద్దాంలెండి అనడం జరిగింది. నిజానికి వాళ్లు బాగా ఉన్నవాళ్లు. పెద్దపెద్ద కనెక్షన్స్ ఉన్నవాళ్లు. అబ్బాయి డబుల్ గ్రాడ్యుయేట్. పేరు శ్యామసుందర్. మంచి పర్సనాలిటీ. ఉద్యోగమూ పెద్దదే. వాళ్లు నిజంగా వస్తారని అతను ఎప్పుడూ అనుకోలేదు. ఇప్పుడు వచ్చారు. అంటే గౌరికి మంచిరోజులు వచ్చినట్టే!

ఆ వచ్చింది నలుగురు- అబ్బాయి, వాళ్ల అమ్మ, అన్న వదినా.

'ఏం బాబూ కులాసా?' అని ముసలమ్మగారు రైలు దిగుతూనే పలకరించారు.

అదే శుభసూచకంగా ఎంతో సంతోషించాడు శేఖరం.

"మీరు వైజాగ్ వచ్చినప్పుడు నేను ఇంట్లో లేను. ఇదే చూడ్డం మిమ్మల్ని" అన్నాడు అన్నగారు. వదినగారు ఏమీ అనకపోయినా చాలా కలివిడిగా ఉంది ఆమె ముఖం.

వాళ్ళని శేఖరం టాక్సీలో తీసుకువెళ్ళాడు ఇంటికి. దారిలో కారు ఆపమని ముసలమ్మగారు-

"అమ్మాయికి పువ్వులూ, పళ్లూ ఇవ్వాలిరా- కాస్త తీసుకో అని కొడుక్కి పురమాయించింది.

కొద్దిగా పువ్వులూ, రెండు ఆపిల్సూ తీసుకు వచ్చాడతను.

'పెద్ద చదువులే చదివారు- ఎందుకూ?' అన్నట్టు అతనిమీద కళ్ళెర్రజేసి, ఆమెగారే కారు దిగి స్వయంగా వెళ్లి బుట్టెడుపువ్వులు, పాతిక పళ్లూ పట్టుకొచ్చి ఓ వంద కాగితం ఇచ్చారు.

టాక్సీ ఇంటిముందు ఆగేసరికి మాణిక్యాంబగారు వీధిలోకొచ్చి, 'రండి-రండి' అంటూ వాళ్ళని సాదరంగా ఆహ్వానించారు.

ఆవిణ్ణీ, ఆ ఇంటినీ మార్చిమార్చి చూస్తున్నాడు అబ్బాయి శ్యామసుందర్.

లోపలికి వెళ్లాక ముసలమ్మగారన్నారు-

"చూడండీ- మాకేం తొందరలేదు- అమ్మాయికి పువ్వులు బాగాకుట్టి తీసుకురండి"

పది నిమిషాల్లో గౌరిని తీసుకొచ్చి వాళ్ల ముందు కూర్చోబెట్టారు. మాణిక్యాంబగారికి సాయంగా యిద్దరు ముగ్గురు ముత్తైదువులు అక్కడ ఉన్నారు. వాళ్ళకి అది ముచ్చటే.

కర్టెన్ తొలగించుకుని గుమ్మం ఇవతలికి కాలు పెడుతుండగానే గౌరిని చూసారు ముసలమ్మగారు. "అమ్మాయి ఎంత బాగుందిరా" అన్నట్టు పెద్ద కొడుకుకేసి చూసారు. ఆయనా అదే అభిప్రాయంలో ఉన్నట్టు ఆమె గ్రహించింది.





శ్యామసుందర్ చూపు ఎక్కువగా గౌరి ఎడమచేతి మీద ఉంది.

"మాచెల్లెలు-గౌరి- పూర్తి పేరు విజయగౌరి- ఎం.ఎ. ఫస్ట్‌క్లాస్‌లో పాసయింది" అన్నాడు శేఖరం వాళ్ళతో.

'వయస్సు?'

'ఇరవై నాలుగు...'

ఇంకా ఏవేవో అడిగారు వాళ్ళు.

అన్నీ చెప్పారు మాణిక్యాంబగారు.

"ఇవి మా గౌరి రాసిన ఇంగ్లీషు ఆర్టికల్స్, ఇవి తెలుగు వ్యాసాలు" అని ఇంగ్లీషు, తెలుగు డెయిలీలు, వీక్లీలు కొన్ని చూపించాడు శేఖరం.

కొన్ని తీసి చూసారు అన్నగారు. అబ్బాయి అసలు వాటికేసి చూడనేలేదు. మునలమ్మగారు పాత కాలపుమనిషే అయినా ఇదంతా అమ్మాయికి అడిషనల్ క్వాలిఫికేషన్ అని గ్రహించింది.

ఎప్పుడో వాళ్లముందు పెట్టి ఉంచిన స్వీటూ, హాటూ అప్పుడు తీసుకోడం ప్రారంభించారు వాళ్లు. తర్వాత ఫ్రూట్ జ్యూస్ సర్వ్ చేశాడు శేఖరం.

"అమ్మాయికి కాస్త లోపం ఏదో ఉందని మీ అబ్బాయి చెప్పాడు-ఎడంచెయ్యిగదా" అన్నారు మునలమ్మగారు మాణిక్యాంబగారికేసి చూసి.

"అవునండి... ఇప్పుడు బాగా నయం- ట్రీట్‌మెంట్ చేయిస్తున్నాం" అంటూ పైటకాస్త పైకి జరిపి, చెయ్యి చూపించారావిడ.

పెద్ద డిఫెక్టేంకాదు- చెయ్యి మామూలుగానే ఉంది- కాస్త మూవ్‌మెంట్ తక్కువ అనిపించింది అన్నగారికి. 'అది దేనికీ పెద్ద అవరోధం కాదుగా' అన్నారాయన.

ఆ ఒక్కమాటా గౌరికి ఎంతో రిలీఫ్ ఇచ్చింది.

మరికాస్సేపయ్యాక వాళ్లు వెళ్లడానికి లేచారు.

వీధిలో టాక్సీ మళ్లీ రెడీ చేసాడు శేఖరం.

ఏమీ చెప్పకుండానే వెడుతున్నారే- అని మాణిక్యాంబగారు అనుకుంటుండగానే-

'ఓ వారంరోజుల్లో మీకు ఏ సంగతీ తెలియబరుస్తాం' అన్నారు అన్నగారు.

ఆ మాట వాళ్లకి తృప్తికరంగా లేదని మునలమ్మగారికి తెలును. శ్యామసుందర్ నోటమాటే లేకుండా అలా కూర్చునే ఉన్నాడని వాళ్ళకి బాధగా ఉందనీ ఆవిడకి తెలును.

కారు ఎక్కబోతుండగా ఒక్కక్షణం ఆమె ఆగి-

"వదినగారూ- అమ్మాయిని గురించి అంతా ముందే వాకబుచేసి ఇలా వచ్చాం. అంతకంటే ఎక్కువగా మీ అబ్బాయి గురించి విన్నాం. భోగభాగ్యాలకి అంతెక్కడ? పిల్ల ముఖ్యం- వస్తాను" అన్నారు.

కారు బయలుదేరింది.

శేఖరంవాళ్ళని రైల్వేస్టేషన్‌కి తీసుకువెళ్లాడు.

ట్రైను ఇక కదుల్తుందనగా మునలమ్మగారు శేఖరంతో అన్నారు-

"చూడుబాబూ- నువ్వోసారి మాఊరురా- అన్నీ మాట్లాడుకోవచ్చు"

'ఎంతగొప్ప మనసు వీళ్లది' అనుకున్నాడు శేఖరం. ఇంతలోనే అన్నగారన్నారు- "ఆలస్యం ఎందుకూ- టూ ఆర్ త్రీ డేస్‌లో బయలుదేరి వచ్చెయ్యండి"

ఇంటి గుమ్మంలో అడుగుపెట్టిన శేఖరం ముఖంలో సంతోషంచూసిన తల్లి అడిగింది- "స్టేషన్‌లో మళ్లీ వాళ్లు ఏమైనా అన్నారా?"

"అనడమేమిటమ్మా- సెటిలైపోయినట్టే"

ఆ... నిజమా? ఏమన్నారు వాళ్లు? సరిగ్గా చెప్పు..."

"నన్ను రెండుమూడు రోజుల్లో వైజాగ్ రమ్మన్నారు. అన్నీ మాట్లాడుకోవచ్చునన్నారు. ఇంకేముంది మాట్లాడ్డానికి? కట్నం గురించే అయి ఉంటుంది"

"అవున్లే- ఆమాటల్లో అర్థమేఅది"

"సరే- ఎల్లుండి త్రయోదశి- ఆవేళే బయలుదేరతాను"

అంతా వింటున్న గౌరికి చాలా సంతోషంగా ఉంది. పాతికేళ్లు పెంచిన ఈ లోకం పాతదైపోయినట్టు కొత్తలోకంలోకి అడుగుపెట్టబోతూన్న

ట్టు అనుభూతి కలిగింది.

'వీళ్లు గట్టెక్కినట్టే...' అని మెజారిటీ అమ్మ లక్కలు అనుకున్నా-

"వీళ్ల మొహం- ఆ పిల్లకి పెళ్లేమిటి- చేసుకొనేవాడు చవట అయితే తప్ప' అని కొందరూ;

"వాళ్ళతో వీళ్ళెక్కడ తూగ్గలరు? చూ శాంగా- ఆవిడ ఒంటిమీదే ఉంది ఏభైకాసుల బంగారం"అని కొందరూ అనుకున్నారు.

"బి.ఏ. చదివాం, ఎం.ఏ. చదివాం అంటూ టాంటాం చేసుకుంటే ఏం సుఖం?- చేతిలో సరిపడా పిక్కలూ లేవు, చేయీ సరిలేదు' అని ఎదురింటావిడే అనడం శేఖరానికి చాలా బాధ కలిగించింది.

"ఔను- లోకం అలాంటిది. ఒకళ్ళు పచ్చగా ఉంటే ఓర్వలేదు. డిఫెక్ట్ ఏమైనా ఉంటే ఇక చెప్పనే అక్కర్లేదు. ఇప్పుడు ఈ ప్రపంచానికి కావలసింది డబ్బు. అదేమాకు ఉంటే వీళ్ళు ఇన్ని మాటలు అనగలిగేవాళ్ళా? మాపిల్ల ఇంతకాలం ఈ ఇంట్లో ఉండేదా?" అనుకున్నారు మాణిక్యాంబగారు.

★ ★ ★

విశాఖపట్నంలో రైలుదిగి వాళ్లింటికి వెళ్లాడు శేఖరం.

అదిపెద్ద మేడ. వెయ్యి గజాల స్థలంలో చుట్టూ కావలసినంత స్థలం వదిలి మధ్యలో అందంగా కట్టిన భవనం. మెయిన్‌గేటుకీ ఇంటికీ మధ్య దాదాపు నలభై గజాలదాకా కాలిబాట. అటూఇటు శ్రద్ధగా పెంచిన పచ్చిక బయళ్ళు. రకరకాల పూలమొక్కలు.

గేటుపక్కనే 'విజయవిహార్' అని ఉన్న పేరుచూసి 'మా విజయపేరు వీళ్ళకి ముందే తెలిసినట్టుందే' అనుకున్నాడు శేఖరం.

లోపలకెళ్ళాడు. అంతా నిర్మానుష్యంగా ఉంది. హాలులోకి వెళ్లేసరికి ముసలమ్మగారు కనిపించారు. సోఫాలోకూర్చుని ఆమె ఏదో వారపత్రిక చూస్తోంది.

'రా బాబూ- కూర్చో' అందావిడ.

అప్పుడే వాళ్ల పెద్దబ్బాయీ, శ్యామసుందర్ మేడమీంచి దిగి వచ్చారు.

"నమస్కారమండీ- మీరు రమ్మన్న ప్రకారం వచ్చేసాను" అన్నాడు శేఖరం నవ్వుతూ.

అన్నగారూ, తమ్ముడూ అక్కడే ఉన్న ఇంకో సోఫాలో కూర్చున్నారు.

"మీరిక్కడున్నారా- మేడమీదున్నారను కుని వెతుకుతున్నాను" అంటూ అన్నగారి భార్య అక్కడికే వచ్చి అత్తగారి పక్కన కూర్చుంది. నలుగురూ ఒక్కచోట చేరడం శుభసూచకం అనిపించింది శేఖరానికి.

ఎంతసేపటికీ ఎవరూ అసలు టాపిక్ ఎత్తడంలేదు. తనే ప్రారంభించడం బాగుండదేమో- మరి ఎలా? ఏమీ పాలుపోక చూస్తున్నాడతను.

పనిమనిషి ట్రేలో టీ పట్టుకొచ్చి అందరికీ ఇచ్చి వెళ్ళింది.

ఇంతలో ముసలమ్మగారు-

"బాబూ- మేము రమ్మన్నాం- నువ్వొచ్చావ్- సంతోషం. సంబంధం గురించి మేం చర్చించాం" అని ఏదో అనబోతూంటే మధ్యలో అడ్డువచ్చి శ్యామసుందర్ అన్నాడు- "అమ్మా... నువ్వు ఊరుకో- నేను మాట్లాడుతాను"

శేఖరం అతనికేసి చూసేసరికి అతను సంభాషణ మొదలెట్టాడు-

"మీపేరు శేఖరం కదూ...?"

"అవునండి..."

"యు ఆర్ ఎ క్లర్క్ ఇన్ ఎ కంపెనీ?"

"ఔనండి... తాడేపల్లిగూడెంలో వర్క్ చేస్తున్నాను"

"యునో- వాట్ ఐ యామ్?"

"మీరు సి.టి.ఒ. సర్వీస్ కమిషన్ గ్రూప్ వన్ ఎగ్జామ్స్ రాసి సెలక్ట్ అయ్యారుగదా"

"అంటే- ఐయామ్ ఎ గెజిటెడ్ ఆఫీసర్ ఆఫ్‌ది రాంక్ ఆఫ్ ఆర్.డి.ఒ."

"ఔనండి..."

"ఈ మేడచూసారా- పదిలక్షలుంటుంది- ఇది మా స్వంత ప్రాపర్టీ... తెలుసుగదా"

"తెలుసండి..."

"లాండెడ్‌ప్రాపర్టీ మరో పదిలక్షలుంటుంది"

"విన్నానండి..."





మా ఆస్తి, నా క్వాలిఫికేషన్, ఉద్యోగం, మా స్టేటస్- ఇవన్నీ చూసి కూడా మీ సంబంధం ఎలా ఒప్పుకొంటామనుకున్నారు? ఆశకి అంతుండాలి. ఒక సి.టి.ఒ.కి ఓ అవిటిపిల్లని అంటగట్టాలనుకోడం సాహసం. లక్షాధికారుల ఇంటికి పూటగడవని ఓ ఇంటిపిల్లని కోడలుగా పంపగలమనుకోడం నథింగ్ షార్ట్ ఆఫ్ ఫూలిష్‌నెస్. 'మా చెల్లెలూ చదువుకున్నదే గదా' అని మీ అభిప్రాయం కావచ్చు. ఎం.ఏ. ప్యాసైనమాట నిజమేకావచ్చు. ఎందుకా చదువు? అంగవైకల్యాన్ని కప్పిపుచ్చుకోడానికా? మీ బుట్టలోపడేంతటి తెలివితక్కువవాణ్ణికాను. మా అమ్మగారు- షి ఈజ్ హైలీ ఇన్నోసెంట్. ఇక మా అన్నగారి విషయం- ఆయనకి నామీద ఎలాంటి అధికారమూ లేదు. సంబంధం దాదాపు అంగీకరించినట్టే మాట్లాడారు ఆయన ఆవేళ. ఏకంగా నిన్ను ఇక్కడికే రమ్మని ఆహ్వానించింది మా అమ్మ. ఐ హేట్ సచ్ థింగ్స్. వివాహం చేసుకునేది నేను- వాళ్ళు కాదు."

"మీరు చాలా అఫెండింగ్‌గా మాట్లాడుతున్నారు- నేను చెప్పేది కూడా కాస్త......"

"మధ్యలో అడ్డురాకు మిస్టర్ శేఖర్- నన్ను పూర్తిగా చెప్పనియ్..."

శేఖరం ఇంకేమీ మాట్లాడక ఊరుకున్నాడు.

"ఫైనల్‌గా ఓ మాట చెబుతున్నాను- మేం ఈ సంబంధం ఒప్పుకున్నా మీరు అతికష్టంమీద కూడా పాతికవేలైనా ఇవ్వలేరు. రెండులక్షలు ఇచ్చినా నాలాంటివాడు మీకు దొరకడు..."

"మీ ఆస్తిపాస్తుల విషయం అలా ఉంచండి- మా చెల్లెలి కల్చరూ, కారెక్టరూ కన్సిడర్ చెయ్యాలి కదండీ..."

"వాడ్డూయుమీన్... మీ చెల్లెలు కారక్టర్ మంచిదంటావ్... అంటే పెళ్ళికి ఎదిగిన తక్కినవాళ్ళంతా ప్రాస్టిట్యూట్స్ అని నీ ఉద్దేశమా?"

శేఖరం గట్టిగా ఆటాక్ ఇద్దామనుకున్నాడు. కాని... ప్రయోజనమేమిటని ఆలోచించి ఊరుకున్నాడు. నిజానికి ఆత్మగౌరవంపోతున్నచోట దేవుడినైనా లెక్కచెయ్యని మనస్తత్వం అతనిది- అయినా ఊరుకున్నాడు.

శ్యామసుందర్ ఇంకేమీ మాట్లాడలేదు. అన్నగారూ, తల్లికూడా నోరు మెదపలేదు. అతని నోటిదురుసుతనం వాళ్ళకి తెలుసు. అప్పుడే వదినగారు అక్కడినుంచి లేచి వెళ్ళిపోయింది.

తను పుట్టాక శేఖరం ఇంత న్యూనత ఎప్పుడూ అనుభవించలేదు. పరాభవంతో ఇంతగా ఏనాడూ శిరస్సు వంగిపోలేదు. ఎదురుచెప్పడం అంటూ జరిగితే ఎడాపెడా చెంపలు వాయించినట్లు సమాధానం చెప్పగలడు. భుజబలం, బుద్ధిబలం కూడా అతగాడికంటే తనకే ఎక్కువ. తక్కువైంది ఆర్థికబలం ఒక్కటే. ఆ తక్కువే తక్కిన అన్ని ఎక్కువలను తనకంటే తక్కువ చేసి నిలిపింది. దేనికైనా టైమ్ అండ్ ప్లేస్ అన్నారు పెద్దలు.

ఇంతలో- 'యుకెన్‌గో' అని పెద్దగా అరిచాడు శ్యామ్‌సుందర్. వెంటనే తుఫానులా మేడ మీదికి వెళ్ళిపోయాడు.

"అమ్మా- మరి నేను వెళ్ళొస్తాను" అంటూ లేచాడు శేఖరం.

అతను వెళ్లబోతుంటే-

"చూడు బాబూ-" అని ముసలమ్మగారు అతని చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ- "వ్యవహారం నాచేతులు దాటిపోయింది. కనుకనే నేను ఏమీ మాట్లాడలేకపోయాను. విచారించి ప్రయోజనం లేదు- ఒక్కటి మాత్రం నేను చెప్పగలను- మీ చెల్లెలికి ఇంతకంటే మంచి సంబంధం వస్తుంది- అది నా ఆశీస్సు కూడా" అన్నారు.

"హై హాండెడ్‌నెస్ ఇన్ ఇట్స్ ఎక్స్ట్రీమిటీ యీజ్ ది రూయిన్ ఆఫ్ ఫార్చూన్- మీరు వెళ్ళిరండి... బాధపడకండి" అన్నారు అన్నగారు.

నిజానికి శేఖరం వాళ్ళింటికి రాకముందే ఆయన తమ్ముడికి చెప్పాడు- "ప్రస్తుతం మనకి లోకువగా కనిపిస్తున్న వ్యక్తి నిజంగా మనకంటే తక్కువ అనుకోవడం చాలా పొరపాటు. పరిస్థితులు మారవచ్చు. అప్పుడు వాళ్ళేకాదు భగవంతుడుకూడా మనల్ని క్షమించడు" అని.

"దేవ్ సే సచ్ కాక్ అండ్ బుల్ స్టోరీస్" అన్నాడు శ్యామసుందర్.



శేఖరం గుమ్మం దాటి రోడ్డుమీదకి వస్తుండగా వెనకాలే తోటమాలి కాబోలు వచ్చాడు.

సడన్‌గా అతనన్నమాట వినిపించింది-

"కాలం కలిసి రానప్పుడు తల కాస్త దించుకోవాల బాబూ- తప్పదు..."

అతనికేసి చూసాడు శేఖరం.

"అంతా యిన్నాను బాబూ-మా సీతాలు చెప్పింది..."

అలా మాట్లాడుతూ తనవెంటే వస్తున్న అతన్నిచూసి, "నువ్వు వెళ్లు-నీపని చూసుకో-వాళ్లు చూస్తే బాగుండదు" అన్నాడు శేఖరం.

'నా డ్యూటీ అయిపోనాదండి. ఇంటికి పోతన్నా' అన్నాడతను.

మళ్లీ అతనే మరోమాట చెప్పాడు-

"పెద్దమ్మగోరు నిజంగా దేవతండి- శానా మంచి కుటుంబమండి- కానైతే ఆ సుందరయ్యగారే సెడబుట్టారండి. పెద్దబ్బాయిగోరు- అంటే రవిబాబు గోరు- యిల్లు ఇడిసిపోడానికి కారణం ఇతగాడే కదండీ..."

"రవిబాబుగారా? అంటే ఈ ఇద్దరికంటే పెద్దాయనా?"

"అవునండి- పెద్దమ్మగారి పెద్దకొడుకండి- ఆయనగారి పేరు రవితేజ. ఇప్పుడెక్కడున్నారో ఎరికీ తెలియదండి. బొంబాయిలో ఉంటున్నారని ఇనికిడండి. చూచాయగా అమ్మగోరికి తెలిసినా ఎరికీ ఆమెగోరు చెప్పరండి"

"ఆయన ఇక్కణ్ణించి వెళ్లిపోయి ఎంత కాలమైంది?"

"నాలుగేళ్లు దాటిందండి- శానాపెద్దబుర్రండి బాబూ- మా దొడ్డ సదువు సదివినాడండి- ఆయన్ని డాక్టరు డాక్టరు అనేవోళ్లండి శానామంది- అదేంటో- ఆయనగారు వైద్యం సెయ్యటం మాత్రం నేనెప్పుడూ సూడనేదండి- ఈ ఇంట్లో పద్నాలుగేళ్ళబట్టి సాకిరీ చేస్తుండా"

"ఆయన దగ్గరుంచి ఏ ఉత్తరాలు రావా- ఇక్కడికి?"

"ఆ మధ్య వచ్చేయండి- ఇప్పుడు రావటం నేదు. అయి చినబాబు కంటబడితే ఇంకేమైనా ఉందాండి?"

"అంటే...?"

"ఇద్దరికీ బద్ధ శతృత్వం కదండీ..."

"ఎందుకూ...?"

"ఈ సిన్నాయన డబ్బు మడిసండి- తనదే పైసెయ్యంటాడండి ప్రతి యినయంలోనూ- ఆ పెద్దబాబుది అంతా పెద్దమనిషి తరహా అండి- మహా గొప్పమనసండి".

'ఇహ వస్తానయ్యా-' అంటూ శేఖరం ఆటో ఎక్కేడు.

ఇల్లు చేరాక జరిగినదంతా తల్లితో చెప్పాడు. విషయం గౌరి కూడా వింది. ఏదో షాక్ తిన్నట్టయిందామెకి. అంత చప్పున తేరుకోలేక పోయింది కూడా.

కారణం ఏమిటో, అది ఎంత బలీయమైనదో చెప్పలేంగాని ఈ సంబంధం విషయంలో గౌరి చాలా ఆశపెట్టుకుంది. కాని అవమానభారంతో శిరస్సు వంగిపోయింది.

ఆ మర్నాడే ఆమె అతనికి ఉత్తరం రాసింది. తల తిరిగిపోయే ఉత్తరం అది. సృష్టికర్త దృష్టిలో మనిషికీ మనిషికీ ఉన్న బంధం ఏమిటో, మనిషికి బాలన్స్ ఆఫ్ మైండ్ ఎంత అవసరమో, ఆ బాలన్స్‌కీ కాస్మిక్‌లాకి సంబంధం ఏమిటో రాసింది. ఆడది కనక చివర ప్రాధేయపడక తప్పలేదు. విషయం పునరాలోచించమని ప్రార్థించింది.

పెళ్ళిచూపులకి కూర్చున్న ఆడపిల్ల అలా ఉత్తరం రాయడం ప్రపంచంలో ఎక్కడా జరగని విషయం- ఆమెకు తెలుసు, అయినా రాసింది. కాని జవాబు లేదు.



బస్సులో పొద్దున్న పదకొండు గంటలకల్లా షిర్డీ చేరాడు శేఖరం. తాడేపల్లిగూడెంలో మొ

న్న సాయంత్రం బయలుదేరిన బస్సు నిన్న ఉదయానికి హైదరాబాద్ వచ్చి, ఈ వేళ్టికి షిర్డీ చేరింది. బస్సులో ఉన్న దాదాపు యాభై మందితోబాటు అతనూ బస్సు దిగాడు.

స్నానాలు చేసి బాబాదర్శనం చేసుకుందా మని అందరూ అనుకుంటుంటే పన్నెండు గంటలకే హారతి టైమనీ, కనుక ముందు దర్శనం చేసుకురావాలనీ, తర్వాత స్నానాలు చెయ్యవచ్చనీ, అదే అక్కడ పద్ధతి అనీ వాళ్ళ కి చెప్పాడు.

భోజనశాల ఆవరణలో ఆగిన టూరిస్ట్‌బస్సు లోనే పెట్టెలూ, బ్యాగ్‌లూ వగైరా ఉంచేసి అందరితోపాటూ తనూ బాబాసమాధి మందిరా నికి బయలుదేరాడు. రెండేళ్ల క్రితం తను వచ్చినప్పటికీ ఇప్పటికీ చాలా తేడా కని పిస్తోందక్కడ. భక్తుల సంఖ్య విపరీతంగా పెరిగింది. కిటకిటలాడుతున్నారు జనం. షాపు లూ, పూలఅంగళ్ళూ కూడా ఎక్కువయ్యాయ్. 'సాయి మహారాజ్‌కీజై' అంటూ జనం కట్టలు తెంచుకున్న ప్రవాహంలా పరుగులుపెడుతు న్నారు. కేసెట్లలోంచి భక్తిగీతాలు అన్నివైపుల నుంచీ వినబడుతున్నాయ్.

సమాధి మందిరంలో అది సువిశాలమైన పెద్ద హాలు. చలువరాతి కట్టడంలో అద్దంలా ఉన్న నేలమీద దాదాపు వెయ్యిమంది భక్తులు కూర్చుని ఉన్నారు. చోటులేక నిలబడి ఉన్నవా ళ్ళు ఇంకా బోలెడుమంది. నలభై ఏభై గజాల దూరంలో ఎదురుగా, నాలుగడుగుల ఎత్తున ఉన్న పాలరాతి శిలాఫలకం మీద దేదీప్యమా నంగా వెలిగిపోతూన్న నిలువెత్తు బాబావి గ్రహం. ఆ విగ్రహం మలచిన మహాశిల్పి ఎవరో, ఏ శుభముహూర్తాన ఆ విగ్రహం ప్రతి ష్ఠించారోగాని ఆ పుణ్యస్థలి ప్రపంచం నలు మూలలనుంచీ భక్తుల్ని ఆకర్షిస్తోంది. శిల్ప సౌందర్యానికి తగ్గట్టు దీపాలంకరణ, మంత్రో చ్చారణల శబ్దగాంభీర్యం, సుగంధద్రవ్యాల శోభ- అక్కడ కూర్చున్న ప్రతి మనిషిలోనూ ఏదో అపూర్వ ఆనందానుభూతి. మొత్తం జనంలో సగంపైన స్త్రీలే. పసిగుడ్డుల్ని చేతుల్లో పెట్టుకుని తీసుకువచ్చిన బాలింతరాళ్ళు, చంటిపిల్లల్ని నడిపించుకువచ్చిన తల్లులు, గర్భిణీ స్త్రీలు, కాపురానికొచ్చి పదేళ్ళయినా కడుపు పండనివాళ్ళు, పిల్లల పెళ్ళిళ్లకోసం ఆరాటపడుతూన్న తల్లిదండ్రులు- ఇలా ఎందరో ఉన్నారు వాళ్లలో. వీళ్లుగాక- అనారోగ్య వంతులు, మనశ్శాంతి కరువైన అభాగ్యులు, వికలాంగులు ఉన్నారు. త్రికరణశుద్ధిగా నమ్మా లేగాని బాబా వాళ్లకి తరుణోపాయం చూపక మానడని అందరికీ గాఢవిశ్వాసం.

పన్నెండున్నర అయ్యేసరికి తీర్థం, ప్ర సాదం తీసుకుని అందరితోబాటు శేఖరం బయటికి వచ్చాడు. ఆ రద్దీలో పాపం ఎవరో ఒకామె ఓ ముసలాయన చెయ్యిపట్టుకుని నెమ్మదిగా నడిపిస్తోంది. తండ్రి అయి ఉండాలి. అక్కడికొచ్చే జనంలో గుజరాతీలు, మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాలనుంచి వచ్చినవా ళ్లూ ఎక్కువ. అక్కడి ఆడవాళ్ళు చాలా అంద గత్తెలు. ఆ అమ్మాయిది కూడా చక్కని రూపం. వాళ్ళ పక్కనే నడుస్తున్నాడు శేఖరం. ఆమె చేతిలోఉన్న కొబ్బరి చెక్కజారి కిందపడింది. అప్పుడే తండ్రి చెయ్యివదిలి వెంటనే తీసుకో లేకపోయిందామె. శేఖరం తీసి యిచ్చాడు. 'థాంక్స్' అంది అమ్మాయి.

బస్సువైపు నడుస్తున్నాడు శేఖరం. ప్రశాంత వాతావరణం. షిర్డీ పెద్ద ఎసెట్ అనిపించింద తనికి.

కాంటీన్‌లో భోజనంచేసి, అక్కడే "సాయి ప్రసాద్"లో తీసుకున్న రూమ్‌లో విశ్రమించా డు. మర్నాడే లక్ష్మీవారం కావడంవల్ల రూమ్సు ఎక్కడా ఖాళీల్లేవు. అతి కష్టంమీద తనకాగది దక్కింది.

మంచంమీదపడుకున్న అతనికి ఏవేవో ఆలోచనలు వచ్చాయ్. నిజానికి తను అంత త్వరలో మళ్లీ షిర్డీ వచ్చేవాడుకాడు.ఎం.ఎల్. ఎ.గారు చీటీరాసి పంపడం, అది చూసి తను ప్రయాణం కావడం అంతా అనుకో కుండా జరిగింది. ఆయన రాసిన చీటీ టెలి గ్రాంలా అనిపించింది.

"ఓసారి షిర్డీ వెళ్లిరా. ఎందుకో నీకే తెలు స్తుంది తర్వాత" అని రాసారాయన. అందులో ఆంతర్యం అర్థంకాలేదు. అయినా బయలుదే రేసాడు. సమయానికి టూరిస్ట్ బస్సులో సీటూ దొరికింది.

సాయంత్రం మళ్లీ హారతి టైముకి వెళ్లాడు. దర్శనం చేసుకుని బుక్‌స్టాల్‌కి వెళ్లి రెండో మూడో పుస్తకాలు సెలక్ట్‌చేసి తీసుకున్నాడు.

బస్సులో వచ్చిన యితర ప్రయాణీకులు "సాయి ఉద్యోగ్"లో బస చేసారు. వెళ్ళి, వాళ్ళను పలకరించి, భోజనాలు అయ్యాక తిరిగి రూమ్‌కి బయలుదేరాడు.

రాత్రి తొమ్మిది దాటింది. వస్తూన్నప్పుడు మేడమీద వరండాలో ఓ ప్రక్కగా నేలమీద పడుకున్న ఆ అమ్మాయి కనిపించింది. నేవీ బ్లూ చీర చివర్న అందమైన పాదాలు కనిపిస్తున్నాయ్. వాటిమీదికి జారిన నాజూకైన వెండి పట్టీలు. ఆమెకు అతిదగ్గర్లోనే ఆమె తండ్రీ పడుకుని ఉన్నాడు. చదువు, సంస్కారంగల వాళ్లు అని పొద్దున చూసినప్పుడే తెలిసింది.

UDAY BHASKAR





తెలుగువాళ్లై ఉండరు. మరి ఏ ప్రాంతం వాళ్లో! పాపం - వాళ్లకి రూమ్ దొరకలేదన్న మాట. ఎలాగో రెండు పరుపులు మాత్రం సంపాదించారు. వాటిమీదే పడుకున్నారు.

వాళ్ల పరుపుల పక్కనుంచే వెడుతున్న అతను ఓ క్షణం ఆగి అటు చూసాడు.

'గుడ్‌నైట్... సర్' అందామె లేచి కూర్చుని.

"గుడ్‌నైట్... మీకు రూమ్స్ ఏమీ దొరకలేద

నుకుంటాను...'' అన్నాడతను.

ఆమె ఏమీ అనలేదు.

మాటలు రాకగాదు, మాట్లాడకుండా ఉండా లనీ కాదు. మరి ఎందుకని?

పోనీ - ఇంగ్లీషులో అడుగుదామని అడిగాడు.

ఆమె ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ సమాధానం చెప్పింది.

''ఔనండి - రూమ్స్ ఎక్కడా ఖాళీల్లేవు. లాడ్జీల్లోకూడా- వి ఆర్ హెల్ప్‌లెస్'' అంది.

'అరె- వెరీ సారీ-' అని ఓ క్షణం ఆగి వెళ్లిపోయాడు.

రూమ్‌లో లుంగీ, బనీను వేసుకుని బాత్ రూంలో కాళ్లూ, మొహం కడుక్కుని మంచంమీద వాలాడు.

ఇల్లూ, ఆఫీసూ మనసులో మెదిలాయ్. శ్వేతా, సరోజా గుర్తుకువచ్చారు. ఆ ఆలోచనల్లోనే గుర్తొచ్చింది వరండాలోని అమ్మాయి.

ఆమె, ఆముసలాయనా ఎలా పడుకుంటారక్కడ ఈ రాత్రి? వరండా అంతా అటూ ఇటూ తిరిగేజనం. పైనచలి. గలీజుగా ఉన్న ప్రదేశం. పైగా ఆమె తండ్రి అంత ఆరోగ్యంగా కూడా లేడు.

ఇలా ఏదో అనుకుంటూనే పుస్తకం తీసాడు గానీ దృష్టి దానిమీద నిలవలేదు.

పదకొండు దాటింది. ఏమనుకున్నాడో ఏమో - చటుక్కునలేచి తలుపుతీసి వరండాలోకి వచ్చాడు. ఆమె పరుపుమీద కూర్చునే ఉంది. తండ్రి పడుకున్నాడుగాని నిద్రపోయినట్టులేదు. దుప్పటి అటూ ఇటూ సర్దుకుంటున్నాడు.

అతను బయటకు రావడం ఆమె చూసింది.

ఆమె నిలుచుంది అమాయకంగా, ఎందుకో ఏమిటో అర్థం కాలేదు.

దగ్గరగా వెళ్లాడు.

'మీరూ - మీ ఫాదరూ...' ఏదో అనబోయాడు.

''ఏమిటి... చెప్పండి...''





''ఇఫ్ యు హేవ్ నో అబ్జెక్షన్...''

''చెప్పండి సార్...''

''నా రూమ్‌లోకి వచ్చి పడుకోండి - ఈ చలికి మీ ఫాదర్ తట్టుకోలేరేమో...''

''థాంక్సండి - మెనీ థాంక్స్...'' ఆమె దుప్పటి తీసేసి పరుపు చుడుతూంటే శేఖరం వాళ్ళ ఫాదర్‌ని లేపి చేయిపట్టుకు తీసుకువెళ్లాడు. వెళుతూండగా ఆమె అంది ''చలికి మా ఫాదర్ తట్టుకో లేరేమో అన్నారు... మరి నామాటా?''

నవ్వాడతను. ''మీది యంగ్‌బ్లడ్‌కదా...'' అన్నాడు.

గదిలోకివెళ్లగానే-

''వెరీ బిగ్ రూం...'' అందామె.

అక్కడ ఉన్నవి రెండే మంచాలు. వేరేపరుపులుకూడా ఉన్నాయ్.

''మీరిద్దరూ ఆ మంచాలమీద పడుకోండి'' అన్నాడు శేఖరం.

'మరి... మీరు?'

''నేను కింద పడుకుంటాను... పరుపులు న్నాయిగదా...''

''నో నో... సర్వీస్ చెయ్యబోయి సాక్రిఫైజ్ చేస్తారా? నేనే కిందపడుకుంటాను'' అందామె.

అప్పుడు వాళ్ల ఫాదర్ అన్నారు-

''యు ఆర్ టూ నోబుల్ మైబాయ్- ఐనో- నాకుమంచం . అక్కర్లేదు. కిందనే ఐఫీల్ హాపీ... పైన ఫాన్ ఉందిగదా... అదే నాకు కావలసింది''

అర్థరాత్రి టైములో ఆమె అప్పుడు బాత్ రూంకి వెళ్లి స్నానంచేసి, చీర మార్చుకుని వచ్చింది. పొద్దుట్నించి ఎంత ఇబ్బందిపడి ఉంటుందో అనిపించిందతనికి. స్నానానికి ముందు ఆమె పెట్టె తెరిచినప్పుడు, పైనేఉన్న ఇంగ్లీష్ మాగజైన్స్‌తీసి పక్కనే పెట్టింది. వాటి కింద గుజరాతీ పత్రికలు, ఏవో పుస్తకాలు ఉన్నాయ్. పెట్టంతా పుస్తకాలకీ, పత్రికలకీ సరిపోయినట్టుంది. స్నానంచేసి వచ్చాక బయటికి తీసింది- ఫ్రెంచి టాల్కం, బెల్జియం ఫ్లెగ్జిబుల్ మిర్రర్, ఫెయిర్ అండ్ లవ్లీ వగైరా.

ఇంతదాకా అతను సరిగా ఆమెను చూడలేదేమోగాని... 'చాలా అందగత్తె' అని తెలిసొ

[illegible]
బయట విశ్రాంతి తీసుకుంటున్న అరుంధతిలా ఉంది. ముగ్ధమనోహర రూపం. మాంచి పొడగరి. ఐదూ ఐదుకి తక్కువుండదు. ఆ ఎత్తే ఆ చక్కని రూపానికి లక్షీ పెర్సనాలిటీని ప్రసాదించింది. వీటికితోడు ముద్దొచ్చే మాటతీరు. తెలుగు మాట్లాడినప్పుడు మాత్రం మహారాష్ట్ర యాస కనిపిస్తుంది. అందమైన విగ్రహానికి అదనంగా రెండు అందాలు- ఒకటి ఆమె కుడిపైట. రెండు ఆమె ముక్కెర. ముక్కుకి ఎడంవైపునున్న ఆ ముక్కెర ఆ మనిషికి ఎంత అందం సంతరించిపెట్టిందో చూసినవాళ్ళకిగాని తెలియదు. తల కదిలినపుడల్లా తళుక్కుమంటుంది అందులోని పొడి. ఏజాతి రాయో మరి! శ్వేతకీ ఉంది ముక్కుపుడక. ఎందుకూ? ఈ అందం అక్కడ ఎక్కడుంది? సరోజకి అసలు ముక్కుపుడకే లేదు. 'అదే అందం' అంటుంది ఆవిడగారు. కాబోలనుకున్నాడు తను ఇంతకుముందు వరకు.

ఆ అమ్మాయి తెచ్చినవి రెండు పెట్టెలు. ఒకటి పెద్దసైజు సూట్‌కేస్. రెండోది బ్రీఫ్‌కేస్. రెండూ కలర్ అండ్ డిజైన్‌లో చాలా బాగున్నాయ్. అంటే ఆమె సెలక్షన్ చాలా బాగుంటుందన్నమాట. పెట్టెలుకాక హేండ్ బ్యాగ్‌కూడా ఒకటుంది.

"మీరు పడుకోండి సార్- నేను ఒక్క అర గంట పేపరుచూసి పడుకుంటాను" అందామె.

"రేపు లక్ష్మివారం- బాబాకి చాలా ప్రీతికరమైన రోజు. హెవీ రష్ ఉంటుంది..."

"ఎస్... ఐనో దట్"

"ఉదయం ఆరుగంటల హారతికి వెడదాం"

"ష్యూర్... ష్యూర్..."

తెల్లవారకుండా నాలుగున్నరకే అలవాటు ప్రకారం లేచాడు శేఖరం. కళ్ళు తెరచేసరికి ఎదురుగా మంచంమీద, దిండుకానుకుకూర్చుని ఆమె ఏదో పుస్తకం చదువుతూంది. ఈవిడగారు అసలు నిద్రపోయిందా అని?

"గుడ్‌మార్నింగ్..." అందామె.

"గుడ్‌మార్నింగ్... నేను బ్రష్‌చేసుకునేలోగా మీరు స్నానం పూర్తిచెయ్యండి- క్విక్" అన్నాడతను.

...స్నానం అయింది సార్..." అందామె.

"అలాగా- ఐతే నాదే ఆలస్యమన్నమాట..."

"బై ఆల్‌మీన్స్...'

"నాకు ఇంకా పూజకూడా ఉంది"

"డూయిట్... ఐదున్నరలోపుల్లో పూర్తికాకపోతుందా? ఐ కంప్లీటెడ్ మై పూజా ఆల్‌రెడీ"

గోడమూలకి చూశాడు శేఖరం. సాయిబాబా పటం. దానికి పూలమాల. అటూఇటూ కుందెలు- వాటిలో జ్యోతులు. కొట్టిన కొబ్బరికాయ. హారతిఇచ్చిన చిన్న పళ్ళెం. నైవేద్యం పెట్టిన అరటిపళ్ళు. గదంతా అగరువత్తుల సువాసన. వాట్ ఎ సర్‌ప్రైజ్!

"చాలా చప్పున పూజ ముగించేశారే" అన్నాడతను అడ్మైర్ చేస్తున్నట్టుగా.

"ఈవేళే కాదు నాయనా- దటీజ్ హర్ హాబిట్ సిన్స్ ఫిఫ్టీన్ ఇయర్స్" అన్నారు ఆమె ఫాదర్ అప్పుడే లేస్తూ.

చదువుతూన్న పుస్తకాన్ని పక్కనబెట్టి ఆమె లేచింది. అది ఓ హిందీ నవల.

అర్థమయింది శేఖరానికి, ఆమె అలవాట్లు ఎటువంటివో! ఆమెను అలా తీర్చిదిద్దిన తండ్రీ అతని ఎదుటే ఉన్నాడు. ఇంతకంటే సత్సాంగత్యం ఏముంటుంది?

గబగబా స్నానం, పూజా పూర్తిచేశాడు శేఖరం. ముగ్గురూ కలిసి హారతి టైముకి బాబాదర్శనానికి వెళ్లారు. ఆమెకు అటువైపున వాళ్ల ఫాదర్, ఇటు శేఖరం. మధ్యలో నడుస్తున్న ఆమె. అడుగుతీసి అడుగు వేస్తూంటే ఎంతో హుందాతనం, చిరుమువ్వల సవ్వడి.

మళ్లీ బయటకు వచ్చేసరికి ఏడుకావచ్చింది.

'కాస్త కాఫీ తీసుకుందాం - పదండి' అన్నాడు శేఖరం.

"ఇక్కడ కాఫీ దొరకటం కష్టం. ఎక్కడ చూసినా టీ యే' అందామె.

"ఔనౌను- మరిచేపోయాను"

"మీ ఆంధ్రా పీపుల్ ఎక్కువగా కాఫీయే తాగుతారు. నేనూ అదే లైక్ చేస్తాను. అందుకే ఐ బ్రాట్ బ్రూ విత్‌మి"

"ఈజిట్- ఇంకేం- మిల్క్ తీసుకుంటే సరి పోతుంది" హోటల్‌లో మూడు కప్పులు మిల్క్ తీసుకున్నాడు శేఖరం. హాండ్‌బాగ్‌లోంచి బ్రూసీసా తీసి యిచ్చిందామె. అతనే కలిపి యిచ్చాడు తక్కిన ఇద్దరికీ.

పది గంటలవరకు అక్కడ అన్ని స్థలాలు చూశారు. బాబా బతికి ఉన్నకాలంలో ఆయన ఎప్పుడూ కూర్చునే రాయి, జొన్నలు విసిరిన తిరగలి, ఉపయోగించిన వస్తువులు చూశారు. "ద్వారకామాయి" సందర్శించారు.

భోజనాల అనంతరం మళ్లీ మధ్యాహ్నం హారతికి హాజరై రూం చేరుకున్నారు.

"షిర్డీ వచ్చినవాళ్లు ఇక్కడే మూడు రాత్రులు ఉండాలట" అన్నాడు శేఖరం.

"ఔను... అలాగే ఉందాం. నో హర్రీ- బై-ది-బై మీరు సఫిషియంట్‌లీవ్ తీసుకున్నారా ఆఫీసునుంచి?" అందామె.

'నా మొహం ఆఫీసు- అదీ ఓ ఆఫీసు- నాదీ ఓ ఉద్యోగం' అనుకున్నాడతను.

"ఎస్ ఐ టుక్ టెన్ డేస్ లీవ్" అన్నాడు.

ఆ మధ్యాహ్నం ముసలాయన కాస్సేపు పడుకున్నాడుగాని వాళ్లిద్దరూ ఏవో కబుర్లు చెప్పుకుంటూ అలాగే కూర్చుండిపోయారు.

అప్పటికి ఆమెకు అతను పరిచయమై ఒరోజు అయింది. వ్యవధి చాలా తక్కువే అయినా ఎంతో గ్రహించింది అతన్ని గురించి. ఒక రాత్రి ఒక పగలు గడిచినా, ఇద్దరిమధ్యా ఎంతో సంభాషణ నడిచినా, ఒకే గదిలో రాత్రి ఇద్దరూ ఉన్నా ఒక్క అసందర్భపు మాటగాని, అసభ్యపు చూపుగాని అతనిలో లేకపోవడం, పైగా ఫిలసాఫికల్ మైండెడ్‌గా అతను కనబడటం, ఛారిటబుల్ ఔట్‌లుక్ ఉండటం- ఇవన్నీ ఆమె దృష్టిలో అతని విలువను పెంచాయ్. అన్నిటికీమించి అతనిలో ఆమె చూడగలిగిందిమర్యాదస్తులలక్షణం.

ఆమెకీ అర్థమయింది అతని లెవెల్ ఏమిటో.

వాళ్ల కబుర్ల మధ్యలో శేఖరం అన్నాడు- "మీ పేరు చెప్పనేలేదు"

ఆమె కిలకిలా నవ్వింది- "అడగకుండానే ఎవరైనా పేరు చెబుతారా?" అంది. అక్కడే ఉంది మరి ఆడదాని గొప్పతనం.

ఓహో- అదీ తన తప్పేనన్నమాట.

"ఇప్పుడైనా చెప్పండి" అన్నాడు.

"స్వరూపరాణి" అందామె.

"గుడ్- నేననుకున్నట్టే ఉంది"

ఆమె సంతోషం అంతా కళ్లల్లో కనిపించింది. ఏమీ మాట్లాడలేదు.

"రాణి" అనేది హోదాకే గాదు అందానికీ సంకేతమే అని నా అభిప్రాయం, కాదా?" అన్నాడతను.

అప్పుడుమాత్రం అతని కళ్లల్లోకి అదోలా చూసిందామె.

'స్వీట్ టంగ్ - ఇతనికి భగవంతుడిచ్చిన వరం' అనుకుంది.

సాయంత్రం నాలుగు వరకూ వాళ్ల కబుర్లు సాగుతూనే ఉన్నాయ్.

అప్పుడే చెప్పింది స్వరూపరాణి-

వాళ్ళు ఒకప్పుడు ఆంధ్రాలోనే ఉండేవాళ్ళట. వాళ్ల ఫాదర్ పేరు గంగారాం. ఆయన చిన్నప్పుడు శ్రీకాకుళంలో చదువుకున్నారట. తాతగారు వ్యాపారం నిమిత్తం అహమ్మదాబాద్ వచ్చేశారు. అప్పట్నించే ఫామిలీ అంతా అక్కడే ఉండిపోడంతో అందరికీ గుజరాతీ పోకడ అబ్బింది. ఫాదర్ కూడా కాటన్ బిజినెస్ చేసి ఓపిక తగ్గిపోవడంతో కొడుక్కి బాధ్యతలు అప్పచెప్పారు. అహమ్మదాబాదులో ఓ మేడ ఉంది. బాంబేలో కూడా ఓ టూస్టోరీడ్ బిల్డింగ్ ఉంది. పేరెంట్స్‌కి తనూ, అన్నయ్య ఇద్దరే సంతానం. అన్నయ్య పేరు శాంతిభూషణ్, తల్లి అయిదేళ్ళక్రితం పోయింది. ఇప్పుడు ఇంటిబాధ్యత అంతా వదినగారిదే. మామగారినీ, మరదల్నీ చాలా ఆప్యాయంగా చూసుకుంటుందావిడ. ఇప్పటికీ శ్రీకాకుళం దగ్గర్లో ఐదెకరాల పొలం ఉంది. అన్నయ్యకి తనంటే ప్రాణం...

వాళ్ళ ఫాదర్ కూడా మధ్యలో ఓమాట అన్నారు-

"రాణీ చాలా ఇండిపెండెంట్ వ్యాసగలదీ- కనుకనే ఆమె చదువు, ప్రొఫెషన్, మారేజ్ అన్నీ ఆవిడ ఛాయిస్‌కే వదిలేశాం. ఆమె ముందు అనకూడదుగాని- యాజ్ ఎ




ఫాదర్ ఐ యామ్ ప్రౌడ్ ఆఫ్ హర్ యకాంప్లిష్ మెంట్స్'' అన్నారాయన.

తన విషయం కూడా అంతా చెప్పాడు శేఖరం. శ్వేత, సరోజ, గౌరిలను గురించి చెప్పి నప్పుడు చాలా ఇంటరెస్టింగ్‌గా వింది రాణి. తను రాసిన "కంపెనీ అడ్మినిస్ట్రేషన్ అండ్ స్టాటిస్టిక్స్'' గ్రంథాన్ని ఆమెకు ఓ కాపీ అందించాడు.

పుస్తకం అందుకుంటూ- "అయితే మీరు రచయిత అన్నమాట'' అందామె.

'సరోజ, గౌరి పోస్ట్ గ్రాడ్యుయేటన్నమాట చాలా సంతోషం మరి శ్వేత కాస్త వెనకబడిన ట్టుందే' అనికూడా అంది.

"వాళ్లకంటే ఆమెగారు రెండేళ్లు చిన్నది లెండి'' అన్నాడతను.

"నాకు జర్నలిజం అంటే ఇష్టం'' అంది రాణీ.

"అందుకే మీరు ఎక్కువగా పత్రికలూ, పుస్తకాలూ చదువుతుంటారు- చూస్తున్నాగా''

"ఔనండి- నేను పీరియాడికల్స్‌కి కంట్రి బ్యూట్ చేసేవి ఒరిజినెల్స్ కంటె ట్రాన్స్‌లేషన్సే ఎక్కువ. అందులో ఫ్రం గుజరాతీ టు హిందీ, ఇంగ్లీష్ టు హిందీ ఎక్కువ. కంపేర్డ్ టు దోస్ ఫ్రం హిందీ టు ఇంగ్లీష్''

సాయంత్రం హారతి టైం దగ్గరపడుతూంది మళ్లీ దర్శనానికి వెళ్లాలని లేచారు. లేచే ముందు రాణీ అంది-

"మీరు చేస్తున్న జాబ్ మీ టాలెంట్‌కి తగ్గదికాదని. నా ఉద్దేశం- ఎక్స్‌క్యూజ్‌మి''

శేఖరం ఏమీ అనలేదు.

ఆ రాత్రి పదకొండు గంటల వరకూ ఏవో టాపిక్స్ మీద డిస్కస్ చేశారు వాళ్లు. అప్పుడే చెప్పింది రాణి- సమాజంలో స్త్రీ ఎంత అవమా నంపాలవుతోందో ఆమెకు రక్షణ ఎంతగా కరు వైందో.

"నేలమీద పడింది మొదలు మట్టిలో కలి సేవరకు ఒకళ్ళపై ఆధారపడవలసిన దౌర్భా గ్యం ప్రాణికోటి అంతలోనూ ఒక్క ఆడదానికే రాసి పెట్టాడా భగవంతుడు'' అంది. చిన్నత నంలో తల్లిదండ్రులు, పెళ్లయ్యాక భర్త, వృద్ధా ప్యంలో కొడుకులు ఆదరిస్తేనే తనకు జన్మసార్థ కత. ఏ స్టేజ్‌లో ఎవరు అన్యాయం చేసినా ఆమె చేయగలిగిందేమీ లేదు. తగినంత చదువు చెప్పించకపోయినా, మంచి సంబంధం చెయ్యకపోయినా, చివరిలో పిల్ల లు తనను కాదన్నా "అంతా నీ ఖర్మ- దానికి మేమేంచేస్తాం?'' అంటుంది ఈ సమాజం. సృష్టికి మూలం స్త్రీ. మగువ లేందే మానవ జాతిలేదు. ఇది ఎవరూ కాదనలేని సత్యం. మరి ఇంత విలువైన వస్తువును అంత నీచంగా చూడ్డానికి కారణమేమిటి? ఆడవాళ్ళ పై అత్యాచారాలు, అకృత్యాలు నిరాటంకంగా సాగిపోతూనే ఉన్నాయ్. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే వైజ్ఞానికంగా, సాంకేతి కంగా ప్రపంచం ఎంతో పురోగమిస్తుంటే ఆడ దాని పరిస్థితి మాత్రం నానాటికీ దిగజారిపో తోంది. విజ్ఞానం పెరుగుతున్నకొద్దీ మానవ త్వం మరుగైపోవడం ఈ దశాబ్దపు ప్రత్యేక తేమో! స్త్రీ లోని సంస్కారం, ప్రయోజనం, సమాజానికి ఆమె అవసరం. వీటితో ఏమీ నిమిత్తం లేకుండా ప్రపంచం అంతా ఒకేరీ తిలో ఆడదాని బతుకులో చిచ్చురేపుతోంది. పత్రికల్లో చూడ్డంలేదా మిస్టర్ శేఖర్? దేశదే శాల సంస్కృతులు, సమాజాలు వేరువేరుగా ఉన్నా మహిళలపై అత్యాచారాలు మటుకు అన్నిచోట్ల ఒకేలా ఉన్నట్లు కనిపిస్తోంది. కను కనే ఆడదాని అప్రతిష్ఠ ఇప్పటికి విశ్వవ్యాప్తం అయింది. 'వరల్డ్‌వాచ్' సంస్థ రిపోర్టు మీ దృష్టికి రాలేదా మిస్టర్ శేఖర్? మానవ హక్కు లకోసం ఒంటికాలుమీద లేస్తున్న అనేక సంఘాలు ప్రపంచం నలుమూలలా ఎంతో అలజడి లేవనెత్తుతున్నా ఆడదాని అధోగతి గురించి మాత్రం నోరు మెదపడం లేదు. ఎందువల్ల? స్త్రీ జాతికున్న ఈ దురవస్థ మగజా తికే ఉండి ఉంటే ఈపాటికి విశ్వవ్యాప్తంగా ఎంతటి స్పందన వచ్చేదో! ఆఫ్రికాలో, పశ్చిమా సియాలో మహిళలపై జరుగుతున్న కిరాతకచ ర్యలను గురించి 'వరల్డ్‌వాచ్' రిపోర్ట్‌ను ఈమ ధ్య పేపర్లో చూపాను. స్త్రీలోని సహజ శృంగారే చ్ఛని నాశనంచెయ్యడానికి ఆఫ్రికాలో రాక్షసరీ తిని ఆపరేషన్లు జరుగుతున్నాయట. పశ్చిమా సియా దేశాల్లో దాదాపు ఆరుకోట్లమంది స్త్రీలు పురుషులు పాశవిక ధోరణి కారణంగా ఈ శస్త్ర

చికిత్సకి లోనవుతున్నారట. ఆడశిశువుల్ని గర్భంలో ఉన్నప్పుడే హతమార్చే కిరాతకం దేశదేశాల్లో జరుగుతూనే ఉంది. ఆసుపత్రుల్లో గర్భనిర్ధారణ జరగగానే వేలకవేలు గర్భస్రావాలు జరుగుతూనే ఉన్నాయ్" అని ఆవేశంగా చెప్పింది స్వర్ణావరాణి.

స్త్రీ జాతి దుస్థితి మీద ఆమెకు ఉన్న అవగాహనని మెచ్చుకోకుండా ఉండలేక పోయాడు శేఖరం.

ఆ రాత్రి ఒళ్లు తెలియని నిద్రపట్టింది రాణికి.

అయినా ఆమె మామూలు టైముకే లేచింది. స్నానం, పూజ పూర్తి చేసింది. పుస్తకం తీసే టైముకి శేఖరం లేచాడు. అతని స్నానం, పూజా అయ్యేవరకు ఆమె ఆగింది. తర్వాత ఇద్దరూ కలిసి 'అభిషేకం' టిక్కెట్లకోసం వెళ్లారు. అక్కడ చాలా పెద్ద క్యూ ఉంటుంది. చాలా సేపు వెయిట్ చెయ్యాలి. అందుకని గంగారాం గారు రూంలోనే ఉండిపోయారు.

అభిషేకం టైములో బాబాకి సమర్పించడానికి పూజాసామాగ్రితోబాటు పెద్దపూలదండ కూడా కొన్నాడు శేఖరం. దండచూసిన రాణి "నో - నో దట్ కాస్ట్లీ ఓన్లీ తర్టీ రూపీస్ - నేను తీసుకున్నలాంటి దండ తీసుకోండి - దిసీస్ జస్ట్ ఫిఫ్టిపై - మళ్ళీ యింతత్వరలో ఇక్కడికి రాగలమా? బాబాని ఘనంగానే సత్కరిద్దాం. ఇటీజ్ అవర్ డ్యూటీ అంది. అలాగే పెద్ద దండ తీసుకున్నాడు శేఖరం.

రెండు దండలూ మొయ్యడానికే ఇబ్బంది అయ్యిందివాళ్లకి

అభిషేకం అయ్యాక వెండీ తోటకి వెళ్లారు. అక్కడ లేళ్ళు, నెమళ్ళు వగైరా చూశారు.

ఆ రాత్రి శేఖర్ అన్నాడు.

"రాణీ - రేపు పొద్దున్న మా తిరుగు ప్రయాణం. బస్ ఎనిమిదింటికే బయలుదేరుతుందిట."

"అదే నేనూ అనుకుంటున్నాను - ట్రీడేస్ ఎంత చప్పున అయిపోయాయోచూడండి. ఈ రాత్రి ఎంతలో తెల్లవారు తుంది గనక" అంది రాణి.

"ఐయామ్ రియల్లీ అన్‌హాపీ - వి ఆర్ పార్టింగ్ సో సూన్" అన్నాడతను

"నో.. నో.. వి ఆర్ పార్టింగ్ ఎట్ షిర్డీ ఓన్లీ..." అందామె.

ఎంత ఆప్టిమిస్టిక్ ఔట్‌లుక్‌ఉన్న మనిషి అనుకున్నాడతను.

మిస్టర్ శేఖర్ - నాదో చిన్న సజెషన్"

'ఏమిటది...?'

"మా ఊరు మీరూ రాకూడదా మాతో?" అతనేమీ అనలేదు. ఏమనాలో వెంటనే తట్టకనే.

"ఎక్స్‌క్యూజ్‌మి.. మీకు వీలుకాపోతే వద్దులెండి. ఎనీవే - ఐగివ్ యు మై ఎడ్రస్ - మీరు ఎప్పుడు వచ్చినా రావచ్చు. యు ఆర్ ఆల్వేస్ వెల్‌కం!

ఆ మాటల వెనుకఉన్న సహజ లాలిత్యం, ఏదో చెప్పలేని కాంక్ష స్ఫురింపాయతనికి. 'పోనీ - వీళ్లతోనే అహమ్మదాబాద్ వెడితే ఏం?' అనికూడా అతను అనుకోకపోలేదు. కానీ బస్‌లో తోటి ప్రయాణీకులతో పాటు ఇంకా నాసిక్, పండరీపురం వగైరా పుణ్యక్షేత్రాలకి వెళ్లవలసిఉంది.

ఆ రాత్రి మళ్ళీ పదకొండుదాటేవరకు ఏవో టాపిక్స్ మీద డిస్కషన్‌లోపడ్డారు.

ఆఫ్ఘనిస్తాన్‌లో అశాంతిగురించి ఆమె ఏదో వివరణ అడగడం అతను చెప్పడం జరిగింది. ఆఫ్ఘనిస్తాన్ విషయంలో అమెరికా, రష్యాల ధోరణి, అక్కడి ప్రస్తుత పరిస్థితి దేశదేశాల మీద వీటి ప్రభావం అతను చెబుతూంటే 'ఇంటర్నేషనల్ పొలిటిక్స్ మీదకూడా ఇతనికి మంచి కమాండ్ ఉందే అనిపించింది రాణికి.

"మీ ఫాదర్ పడుకుని చాలా సేపయింది. ఇక మనమూ పడుకోవాలిస్తే మంచిది. మళ్లీ నాలుగు గంటలకే లేవాలిగదా!" అన్నాడు శేఖరం.

ఔను అన్నట్లు రాణీ కుర్చీలోంచిలేచి మంచంవైపుకు వెడుతూంటే సడన్‌గా లైట్లు ఆరిపోయాయ్. ఫ్యాన్ ఆగిపోయింది. అంతా చిమ్మచీకటి. ఓ రెండు నిమిషాలు చూశారు. కరెంట్‌రాలేదు. మొత్తం బిల్డింగ్ అంతా కరెంట్ పోయిందనీ మెయిన్‌లో ఏదో ఫాల్ట్

అవి అందరూ అనుకున్నారు. ఇంతలో గంగా రాంగారులేచారు.

"చీకట్లో నాకు చాలా భయం మిస్టర్ శేఖర్ - ఇఫ్‌యు డోంట్ మైండ్ - మీ కుర్చీ కాస్త నామురుచందగ్గరవేసుకోండి " అంది రాణీ.

'తప్పకుండా...' అంటూ కుర్చీ ఆమెకు దగ్గరగా వేసుకొని కూర్చున్నాడతను. ఇంత ఫ్రీగా, ఫ్రాంక్‌గా మాట్లాడగలిగే వ్యక్తిత్వం ఎంత మందిలో చూడగలం? అనుకున్నాడు.

కూడా బ్యాటరీలైట్లు తెచ్చుకోడం మరచిపో యినందుకు ఇద్దరూ ఫీలయ్యారు.

మరో పదినిమిషాలకి లైట్లువచ్చాయి.

శేఖర్ దుప్పటి దులుపుకుని వేసు కుంటుంటే రాణీ అంది" చూడండి - మిస్టర్ శేఖర్ - ఈరెండు పుస్తకాలు మీకిస్తున్నాను చదవండి.

"ఎలా చదవగలను? టైమ్ ఈజ్ టూ షార్ట్ బిఫోర్‌మి" అన్నాడతను.

"తీరిగ్గా ఇంటికి వెళ్లాక చదుకోమనే నేని చ్చింది- తిరిగి అవి నాకివ్వనక్కర్లేదు లెండి" అందామె.

"దెన్-నో ప్రాబ్లమ్" అని నవ్వాడతను.

తెల్లవారింది.

ఆఖరిసారిగా ఆరుగంటల హారతికి హాజరై తిరిగి వచ్చారు.

అతను బస్సు ఎక్కబోతూంటే తన విజి టింగ్ కార్డు అందించింది రాణీ- దీనిపై అడ్రస్ అంటూ.

తన అడ్రసకూడా ఆమెకిచ్చాడు శేఖర్.

అతను లోపలికి వెళ్లి సీట్లో కూర్చున్నాడు.

బస్సు కదిలింది.

ఆమె చెయ్యి ఊపింది. అతనూ ఊపాడు.

బస్సు రోడ్డెక్కింది.

ఆమె ఇక కనబడలేదు.

కొంతదూరం ప్రయాణం సాగాక జేబులో చూసుకుంటే ఓ కాగితం మడతలోపెట్టి ఉన్నాయ్ మూడు పదిరూపాయల నోట్లు- కా గితం మీద ఇంగ్లీషులో వ్రాసి ఉంది. "రూంకి 2/3 అద్దె - మా వంతు" అని.

'నా జేబు ముట్టుకునేంత చనువు పెంచు కుందా రాణీ' అని అతను అనుకుంటూండ గానే కాగితం వెనకవైపు వ్రాసింది కని పించింది- మీ జేబులో అవి పెట్టింది మా ఫాదర్. అలా పెట్టమని చెప్పింది నేనే- మీరే మనుకోకండి"

'అబ్బో-చాలా గడుసు పిండం' అనుకున్నా డు.

నాసిక్‌లో ఆగింది బస్.

'ముక్తిధామ్'ని సందర్శించారు బృంద మంతా. అది రామాలయం. పాలరాతి దేవా లయం, ఫ్లడ్ లైట్‌లో ఎదురుగా నిల్చి ఉన్న ఆంజనేయ సహిత సీతారామ లక్ష్మణుల చలు వరాతి విగ్రహాలు అత్యద్భుతంగా ఉన్నాయ్. ఆలయం చుట్టూ ఘర్మలు చూశాసిక అమ ర్చిని ఎన్నో దేవతా విగ్రహాలు అన్నీ పాలరాతి నుంచి మలచినవే. ఆ ఆలయాన్ని 'జయ రామ్ భాయీ టెంపుల్ అంటారట. ఆ విగ్రహా ల్లో మరీ మనసుని పులకరింపజేస్తున్నవి-దత్తా త్రేయ, భక్త మీరా, హనుమాన్ విగ్రహాలు. గుడిలోపల బదరీనాథ్ ధామ్ వేరే ఉంది. అక్కడే కన్యాకుమారి, సరస్వతి విగ్రహాలు అపూర్వ కళాఖండాలు. ప్రక్కనే 'కేదార్‌నాథ్'లో మహానంది విగ్రహం- ఓ సజీవ సుందర శిల్పం. నంది కళ్ళు మెరుస్తూ జీవంతో ఉన్న ట్టు కనిపించడం అందులో విశేషం.

తరవాత త్రయంబకంలో దేవాలయం సందర్శించారు. చాలా పెద్ద దేవాలయమది. శతాబ్దాల చరిత్ర గలది. ఆ మహా నిర్మాణం మానవాతీత శక్తికి నిదర్శనం. అమృత కుండంలో కాళ్ళు కడుక్కుని అర్చన చేసాడు శేఖరం.

మర్నాడు పండరీపురం చేరుకున్నారు.

పండరీనాథ దేవాలయం ఎంతచేసినా తని వితీరని ఓ అద్భుత నిర్మాణం. తుల్యాభాగన దిలో స్నానంచేసి స్వామి దర్శనం చేసుకున్నా రు. పాండురంగని దివ్య మంగళ విగ్రహంలో ఏదో అనిర్వచనీయమైన తేజస్సు. ఆయన ముందు నిలుచున్నంతసేపూ అపూర్వమైన ఆలోకానందం 'ముక్తిధామ్'లో మూడంత స్తుల భవనంలో ఉన్న వందలాది దేవతా విగ్రహాలన్నీచూసారు.



ఆ రాత్రి అంతా బస్ ప్రయాణమే.

మరునటిరోజు హైదరాబాద్‌లో కొంతసేపు దిల్‌సుక్‌నగర్‌లోని సాయిమందిరంలో విశ్రాంతి తీసుకుని మళ్లీ బయలుదేరి, తెల్లవారేసరికి ఇల్లు చేరారు.



గుమ్మంలో అడుగుపెట్టేడో లేదో శేఖరం-

"గుడ్‌న్యూస్ టు యు మిష్టర్ శేఖరం"- అన్నారు ప్రకాశరావుగారు.

అతను లోనికి రాగానే-

'మా శకుంతలకి మాచ్ సెటిలయ్యిందయ్యా' అన్నారు.

" 'శకుంతల' అంటే... మీ..."

"అదేనయ్యా - మా శ్రీలత..."

"నిజంగా ఇది శుభవార్తేనండి... ఐ యామ్ సో హాపీ"

"ఏ ఊరు సంబంధం అని అడగవేం? అమలాపురం - కుర్రాడు బుద్ధిమంతుడు - గ్రాడ్యుయేటు - అసిస్టెంట్ లేబర్ ఆఫీసర్‌గా పనిచేస్తున్నాడు విజయవాడలో - తండ్రి రిటైర్డ్ సర్వేయరు - కొద్దిగొప్పో ఆస్తి వుంది..."

"బాగుందండి..."

"ఒక్కడే కొడుకు"

"ఇహనేమండి... శ్రీలత అదృష్టవంతురాలే..."

"ముహూర్తం కూడా పెట్టించేసాం... వచ్చే నెలాఖరునే వివాహం" అన్నారాయన.

ఆ రాత్రి ఎం.ఎల్.ఎగారింటికి వెళ్ళాడు శేఖరం. ఆయన ఊళ్లో లేరనీ, తిరిగి రావడానికి వారం రోజులు పట్టవచ్చనీ తెలిసింది.

మర్నాడు పొద్దున్న పాఠం చెబుతూంటే మధ్యలోనే ఆపి శ్రీలతకి కుదిరిన మాచ్ వివరాలు శ్వేతని అడిగి తెలుసుకున్నాడు శేఖరం. పేరెంట్స్ చాలా మర్యాదస్తులనీ, కల్చర్డ్ ఫ్యామిలీ అనీ, కానైతే కట్నం కాస్త ఎక్కువే అనీ తెలిసింది.

శ్వేతని చూస్తేచాలు రాణీ జ్ఞాపకానికొస్తోంది మధ్య. శ్వేత మూతివిరుపులో నగం రాణీలోనూ ఉంది. రాణీ మనసులోకి రాగానే ఆ చిరుమువ్వల నవ్వడి కూడా లీలగా వినిపిస్తుంది. మూడు రోజుల పరిచయంలోనే ఆమె ఇమేజ్ తనపై అంత ప్రభావం చూపుతుందనుకోలేద తను.

ఆవేళ 'ఎక్స్‌ఛేంజ్ కంట్రోల్' గురించి చాలాసేపు చెప్పాడు శేఖరం. గౌరికి చెప్పడం చాలా సులువు. ఇలా చెబితే అలా అందిపుచ్చుకుంటుంది. విన్నది తిరిగి చెప్పమంటే చక్కగా చెబుతుంది. సరోజ పద్ధతి వేరు. చెప్పింది శ్రద్ధగా వింటుంది. అర్థంచేసుకుంటుంది. కాని ఏమర్థమయిందో చెప్పమంటే సొంత కవిత్వం కొంత జోడించి చెబుతుంది. కళ్లెర్రజేస్తే మొహం ముడుచుకుంటుంది. కోపగించుకుంటే లేచి చక్కాపోతుంది. వీళ్ళిద్దరికంటే రెండాకులు ఎక్కువ చదివినట్టుంది ఈ శ్వేత. కావలసినంత అతిశయం. దానికితోడు గడుసుదనం. చెప్పింది అర్థంచేసుకోదు. కళ్లు పుస్తకంమీద ఉన్నా మనస్సు ఎక్కడో వుంటుంది. "నాకు సరిగా అర్థం కాలేదండి - మళ్ళీ చెప్పండి సార్..." అనదు. అంతమాట అనడమే! మరి ఏంచేస్తుంది అంటే అర్థమయినట్టు నటిస్తుంది. తప్పు చెబితే ఏం - మళ్ళీ ఆయనగారే చెప్పుకొస్తాడని ధీమా. అయితే ఓ నిజాన్ని గూడా చెప్పుకోకతప్పదు. భగవంతుడు చాలా మంచి బుర్రనిచ్చాడు. తెలియనిదాన్ని తెలివి తేటలతో చక్కగా కప్పిపుచ్చుకుంటుంది.

"ఫ్లక్చుయేషన్స్ ఇన్ ది రేట్స్ ఆఫ్ ఎక్స్‌ఛేంజ్" గురించి చెబుతున్నప్పుడు—

"అబ్బ - ఇది ఇహ రేపు చెబుదురుగాని లెండి..." అంది.

ఆమాట ఎంత ముద్దుగా అందోగాని వెంటనే - "సరే - ఇక వెళ్ళు" అన్నాడతను.





ఆమె ఉడాయించడానికి పుస్తకాలు సర్దుకుంటూంటే - "ఇదిగో చూడూ - ఐ యామ్ నాట్ సాటిస్‌ఫైడ్ విత్ యువర్ ప్రోగ్రెస్ - సరళని చూడు - ఈవేళ చెప్పింది రేపు అప్పజెప్పేస్తుంది - 'ఆర్.డి.ఒగారి అమ్మాయికి చెబుతున్నారుగా - నాకూ చెప్పండీ' అంటూ నెమ్మదిగా ఇక్కడ చేరావ్. ఇప్పటికి ఎనిమిది నెలలయింది. మొన్న టెస్ట్ పేపర్లో సరళకి 72% వస్తే నీకు ఫిఫ్టీఎయిట్ వచ్చాయి. కాస్త కష్టపడి చదువు. పరీక్షలు ఇంకా ఇరవై రోజులు కూడా లేవు" అన్నాడు శేఖరం.

ఏదో బాధగా, మారుమాటాడకుండా వెళ్ళిపోయింది శ్వేత. వెడుతూ, వెడుతూ అతనికేసి ఏదోలా చూసి వెళ్ళింది. అది కోపమో, పశ్చాత్తాపమో, పెంకితనమో తెలియలేదు. ఇలాంటి చూపులు ఆవిడగారికి కొత్తకాదు.

ముడుచుకున్న మొహం అలాగే ఉండిపోయిందామెకి రెండురోజులపాటు. మాటా మంతీ ఏంలేదు. మేడెక్కడం, పుస్తకాలు ముందేసుకుని కూర్చోవడం, మొక్కుబడిగా చెప్పిందేదో వినడం, మళ్ళీ పుస్తకాలు సర్దుకోవడం, క్రిందికి దిగడం - ఇదే వరస ఈ రెండు రోజులూ. అంటీఅంటనట్టు, ముట్టీముట్టనట్టు ఏమిటీ వ్యవహారం! తను పెద్దగా ఏమన్నాడని? ఇదివరకైతే వచ్చింది లగాయతు వెళ్ళే దాకా గొడవ గొడవ, నానా హడావిడి. ఏవో కబుర్లు. గౌరిని గురించి కుశలప్రశ్నలు. సరోజ గురించి ఎంక్వయిరీలు. ఎంత చలాకీగా వుండేది. ఇంత అల్లరి చేసినా, టైమ్ వేస్ట్ చేసినా క్రిందకి దిగిపోతూంటే బాధగానే ఉంటుంది. తనకేగాదు - సరళకీను. అంత కలుపుగోలు మనిషి శ్వేత. ఆమెగారికీ తెలును తనకు ఆమె మీద ఆ ఒపీనియన్ ఉందని. ఆ ఒపీనియన్ మొదట్లో 'సాఫ్ట్ కార్నర్' రూపంలో ఉండేదనీ, ముందుముందు మరో రూపం దాల్చవచ్చనీ ఆశ కూడా ఉంది.

"ఎందుకుసార్ - శ్వేతని అలా తిట్టిపోశారు?" అంది సరళ ఆవేళ.

తను తిట్టిపోశాడా? తను అన్నది తిట్టడం క్రింద లెఖ్ఖా?

మరో రెండు రోజులు పోయాక, శ్వేత రాగానే అన్నాడతను —

"శ్రీలతకి అంతా రెడీ అయిపోయింది - నెక్స్ట్ ఛాన్స్ ఇహ నీదే" అని.

"ఛాన్స్ అనడంలో మీ ఉద్దేశ్యం?"

"నువ్వు ఏ అర్థం తీసుకున్నావసరే..."

"అనుకోకుండా కలిసొచ్చేది ఛాన్స్. ఎదురు చూస్తున్న అవకాశం తగలడం ఛాన్స్. ఈ రెంటికీ తేడా ఉంది..."

"ఉంటే...?"

"ఉంటే కాదు - అంటే? అనండి - చెబుతాను"

"సరే... చెప్పు..."

"అనుకోకుండా కలిసొచ్చేదానికోసం వెయిట్ చేసేదాన్ని కాను నేను. ఏదో అవకాశం కోసం ఎదురుచూడవలసిన పనీ నాకు లేదు"

"అంటే...?"

"ఎదురుగానే ఉన్నదానికి ఎదురుచూడ్డం ఎందుకు?" అని నవ్వింది శ్వేత.

మాటలోని అర్థంకంటే ఆ నవ్వులోని అంతరార్థం పెద్దది.

ఇన్‌డైరెక్ట్‌గా మాట్లాడుతోందని అతనికి తెలియకపోలేదు.

"అంటే- ఏమిటో సూటిగా చెప్పాలి" అన్నాడు.

"సూటిగా చెప్పడానికి ఎవరికైనా మూడ్ బాగుండాలి. నా మూడ్ పాడు చేసింది మీరే. కనుక నాకు మంచి మూడ్ వచ్చే వరకు మీరు ఆగాలి. ఆ ఛాన్స్ మీకెప్పుడొస్తుందో చెప్పలేము..."

"నీకు మూడ్ రావడం అంటే అది నాకు ఛాన్సా?"

"అంతేగదా మరి...." మళ్ళీ నవ్విందామె.

"ఏం... ఎందుకని?"

"లేకపోతే ఇప్పుడే చెప్పేసేదాన్ని కదా. సరళ ఇంకా రాలేదు కూడాను!"

"అంటే అది సరళ ఉంటే చెప్పకూడనిదా?"

"ప్రేమని గురించి, పెళ్ళిని గురించి ఒకళ్ళుండగా ఎవరైనా చెబుతారా ?"

"ఇప్పుడు నడుస్తున్న టాపిక్ పెళ్ళి, ప్రేమ కాదు."





"ప్రేమలేనిదేపెళ్ళేమిటి?"

"ఏం? ముందే పెళ్ళి కాకూడదా? మీ సిస్టర్‌కి అలాగే గదా జరుగుతున్నది?"

"దాని విషయంలో అలా జరిగి ఉండొచ్చు. అందరికీ అలాగే జరగాలని ఎక్కడుంది?"

"ఇంతకీ నేనడిగిన దానికి నువ్వు జవాబు చెప్పనే లేదు..."

"మీరేమడిగారు... నేనేం చెప్పలేదు?"

"నీ మూడ్ నాకు ఛాన్స్ ఎలా అవుతుందీ అన్నది. అందులో నాకు బెనిఫిట్ ఏముందనీ?"

"ఉంది కనకనే..." అని ఇక ఉండలేక కాబోలు పుస్తకాలు అక్కడే వదిలేసి-

"బెనిఫిట్టేమిటి- హీరోయే మీరైతే" అంటూ క్షణంలో క్రిందికి దిగిపోయింది.

స్టన్ అయిపోయాడు శేఖరం.

ఆమెగారి మనసు అర్థమయింది. ఇక ఎడ తెరిపి లేకుండా ఏవేవో ఆలోచనలు వచ్చాయి.

ఆమె ఆ నిర్ణయానికి రావడానికి కారకుడు తనేనేమో? శ్వేత ఇంకా అక్కడ ఉండి ఉంటే 'ఇంకా అనుమానమా?' అని కుండబద్దలు కొట్టినట్టు అడిగి ఉండేది! అంతేనా?- మాటి మాటికీ నన్ను ఎందుకు పలకరించేవారు? నేను మేడమీదికొచ్చినన్నిసార్లూ గంటల తరబడి ఎందుకు కబుర్లు చెప్పేవారు? 'వంట చేసుకోలేక నానా అవస్థపడుతున్నాను. నీకు జాలైనా లేదు' అన్నారో రోజున. దాని అంతరార్థమేమిటి? నాకు పాఠాలు చెప్పమని మా వాళ్ళు అడిగితే వెంటనే 'సరే' అన్నారు. మీ అంతర్యం నాకు తెలియదనుకున్నారా? ఇలాంటివన్నీ కూడా అడిగి ఉండేది.

మర్నాడు మేడమీదికి ఆమె రాలేదు.

ఆ మరునటి రోజు శ్రీప్రియ చేత పుస్తకాలు తెప్పించుకుంది. ఏం? తన ఎదుటికి రాలేకనా? అంత డెలికసీ ఫీలయ్యే మనిషా ఆమె? లేదా పిలిస్తేగాని రాదలచుకోలేదా? ఇదంతా బిడియమా, బెట్టా?

రెండు రోజుల తర్వాత శేఖరం ఆఫీసులో హెడ్‌క్లర్క్ అన్నాడు- "కంగ్రాచ్యులేషన్స్, శేఖరం- నువ్వు శ్వేతని పెళ్ళి చేసుకోబోతున్నావటగా?" అని. ఆ సాయంత్రం తన కో-క్లర్క్ శర్మ కూడా అదే మాట అన్నాడు.

శ్వేత చేస్తున్న టాం-టాం అన్నమాట ఇది!

దీని పర్యవసానం ఎంత దారుణంగా ఉంటుందో ఆమెకేం తెలుసు? వయసొచ్చినా బుద్ధిలో ఈడు రాని పిల్లలుంటారంటే శ్వేత లాంటి వాళ్ళే!

ఇంటి దగ్గర్నుంచి ఉత్తరం వస్తే ఆ వేళ రాజమండ్రి వెళ్ళాడు శేఖరం.

రెండు రోజులు అక్కడ పనులు చూసుకుని తిరిగి వచ్చాడు.

మొదటి రోజునే సరోజ ఇంటికి వెళ్ళాడు.

"బి.ఇడి చదవాలనుకుంటున్నాను.- మా ఫాదరూ, మదరూ సరే అన్నారు. నీ పెర్మిషన్ కోసమే వెయిట్ చేస్తున్నాను" అంది సరోజ లాకెట్‌తో ఆడుకుంటూ.

"మధ్య నా పెర్మిషన్ ఎందుకు?" అన్నాడు తను.

"ఏం తెలియనవాడిలా మాట్లాడితే నేనేం చెప్పలేను. నీ పెర్మిషన్ ఎందుకో నా కంటే నీకే ఎక్కువ తెలుసు" అంటూ పెరట్లోకి వెళ్ళిపోయింది సరోజ.

స్వరూపరాణి నడకలోని దర్పా- అంతా కాకపోయినా - కొంతైనా సరోజలో ఉంది. నిజానికి సరోజ లాకెట్ చూడగానే రాణి ముక్కెర గుర్తుకొచ్చింది. ఆ మూడు రోజులూ ఆమె ప్రత్యక్ష సాన్నిధ్యంలో ఏదో సేద తీరిన అనుభూతి. ఇప్పుడు- ఆలోచనల్లో తీయని ఆ స్మృతులు. అనుభవ మాధుర్యంకంటే ఆలోచనా మాధుర్యమే గొప్పదేమో!

తిరిగి గదిలోకి వచ్చింది సరోజ.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్? బి.ఇడికి వెళ్లనా, వద్దా?" అంది.

"వద్దంటే మానేస్తావా?"

"ప్రశ్నకి ప్రశ్న జవాబు అవదు. నీ అభిప్రాయం అడిగాను- మర్యాద చెయ్యవలసిన టైమ్ వచ్చింది కనక దాన్నే పెర్మిషన్ అన్నాను- చెప్పు- ఐ వాంట్ ఎ డైరెక్ట్ ఆన్సర్"

నవ్వాడు శేఖరం - మర్యాద - టైము- అంటోందేమిటి- అనుకున్నాడు. అంతే ఇదీ చిలికి చిలికి గాలి వాన కావచ్చు. ఈ ఆడవాళ్ళ



తో నెగ్గడం కష్టం. శ్వేత పాపం. తన విష యమే చెప్పుకుంది. ఈవిడగారు నన్నే ఏదో చెప్పమంటుంది.

"మంచిదే - అలాగే కానియ్. రేపు టీచర మ్మవై బాగా సంపాదిద్దామనా?" అన్నాడు.

"సంపాదన మన కోసమే గదా..." అని తక్కున లేచి వెళ్ళిపోయింది.

మనకోసం అందంటే ఇక ఏదో అనుకోవా ల్సిందేముంది? డైరెక్ట్‌గా లైన్‌లోకి వచ్చేసినట్టే!

మళ్ళీ వచ్చి ఎదురుగా కూర్చుంది. ఏం మాట్లాడ్డంలేదు. కీ యిచ్చి వదిలేసిన బొమ్మను చూస్తూ కూర్చున్న పాపాయిలా కూర్చుంది.

"ఏమిటాలా అన్నావ్?" అంటాడో,

"అలా అనడంలోని ఉద్దేశమేమిటి?" అంటాడో,

"అలా అనడం- దటీజ్ టూ మచ్ ఫర్ యు" అంటాడో - చూద్దాం అని కాబోలు ఆమెగారి తహతహ.

తనేం తక్కువ తిన్నాడా? ఆ విషయంలో తను ఏమీ అనకపోనూ లేదు, అననూ లేదు అన్నట్టుగా

"సరే... ఇహ నేనెళ్ళొస్తా" అంటూ లేచాడు.

ఆమె కాస్త కంగారు పడింది. అయోమ యంగా చూసింది. అతనికి కావలిసిందీ అదే.

"ముఖంలో ఏ భావమూ కనిపించకుండా ఉండడంలో నీకు నువ్వే సాటి" అంది.

"భావమేమిటి- కనబడ్డ మేమిటి?" అన్నా డతను.

అంతే-ఎంతపాడుగు కోపం వచ్చిందోగాని, కూచున్న కుర్చీ బర్రున వెనక్కితోసి, లేచి నిలబడింది.

"అలాగే? సరే.... అయితే అలాగే ఉండు. బి.ఇడి. లేదు. ఇహ ఏంలేదు. కాన్వెంట్‌లో జాబ్ కూడా మానేస్తాను..." అంది.

అతను పకపకా నవ్వాడు.

ఆ నవ్వు ఆమె గుండెలో కోటి దీపాలు వెలిగించింది. పట్టలేని ఆనందంతో అంది-

"చాలు- శేఖర్- ఆనవ్వు చాలు... నన్ను అర్థంచేసుకున్నావ్... నువ్వు ఓ.కె. అని వేరే చెప్పనక్కర్లేదు.. నేను అదృష్టవంతురాల్ని" అంది.

"నేను కానా, సరోజా! అసలు ఈ విషయం ముందు కదపవలసింది నేను. నువ్వే ముందు చెప్పావ్-సంతోషం-ఇక వెళ్ళి వస్తాను" అన్నా డు శేఖర్.

"ఒక్క నిమిషం నువ్వు అలా ఆ ఈజీ చైరులో కూర్చో...."

"ఈజీ చైరులోనా? నేనెప్పుడూ కూర్చోలే దే-అది నీది కదా..."

"అదిగో-మళ్ళీ నా చేత చెప్పించాలనా?"

"అక్కర్లేదులే-నేనే చెబుతాను. ఇక నీదీ నాదీ అని ఏముంది. అంతా మనదే అంటావ్"

"అంతేగా మరి... నీకు 'ఏ' క్లాస్ కాఫీ తీసుకొస్తానుండు..."

"కాఫీ వద్దు...."

"పోనీ మిల్క్ తీసుకొస్తాను..."

"పాలు నువ్వు అందివ్వడం ఇప్పుడు కా దు-ఇక్కడా కాదు..."

"ఛీ... అన్నీ పాడుమాటలే..."

"నాకేమీ అక్కర్లేదు సరోజా- అది సరే గాని- మన విషయం మనం ఇద్దరం అనుకోగానే సరా? మీ పేరెంట్స్ అంగీకారం కూడా కావాలి గదా"

"ఔను... అదంతా నాకు వదిలిపెట్టు"

శేఖరం వెళ్ళిపోయాడు.

అతను తాడేపల్లిగూడెం వెళ్లాక పొద్దున్న ఎనిమిదింటికే ఎం.ఎల్.ఎ.గారింటికి వెళ్లాడు.

శేఖరాన్ని చూడగానే ఆయన- "రావ య్యా-గుడ్‌న్యూస్ టు యు-మిస్టర్ శేఖరం...." అన్నారు.

ఏమిటా అని కాస్త కలవరపడ్డాడతను.

శేఖరాన్ని లోపల ప్రైవేట్ రూంలోకి తీసుకె ళ్ళి ఏదో రహస్యంగా చెబుతూన్నట్లు నెమ్మదిగా చెప్పారు వీర్రాజుగారు. విషయమేమిటంటే- ఆయన ఢిల్లీ వెళ్ళి వచ్చారు ముందటి రోజునే. అక్కడ ఉంటూన్న వాళ్ళ అమ్మాయి, అల్లు డూ, మనుమలూ అందర్నీ చూసి, వచ్చేటప్పు డు వాళ్ళకి శేఖరం విషయం చెప్పి, వాళ్ళ చెల్లెలు గౌరిని ఢిల్లీ పంపిస్తాననీ, రెండు మూడేళ్ళపాటు ఢిల్లీలో వాళ్ళింట్లోనే ఆమెను ఉండనిమ్మనీ పెద్ద చదువు ఏదో చదువు తుందనీ చెప్పి ఒప్పించి వచ్చాడు. ఆమె మైన్‌టెనెన్స్‌కీ, చదువుకీ అవసరమైన





...lk of the town...ఏ నోట విన్నా...Talk of the town...ఏ నోట విన్నా...Talk

# చతుర



ఖర్చంతా తనే పెట్టుకుంటానని చెప్పాడు.

శేఖరం ఏదో ఆలోచిస్తున్నాడు.

"సిరి వస్తుంటే మోకాలడ్డేవాళ్ళుంటారుట య్యా శేఖరం?-ఏమిటా ఆలోచన? గౌరిని ఐ.ఎ.ఎస్. చదివిస్తున్నాం. అదీ సంగతి. అర్థ మయిందా?" అన్నారు వీర్రాజుగారు.

బ్రహ్మానందమయింది అతనికి. వీర్రాజుగా రు అంత ఎత్తుకు వెడతారనుకోలేదతను.

"సంతోషం సార్-చాలా సంతోషం-అలాగే చేద్దాం-మా అమ్మగారు కూడా కాదనరు. మా కుటుంబానికి మీరు చాలా చేస్తున్నారు" అన్నా డతను. అతనికి కళ్ళు తడిసినై.

"నువ్వు నాకు చెయ్యలేదటయ్యా" అన్నా రాయన.

మర్నాడే మళ్ళీ రాజమండ్రి వెళ్ళి తల్లితో ను, గౌరితోనూ విషయం చెప్పి వచ్చాడు. ఇదంతా ఎవరితోనూ చెప్పవద్దని కూడా చెప్పా డు.

ఆవేళ శారదమ్మగారు అడిగింది శేఖర్ ని-"బాబూ శేఖరం మా శ్వేత ఎలా చదువు తోంది? పరీక్షలు దగ్గరవడ్డాయిగదా?"

" నేననుకున్నంత ప్రోగ్రెస్ కనిపించడంలే దండి-శ్వేత ఇక్కడ లేదు గనక చెబుతున్నా ను-ఆమెలో కుర్రతనం పోలేదు. చదువు అంటే చాలా సీరియస్ విషయం. ఉన్నది ఉన్నట్లు చెప్పాలంటే శ్వేత బాగా చదవటంలే దు. ఆ సరళతో కబుర్లతో సరిపెట్టుకుంటుంది. రేపటినుంచి క్రిందే పాఠాలు చెబుతాను" అన్నాడు శేఖరం.

* * *

మూడు నెలలు గడిచిపోయాయి.

శ్రీలత పెళ్ళి అయింది. పెళ్ళిపెత్తనం అంతా శేఖరమే నిర్వహించాడు. ప్రకాశరావుగా రికీ ఇతనికీ ఏం బంధుత్వముందని ఇంత శ్రమ పడుతున్నాడు? అని చాలామంది అను కున్నారు. శారదమ్మగారే ఆశ్చర్యపోయింది అతని చొరవ చూసి.

ఆ తర్వాత గౌరిని ఢిల్లీలో అప్పగించి రావడానికి వెళ్లాడు శేఖరం. తిరిగి వచ్చేటప్పు డు అహమ్మదాబాదు వెళ్ళి రావాలని నిశ్చ యించుకున్నాడు. అందుకు కారణం శ్రీలత పెళ్ళి టైములోనే స్వరూపరాణినుంచి వచ్చిన ఉత్తరం. నిజానికి ఆ ఉత్తరం అందింది మొదలు అతని మనసు మనసులో లేదు. తన జీవితంలో ఇంతవరకూ ఎవరిమాటా, ఏ సంఘటనా తనపై అంత ప్రభావం చూపలే దు. ఉత్తరంలో రాణి వ్యక్తపరచిన సెంటి మెంట్స్ తన మనస్సుపై శాశ్వత ముద్ర వేయ గలిగాయి. ఉత్తరం అంతా ఒక ఎత్తు- మధ్యలో 'ఇన్ వన్ వర్డ్ మిష్టర్ శేఖర్-ఐ లవ్ యు' అన్నమాట ఒక ఎత్తు. తన తల రాతనే మార్చివేయగలమాట అది.

ఇన్నాళ్ళు ఆమెకు జవాబు వ్రాయనేలేకపో యాడు. ఎన్నిసార్లు ప్రయత్నించినా కలంసాగ లేదు. ఏం వ్రాయగలడు? క్షమించరాని ఆల స్యం చేస్తున్నట్లు అతని మనస్సు ఘోషిస్తూనే ఉంది.

తను ఢిల్లీ వెడుతూన్నట్లు ఎవరికీ చెప్పలేద తను. పదిరోజులు సెలవుపెట్టి ఏదో ఊరు వెడుతున్నట్లు మాత్రం చెప్పాడు.

వెళ్ళే ముందు స్వరూప రాసిన ఉత్తరం తీసి మరోసారి చదువుకున్నాడు.

ఉత్తరంలో భాష, భావం, బాధ్యత ఒకదా నితో ఒకటి పోటీపడుతున్నాయ్. నిజానికి తన భవిష్యత్తు గురించి ఆమెకెందుకింత తపన? ఏమిటీ బాధ్యత? ఎవరు అర్థించారని?

అన్‌బ్లెమిష్డ కేరెక్టర్‌లోంచి పెల్లుబికిన పవి త్ర భావన అది. ఉత్తరంలో పైకి అవగతంకాని ఏదో మనోవేదన ఉంది. మమతల దొంతర ఉంది. ఆనక నాలిక కొరుక్కునే తొందరపాటూ ఉంది. ఆగని ఆవేదనా ఉంది. ఆమె చెప్పద లచుకున్నది చెప్పింది. చెప్పకుండా ఉండ లేని టైము వచ్చింది కనక చెప్పింది. అర్థం చేసుకోపోతే ఆ తప్పు తనది అవుతుంది. దేవలోకపు స్త్రీలలో అన్నీ సాత్విక లక్షణాలే ఉన్నా అవగింజంత అసూయ ఉండకుండా ఉండదట. అలాగే ఆడజాతి ఎంత నిబ్బ రంగా పైకి కనిపించినా సమయం వచ్చినప్పు డు మనసులోని మాట దాచుకోలేరు.

ఈ ఉత్తరం తను పెర్మిషనించి వచ్చిన వెంటనే వస్తే ఎంత బాగుండేది! "నేను మాత్రం అదృష్టవంతుణ్ణి కానా, సరోజా?" అని తను అనకముందే వస్తే ఈ మానసిక ఆందో ళన తనకుండేదికాదు. ఏది ఎప్పుడు జరుగు




తుందో ఎవరు చెప్పగలరు? తను సరోజ మీద మనసుపడినమాట నిజం. ఆమెకు మాట ఇచ్చిన సంగతీ వాస్తవమే. ఇంత జరిగాక ఇప్పుడు ఇదంతా ఏమిటి? ఇప్పుడేం చెయ్యాలి?

ఏదేదో ఊహించుకుంటాడు మనిషి. దేనికో ఆరాటపడతాడు. కాని అనుకోని సంఘటనలు చోటుచేసుకుంటాయ్. ఊహలు నిజం అవవు. కోరికలు నెరవేరవు. పైగా ఊహించనిదేదో జరుగుతుంది. అప్పుడు తెలుస్తుంది మనిషికి తానెంతటి పరాధీనుడో- ఎంత నిస్సహాయుడో. ఇది అక్షరాలా నిజం. దీనికి ప్రత్యక్ష నిదర్శనం తనే! ఇలా ఏవేవో ఆలోచనలతో శేఖరానికి మనశ్శాంతి కరువైంది.

ఢిల్లీలో సాదరంగా ఆహ్వానించారు వీర్రాజు గారి కూతురు సౌజన్య, అల్లుడు సతీశ్‌బాబు. ఎంతో సంతోషమయింది శేఖరానికీ, గౌరికీ.

శేఖరం అక్కడ రెండు రోజులే ఉన్నాడు.

"గౌరి బాధ్యత మాది- మా ఇంట్లో మనిషిగా చూసుకుంటాము. ఆమె చదువు పూర్తికాగానే మళ్ళీ మీ చెల్లెల్ని మీకు పువ్వుల్లో పెట్టి అప్పగిస్తాం" అంది సౌజన్య.

మీ చెల్లెలు మా వద్ద క్షేమంగా ఉంటుంది. మీరేం బాధపడకండి" అన్నాడు సతీష్‌బాబు

వాళ్ల ఆదరాభిమానాలు, గౌరవం, చూస్తూంటే వీర్రాజుగారు తమను గురించి ఎంత గొప్పగా చెప్పి ఉంటాడో అనిపించింది వాళ్లకి.

సౌజన్య కూతురు ఉష. కొడుకు శ్రీకాంత్. ఇద్దరూ కాన్వెంట్‌లో చదువుతున్నారు. రెండో రోజు నుంచే ఎంతో చనువైపోయారు. గౌరిని పట్టుకు వదలడంలేదు. చాలా సంతోషమయింది శేఖరానికి.

మూడో రోజున పార్లమెంట్ హౌస్, రెడ్‌ఫోర్టు చూసి ప్రయాణమయ్యాడు శేఖర్.

అహమ్మదాబాదులో రైలుదిగి, భోజనంచేసి, పురోహిత్ హోటల్‌కు వెళ్లి లాడ్జి తీసుకున్నాడు.

సాయంత్రం స్వరూపరాణి ఇంటికి వెళ్లాడు.

అది ఇల్లు అనడానికి వీల్లేదు. పెద్ద రాజభవనంలా ఉంది. ప్రహరీగోడకి చాల లోపలికి ఉంది భవనం. అందులో చాలా ఆఫీసులు ఉన్నట్టున్నాయ్. గోడలమీదకే దింపిన సైన్‌బోర్డులు కనిపిస్తున్నాయ్. భవనం చుట్టూ విశాలమైన లాన్స్. ముఖద్వారానికీ మెయిన్‌గేటుకీ మధ్య ఉన్న కాలిబాటకి అటూ ఇటూ ఎలక్ట్రిక్ స్తంభాలు, వాటిపై గ్లాస్ గ్లోబులు.

మెయిన్‌గేట్ దగ్గర యూనిఫాంలో ఉన్న జవాను శేఖరాన్ని ఆపాడు.

"ఎవరికోసం?" అని హిందీలో అడిగాడు.

"శాంతిభూషణ్ సాబ్ అందర్‌హై?"

"తుమారా నామ్?"

"శేఖర్..."

'అచ్ఛా...' అంటూ అతను ప్రక్కనే ఉన్న చిన్న గదిలోంచి ఆఫీసులోకి ఫోన్ చేసాడు. రెండు నిమిషాల్లో తిరిగొచ్చి-

"అచ్ఛా... అందర్ జాయియే... గుజరాత్ కాటన్ కార్పొరేషన్‌కి జాయియే..." అన్నాడు.

లోపలికి వెళ్లాడు శేఖర్.

ఎదురుగా ఓ ప్రక్కకి బోర్డు కనిపిస్తోంది.

కాటన్‌సేల్స్ కార్పొరేషన్ అది.

ఇదే వాళ్ళ ఆఫీసు కాబోలు-మరి ఇల్లెక్కడా? అనుకుంటూ నడిచాడు.

అదిపెద్ద ఆఫీసు. ఇరవై ముప్ఫైమంది దాకా ఉన్న స్టాఫ్. అకౌంట్స్, సేల్స్ వగైరా సెక్షన్లు, సంబంధిత ఆఫీసర్లు అందరినీ దాటి లోపలికి వెడితే, గ్లాస్ డోర్స్ మధ్య గాబర్డిన్ సూట్‌లో ఉన్న శాంతిభూషణ్.

అతను లోపలకి వెళ్ళగానే-

"వెల్‌కం మిష్టర్ శేఖర్..." అంటూ శాంతి భూషణ్ సీటు ఆఫర్ చేసాడు.

"టుడే ఈజ్ ఎ గుడ్‌డే టు మీ అండ్ మోర్ సో టు స్వరూప..." అన్నాడు.

అతనిలోని సహజమయిన సంతోషం చూసి "ఎంత మర్యాదస్తులు!" అనుకున్నాడు శేఖర్.

"శేఖర్ పర్సనాలిటీ చూసి తనకంటే అతనే బాగున్నాడే" అనుకున్నాడు శాంత భూషణ్.

"ఇది ఆఫీసు కదా - మరి మీ రెసిడెన్స్?" అడిగాడు శేఖరం.

"ఊపర్... ఫస్ట్ ఫ్లోర్" అన్నాడతను.

"ఫాదర్...డూయింగ్ వెల్?"

"క్వయట్ ఓ.కె..."

ఇద్దరూ కలిసి పైకి వెళ్ళారు.

శేఖరాన్ని చూసి కౌగిలించుకున్నారు గంగారాంగారు. అది నిజంగా శేఖరం ఊహించని చర్య.

రాణీ ఎక్కడా కనిపించదేం?

ఆమె ఇంట్లో ఉన్న అలికిడి ఎక్కడా లేదు.

అడిగితే బాగుండదేమో!

అప్పుడే శాంతిభూషణ్ అన్నాడు శేఖర్‌తో-

"మీకు మా సిస్టర్ లెటర్ వ్రాసింది కదా!"

"ఔనండి..."



"చాలా రోజులైనట్టుంది..."

"ఔనండి... వన్ మంత్ అయి ఉంటుంది."

"మరి... మీరు రిప్లయ్ ఇచ్చారా...?"

"ఎక్స్‌క్యూస్‌మి...నేను..."

"మీరేమి చెప్పినా అది సరియైన ఎక్స్‌క్యూస్ అవదు. మోరోవర్ ఇటీజ్ నో కర్టెసీ ఎటాల్..."

తప్పు చేసినందుకు తలదించుకోవలసి

వచ్చింది శేఖరానికి.

ఏం రాయాలో తోచకనే తను రాయలేదని వాళ్ళకేం తెలుసు? సరోజకీ తనకీ మధ్య జరిగింది చెప్పకుండా ఉండటం ఎట్లా? ఈవేళ చెప్పకపోయినా రేపు తెలియక మాన దు గదా! తన పరిస్థితి ఇంత క్రిటికల్‌గా ఉందని వాళ్ళకెలా అర్థమవుతుంది?

ఇంతలో గంగారాంగారన్నారు-

"సారీ మిష్టర్ శేఖర్ - నీవు వచ్చిన టైముకే మా స్వరూప ఊళ్ళో లేదు. హైదరాబాద్ వెళ్ళింది."

"అక్కడి పత్రిక నించి ఆమెకు ఏదో ఇన్వి టేషన్ వచ్చింది. మూడు రోజులైంది వెళ్ళి" అన్నాడు శాంతిభూషణ్.

రాణీ ఇంట్లో లేదు అని తెలియగానే ఏదో ఫ్రస్ట్రేషన్ కలిగినట్లయిందతనికి.

"మరో నాలుగు రోజుల్లో తిరిగి వచ్చేస్తుంది" అని శాంతిభూషణ్ అనగానే.

"నేనో... అంత చప్పుని రాదు. షి మేగో టు రాజమండ్రి ఫ్రం దేర్" అన్నారు గంగారాంగా రు.

'రాజమండ్రియా? రాజమండ్రి వెడతా నందా రాణీ?' తనపై ఆమె ఏ మేరకు ప్రేమ పెంచుకుందో అర్థమయింది శేఖరానికి.

"అయితే నేను రాజమండ్రి వెళ్ళిపోతాను" అన్నాడు కంగారుగా.

"అరె - హాడ్యుయు మీన్ - నువ్వు ఇలా వెళ్ళగానే ఆమె తిరిగివస్తే...?" అన్నారు గంగా రాంగారు.

"ఎస్ - క్వయిట్ కరెక్ట్. కనుక మిష్టర్ శేఖర్ మీరు ఇక్కడే ఉండిపోండి. నేను ఆమెకు టెలిగ్రాం ఇస్తాను" అన్నాడు శాంతిభూషణ్.

'సరే' అన్నట్టు ఊరుకున్నాడు శేఖరం.

ఓ నిమిషం ఆగి, శాంతి భూషణ్‌తో చెప్పా డు.

"నాకు తెల్లవారు ఝామునే పూజ చేసు కోటం అలవాటు. పీస్‌ఫుల్‌గా ఉండే చోటు చూపించండి. వీలైతే ఓ గది."

"మా స్వరూపకి కూడా ఆ అలవాటు ఉంది. ఆమెకు పూజగది సెపరేట్‌గా ఉంది. రండి చూపిస్తాను. అక్కడే మీరూ..." అన్నాడు భూ షణ్.

రాణీ రాకకోసం అక్కడే ఉండిపోయాడు శేఖరం-మూడు రోజులు.

ఆ మూడురోజులూ ఓ మహారాజుకి జరిగే మర్యాదలు అతనికి జరిగాయ్

సరిగా ఆరు కొట్టేసరికే కాఫీ, అంతకు గంటముందే షవర్‌బాత్, ఏడున్నరకి టిఫిన్ అండ్ నెస్‌కేఫ్. పది వరకు న్యూస్‌పేపర్. పది దాటేసరికి క్రాక్‌జాక్స్ అండ్ హార్లిక్స్, పన్నెండు వరకు మ్యాగజైన్, మధ్యలో విసుపుగా ఉంటే వీడియో క్యాసెట్ లేదా పాప్ మ్యూజిక్, టై ట్వెల్వ్ షడ్రసోపేతమైన భోజనం రెండున్నర వరకూ రెస్ట్, మూడింటికి మిక్చర్ అండ్ బ్రూ, మూడున్నరకి లావెండర్ బాత్, నాలుగు నించి అయిదున్నరవరకు ఔట్‌డోర్ రిక్రియేషన్, ఆరు, తొమ్మిది మధ్య ఇంగ్లీష్ పిక్చర్, తొమ్మిది న్నరకి డిన్నర్, పదిన్నరకల్లా బెడ్‌రూం.

ఇంట్లో కావలసినంత మంది నౌకర్లు. అంతా హైక్లాస్ మొజాయిక్ ఫ్లోరింగ్, గోడలకి ఆయిల్ పెయింట్, కిటికీలకి సిల్క్ కర్టెన్లు, ఎక్కడ చూసినా బ్లాక్‌వుడ్ ఫర్నిచర్, హాల్లో నూ, బెడ్‌రూమ్స్‌లోనూ కలర్ టి.వి.లు.

ఊళ్లోకి తను ఎప్పుడు వెళ్లినా కారులోనే, ఎస్కార్ట్‌గా ఓ సర్వెంటు.

నాలుగోరోజు మధ్యాహ్నం ఫోన్ వచ్చింది రాణీ నించి. ఏర్‌పోర్ట్‌కి కారు పంపమని. రిసీవ్ చేసుకున్నది శాంతిభూషణ్. అతడు ఆ విషయం చెప్పగానే-

"ఐ విల్ గో అండ్ రిసీవ్ హర్" అన్నాడు శేఖరం.

"వి షల్ బోత్ గో" అన్నాడు శాంతిభూషణ్.

కారులో అతను చెప్పాడు శేఖరంతో-

'స్వరూప చాలా పెక్యూలియర్ టైప్ ఆఫ్ లేడీ' అని. చీటే ఎంతమాత్రం సహించదు.' ఎంత కైండ్ హార్టెడో అంత సెల్ఫ్ రెస్పెక్ట్ కలది. ఏ లేడీ ఆఫ్ క్విక్ డెసిషన్- అని

'క్విక్ డెసిషన్ అంటే చాలా ప్రమాదమే. అది మంచికైతే ఫరవాలేదు' అనుకున్నాడు శేఖరం.

ఎయిర్‌పోర్టులోనే శేఖర్‌ని నిలదీసి అడిగిన

ట్లు అడిగింది- 'రిప్లయ్ వ్రాయలేదేం?' అని.

ఇల్లు చేరే వరకు కారులో అతనితో మాట్లాడ నేలేదు.

ఎలాగో ఆ సాయంత్రానికి, మనిషి కాస్త చల్లబడింది.

ఆదివారం రోజుకి తప్పకుండా శేఖర్ రాజమండ్రిలో ఉంటాడని ఆరోజుకి తను వాళ్ళింటికి వెళ్ళినట్టు, మాణిక్యాంబగారిని చూసినట్టు, గౌరి ఇంట్లో లేనట్టు చెప్పింది.

"పెర్‌హేప్స్ యు ఆర్ హైలీ డిసపాయింటెడ్" అన్నాడు శేఖరం కాస్త కన్సోలింగ్‌గా.

"డజంట్ మేటర్- ఇట్ కాస్టెడ్ మీ ఓన్లీ తౌజండ్ రూపీస్ ఎక్స్ట్రా- ఫర్ వాయుదూత్ అండ్ టాక్సీస్" అందామె.

తను గౌరిని తీసుకుని ఢిల్లీ వెళ్ళినట్టు అక్కడ సౌజన్యగారింట్లో అప్పజెప్పి వచ్చినట్టు చెబుదామనుకొనే ఎంచేతనో చెప్పలేదు శేఖరం.

బాగా చల్లబడ్డాక గాలి, ఆహ్లాదకరమైన వాతావరణం, ఎదురుగా తనను మెచ్చి మనసిచ్చిన నెచ్చెలి,- అయినా అతను నార్మల్ మూడ్‌లో లేడు. ఆమె చెబుతున్నది వింటున్నా మనసు మనసులో లేదు. జవాబు వ్రాయలేదేం? అని రాణి నిలదీసి అడిగిందంటే అందులో ఆమె తప్పు ఏముంది? తప్పంటూ ఉంటే అదంతా తనదే!

అతనినించి రెస్పాన్స్ సరిగా రాకపోవడం ఆమె గ్రహించింది.

"పెర్‌హేప్స్ యు ఆర్ అఫెండెడ్- ఐ బెగ్ ఎక్స్క్యూజ్" అంది.

"నో-నో-రాణీ-నథింగ్ ఆఫ్ దట్ సార్ట్" అన్నాడతను. నిజానికి ఆమె అన్న ఆ మాట అతనిలోని మొత్తం బాధని నివృత్తి చేసింది. మామూలు మనిషి అయ్యాడు. అదీ ఆమె గ్రహించింది.

"నేను రమ్మని కోరాను. మీరు వచ్చారు. అందుకు నా కృతజ్ఞత" అంది.

"ఇన్‌ఫాక్ట్ నేనే మీకు- మీ కంటె ముందే- లెటర్ వ్రాద్దామనుకున్నాను. కాని... అది అన్‌డ్యూ లిబర్టీ, అవుతుందేమోనని వ్రాయలేదు" అన్నాడతను.

"అది అన్‌డ్యూ లిబర్టీ ఎలా అవుతుందీ?"

"మీరు నన్ను ఎలా అర్థంచేసుకున్నారో నాకుతెలియదుగా"

నవ్వింది రాణి

"నిజమే... ఎనీవే... ఐయామ్ ఇన్‌ది సెవెంత్ హెవెన్ ఇన్ యువర్ ప్రెజెన్స్" అంది.

అప్పుడే శాంతిభూషణ్ వచ్చాడు అక్కడికి.

"మిస్టర్ శేఖర్- ఐ ప్రపోస్ ఎ జాలీ ట్రిప్ టు బాంబే టుమారో- మీరూ నాతో రావాలి" అన్నాడతను.

"వెరీ సారీ మిస్టర్ భూషణ్- నేను వచ్చి నాలుగురోజులైంది. ఐ హేవ్ నో లీవ్ ఎట్ క్రెడిట్- రేపే రాజమండ్రి వెళ్ళిపోవాలి"

"ఇప్పుడెందుకు ఈ జాలీట్రిప్పులూ, ఎక్స్‌కర్షన్‌లూ- ఆయన్ని మరో రెండు రోజులు ఇక్కడే ఉండమని రిక్వెస్ట్ చేసినా అది సబబు" అంది రాణి.

అప్పుడే మైడ్ సర్వెంట్ ఫ్రూట్ జ్యూస్ సర్వ్ చేసి వెళ్ళింది.

ఫ్రూట్‌జ్యూస్‌లోని రకాలు, మాంగో జ్యూస్, ఆపిల్‌జ్యూస్ వగైరా డ్రింక్స్ తయారీ, వాటిలో బ్రాండ్స్, లేటెస్ట్ యరైవల్స్ ఏవేవో చెప్పాడు భూషణ్.

వాటిలో అంత పరిజ్ఞానములేదు శేఖరానికి- ఆ టాపిక్‌కి అది టైమూ కాదు. రిసెప్టివ్‌గా మాత్రం విన్నాడు. అంతే 'హైక్లాస్ మనుషులతో ఇదే గొడవ' అనుకున్నాడు.

కాసేపయ్యాక-

"నేను సినిమాకి వెడుతున్నాను- ఐ లైక్ యువర్ కంపెనీ- మిస్టర్ శేఖర్- నాతో వస్తారా?" అన్నాడు శాంతిభూషణ్.

"ఓ- శాంతీ... డోన్ట్ డిస్టర్బ్ హిమ్ ఐ సే" అంది రాణి. ఆ అనడం కాస్త గట్టిగానే అంది.

"ఆల్‌రైట్... కారీఆన్..." అంటూ అతను వెళ్ళిపోయాడు.

అన్నగారు వెళ్లగానే స్వరూప అంది-

"మిస్టర్ శేఖర్- నా మేరేజ్ విషయంలో మా ఫాదర్ తొందరపడుతున్నారు. అఫ్ కోర్స్- హి ఈజ్ జస్టిఫైడ్...ఐ యామ్ ట్వెంటీ సెవెన్ నౌ.

మా అంకుల్స్ సన్ ఒకాయన లక్నోలో వర్క్ చేస్తున్నారు- ఎర్‌పోర్ట్ ఆఫీసర్‌గా. అతన్ని అల్లుడిగా చేసుకుందామని ఆయన ప్రపోజల్..."

"... ... ... ..."

"వింటున్నారా...?"

"చెప్పండి - చెప్పండి..."

"మా ఫాదర్‌ది హేస్టీ ప్రపోజల్ అని నా ఉద్దేశం- అతని మీద ఆయనికి అభిమానం ఉంటే ఉండొచ్చు... కాని.. హి ఈజ్ ఎ మాన్ ఆఫ్ లూస్ కారక్టర్"

శేఖరం ఏమీ అనలేదు.

"మా బ్రదర్ కూడా వాళ్ల ఇంజనీర్ ఫ్రండ్ ఒకాయన్ని తీసుకొచ్చాడు. హీ ఈజ్ ఎ మాన్ విత్ ఓన్లీ బోన్స్ అండ్ నో ఫ్లెష్" అని పకపకా నవ్వింది రాణి.

"మీరేం మాట్లాడ్డం లేదే" అంది.

"మీరు చెప్పడం అయ్యాక నేను మాట్లాడతాను- చెప్పండి" అన్నాడు శేఖరం.

"మారేజెస్ ఆర్ మేడిన్ హెవెన్ అంటారు- డు యు ఎగ్రీ?" అందామె.

"ఎస్- ఐ డూ ఎగ్రీ"

తన చేతిలో ఉన్న బుక్కుతో మార్క్ చేసి ఉంచిన ఓ కొటేషన్ అతనికి చూపించి, "ఇది చదవండి" అంది.

అతను చదివాడు-

"ఇద్దరూ ఎంత యీక్వెల్ పార్ట్‌నర్స్ అయినా భార్య సబ్‌మెర్సివ్‌గా ఉండటమే మన హిందూ కల్చర్‌కి మూలసూత్రం. అదే కుటుంబానికి అందం" అంది రాణి.

ఆశ్చర్యపోయాడు శేఖరం ఆమాటకి.

'హేట్సాఫ్ టు యు రాణీ- ఫర్ యు వర్ హోలీ కన్విక్షన్' మనసులోనే అనుకున్నాడు.

రాణి బ్రాడ్‌విజన్ ముందు సరోజ ఏపాటి?

"బై ది బై- మీకు ఓ విషయం చెప్పడం మరచాను. మీరు మరీ ఆలస్యం చెయ్యకుండా తిరిగి వెళ్లడం మంచిది. మీ మదర్ మీకోసం బెంగపెట్టుకున్నారు" అంది రాణి.

"తప్పకుండా- రేపే బయలుదేరదామనుకుంటున్నాను"

"మీ మదర్‌కి మీరంటే ఎంత ప్రేమనుకున్నారు? పెర్‌హేప్స్ యు డునాట్ నో- ఐనో..."

అతను నవ్వాడు.

"నౌ ఐ కమ్ టు అవర్ పాయింట్- నేను మిమ్మల్ని రమ్మని పిల్చింది నా మేరేజ్ విషయం మీతో స్వయంగా చెప్పాలని- నేను ఎవరి ప్రపోజల్సూ వినదలచుకోలేదు"

"గుడ్- యు కెన్ సెలక్ట్ వన్ ఆఫ్ యువర్ ఓన్ ఛాయిస్"

"నా సెలక్షన్ ఎప్పుడో అయిపోయింది- అంటే మీకు లెటర్ వ్రాసిన టైములోనే- ఆ సంగతి మీకూ తెలును..."

అతనేమీ అనలేదు.

"మీరేమైనా అన్నా అనకపోయినా- నా నిర్ణయం మీకు తెలును- 'ఐ లవ్ యు' అని నాచేత వ్రాయించుకోగలిగిన అసాధారణ వ్యక్తిత్వం మీది. ఎక్కడ రాజమండ్రి, ఎక్కడ అహమ్మదాబాదు, మనం షిర్డీలో కలవడమేమిటి? ప్యూర్లీ యాక్సిడెంటల్- బట్ క్లియర్లీ ప్రీడిస్టెండ్- మారెజెస్ ఆర్ మేడిన్ హెవెన్ అంటే ఇదే! ఇప్పుడు చెప్పండి. మీ జీవిత భాగస్వామిగా నన్ను అంగీకరించగలరా?" అంది రాణి.

"నేను...." అని అతనేదో చెప్పబోతూంటే ఆమె మళ్లీ అంది-

"నో కంపల్షన్- నో ప్రెషర్- నథింగ్- యు కెన్ బి యాజ్ ఫ్రీ యాజ్ ఐ యామ్"

శేఖరం అన్నాడు-

"రాణీ- నాకు ఆనందంతో మాటలు రావడంలేదు. ఇంత అదృష్టానికి నేను అర్హుణ్ణికానేమో- ఇంత మన్నన, అభిమానం ఎక్కడా చూడలేదు- ఐతే షిర్డీలో నన్ను చూసిన మొదటిరోజునే ఇంత గౌరవం చూపారు. రాణీ లెవెల్ అర్థం చేసుకోడం సామాన్య విషయం కాదని నేను అప్పుడే తెలుసుకున్నాను... నేను మిమ్మల్ని అంగీకరించలేనని చెప్పినా మీరు కాస్త డిస్టర్బ్ అవుతారేమో తప్ప, నన్ను తప్పుపట్టరు, నోరు జారరు. దటీజ్ స్వరూప- ఐనో..." చెబుతున్నాడతను.

ఆమె వింటూంది. అతను కంటిన్యూ చేశా





డు-

"మిమ్మల్ని నా లైఫ్ పార్ట్‌నర్‌గా స్వీకరించడానికి నాకు అభ్యంతరం ఎందుకుంటుంది? కాని... ఐ హేవ్ మై ఓన్ ప్రాబ్లెమ్స్...."

"చాలా సంతోషం- మిస్టర్ శేఖర్- ఐ యామ్ ఎక్స్‌ట్రీమ్‌లీ హేపీ- ఏవో ప్రాబ్లెమ్స్ అందరికీ ఉంటాయ్- ఏది ఏమైనా ఏ తియ్యని మాట కోసం నేను ఇంతకాలం వేచి ఉన్నానో అది ఇప్పటికి విన్నాను" అంది రాణి.

ఆ క్షణాల్లోనే లేచి ఆమె అతని దగ్గరగా వెళ్లి అతని చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది. అవధులు దాటిన ఆనందం, ఏదో తృప్తి ఆమెను కుదిపివేస్తున్నాయ్.

నిజానికి అంత ఆనందం అతనిలో కన్పించటం లేదు.

"మీకు ప్రాబ్లెమ్స్ ఏవో ఉన్నాయన్నారు- చెప్పండి..." అందామె.

అవి చెప్పదగిన సమస్యలా? అవి బైటపెడితే తామిద్దరూ ఒకటికాగలరా? అసలు తన మీద శ్వేత చూపిన మోజు, నడిపించిన కథ తెలిస్తేనే చాలు, ఈమె నుండి ఉత్తరమే వచ్చేదికాదు. సరోజపైన తను మనసుపడడం, మాటివ్వడం సంగతి తెలిస్తే అసలు 'ఆహ్వానం' ప్రసక్తే ఉండేది కాదు. గౌరి బతుకు బాట ఇంకా తేలలేదు. ఆమె ఎంత చదువుకున్నా ఆ జీవితం ఓ సమస్యకావచ్చు. పైగా వీళ్ళ హోదాల ముందు తను ఏపాటి? వీళ్లల్లో చాలామంది ఆఫీసర్లు, ఇంజనీర్లు, బిజినెస్-మాగ్నెట్‌లు- మరి తను? ఓ టెంపరరీ గుమస్తా. ఈ సమస్యలన్నిటికీ మించినది డబ్బు. రాణితో వివాహానికి ఒప్పుకుంటే ఎంత డబ్బు కావాలి? ఎన్ని తులాల బంగారం పెట్టి వాళ్లని తృప్తిపరచగలడు? అహమ్మదాబాదుకి బంధుమిత్రులతో వచ్చి వెళ్లడానికే అవుతాయ్ కొన్నివేలు.

తను జీవితంలో ఇప్పటికి ఎన్నో అనుకున్నాడు. ఏదీ జరగలేదు. ఇది ఎప్పుడూ అనుకోనిది. ఇలా జరిగింది.

ఇప్పుడేంచెయ్యాలి? కుబేరుల ముందు కుచేలుడిలా నిలబడ్డమేనా? 'ఐ హేవ్ నో అబ్జెక్షన్' అని ఇక్కడ చెప్పినందుకు అక్కడ సరోజకిచ్చిన మాట ఏమయిపోతుంది? చిన్నతనం, చిలిపితనంవున్నా మంచితనం కూడా వున్న శ్వేత మాటేమిటి? ఇది జటిల సమస్య కాకపోయినా న్యాయంగా ఓసారి అనుకోవలసిన విషయమేగదా! ఆమెగారు ఏ నూతికో గోతికో పరుగుపెడితే ఎలా?

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" అంది రాణి.

"నాకు మూడునెలలు టైమ్ ఇవ్వండి" అన్నాడు శేఖరం.

"మూడునెలలా... ఎందుకని అంతటైమ్?"

"చెప్పానుగా- కొన్ని ప్రాబ్లెమ్స్ వున్నాయని"

"ఈజిట్ మనీ ప్రాబ్లెమ్?"

"అదొక్కటే కాదు"

"మరి...?"

'అలస్యంగా ఆహారానికి బయలుదేరిన పిట్టలు ఆకాశంలో బద్ధకంగా రెక్కలు కొట్టుకుంటాయ్. ఎదర పెద్దపని పెట్టుకుని చూద్దాంలే అనుకొనేవాడికి నిద్రవస్తుంది తప్ప పనిజరగదు'- ఈమధ్యే ఎక్కడో చదివిన ఈ మాట రాణికి గుర్తొచ్చింది. పైకి అంటే బాగుండదని ఊరుకుంది.

శేఖరం అన్నాడు-

"రాణీ... నన్ను సరిగా అర్థంచేసుకోమని కోరుతున్నాను. మీకో విషయం చెప్పాలని చెబుతున్నాను. చాలాకాలంగా నా మీద ఆశపెట్టుకున్న సరోజ అనే అమ్మాయి వుంది రాజమండ్రిలోనే. మీలాగే ఆమె కూడా మంచి క్వాలిటీస్ ఉన్న మనిషి. నాకూ ఆమె అంటే లైకింగ్ వుంది. ఆమెతో మన విషయం చెప్పడం నాధర్మం. చెప్పకుండానే మీకు మాటఇవ్వడం ఆమెకు ద్రోహం చెయ్యడమే అవుతుంది. కనుకనే టైమ్ అడుగుతున్నది"

ఈ మాటతో పెనుతుఫాను చెలరేగుతుందనీ, అగ్నిపర్వతం బద్దలవుతుందనీ అనుకున్న శేఖర్‌కి ఎదురుగా నుంచుని పకపకా నవ్వుతున్న రాణి మతిపోగొట్టింది.

నిజమే- శేఖర్ చెప్పింది విన్న ఏ కన్నెపిల్లకైనా ఈ స్థితిలో మతిచలిస్తుంది మరి

నవ్వు ఆపుకుని, రాణి అంది-

"మిస్టర్ శేఖర్- ఐ యామ్ రియల్లీ ప్రౌడ్ ఆఫ్ యు. నిజాన్ని ఇంత నిర్భయంగా చె

ప్పిన మీకు నా ధన్యవాదాలు. నా దగ్గర మీరు ఏమీ దాచరని నేను ఎప్పుడో గ్రహించాను. ఈ క్రైములో ఈ విషయం మీరు కనుక చెప్పారు గాని సర్వసాధారణంగా మరెవ్వరూ చెప్పరు. నాలాంటిదే కదా సరోజ కూడా. ఆమె బాగా చదువుకున్నది; పెళ్లి కావలసింది. ఆమెను చేసుకోవడానికి మీకు ఇష్టమే అని మీరు చెప్పిందాన్నిబట్టే తెలుస్తోంది. అంతేకాదు- మీరు ఆమెకు మాట ఇచ్చారని కూడా నేను విన్నాను. ఆమెకు మీరు మాట ఇచ్చింది నా లెటర్ మీకు అందకముందుకదా! అందులో మీ తప్పేముంది? అయితే అదృష్టాన్ని ఎవరు తప్పించగలరు? సరోజకంటే నన్ను అదృష్ట వంతురాలిని చేశాడు భగవంతుడు. ఎలా అంటారా... సరోజ పేరంట్స్ మిమ్మల్ని అంగీకరించటంలేదుట. కారణం- యు ఆర్ఏ పూర్ క్లర్క్; మీరు ఫైనాన్షియల్లీ పూర్! మీ చెల్లెలు హాండీకాప్డ్ లేడీ; సోషల్లీ యు హేవ్ నో స్టేటస్..."

ఇవన్నీ ఈమెకు ఎలా తెలుసు? - అని ఆశ్చర్యపోతున్నాడు శేఖరం.

"ఇంకో విషయం మీకు చెప్పకతప్పదు కనుక చెబుతున్నాను. మీరు శ్వేతని పెళ్లి చేసుకోబోతున్నారని సరోజని నమ్మించారట వాళ్ల పేరెంట్సు. ఇంతకంటే ద్రోహం వుంటుందా అని ఆమెకు నూరిపోశారు. మీలోని వర్ఛ్యూస్ వాళ్లకేం తెలును- మూర్ఖులు" అంది రాణి.

తల తిరిగినంతపనైంది శేఖర్‌కి.

మళ్లీ అంది రాణి-

"మిస్టర్ శేఖర్- చివరిగా ఓమాట- ఫేట్‌ని ఎవరూ తప్పించలేరు. మీలో మెరిట్స్ నాకు ఎంత బాగా తెలుసో, డీమెరిట్సూ తెలుసు. ఏ లోపమూ లేనిమనిషి ఎక్కడుంటాడు? సరోజా వాళ్ల పేరెంట్స్‌కి మీలోని డీమెరిట్స్ కనిపించాయ్. కనుకనే మిమ్మల్ని కాదనుకున్నారు. బలవంతంగా సరోజని మరో సంబంధానికి ఒప్పించారు. ఇవన్నీ మీ మదరే నాకు చెప్పారు. మీలోని మెరిట్స్ మాకు కనిపించాయ్. కనుక నేను మిమ్మల్ని కోరుకున్నాను. మావాళ్ళు సంతోషంగా ఒప్పుకున్నారు. సరోజ పేరెంట్స్ ఉత్త పెసిమిస్టులు. అందుకు మీరు బాధ్యులు కారుగదా"

మేధావుల ఆలోచనాసరళి విభిన్నంగా వుంటుంది. రాజెక్కిన పల్లకీకాదు అది మోసిన బోయీలెవరన్నదే కొందరికి కావలసింది. అలాగే రాణీ మనిషిలో చూసేది 'అతనికి ఏముంది?' అన్నదికాదు 'అతను ఎవరు? ఏమిటి?' అని.

స్వరూప నిస్సందేహంగా ఓ మేధావి అనుకున్నాడు శేఖరం.

జటిల సమస్యల మబ్బు విడిపోయినట్టు విడిపోయింది.

సరోజ విషయం చాలా ఆశ్చర్యం కలిగించింది శేఖరానికి. మల్లెపువ్వులాంటి మనిషి సరోజ. ఆమెకు తల్లిదండ్రులు న్యాయం చెయ్యలేదన్నమాట. అయినా వాళ్లమాటలు ఆమె అంత సులువుగా నమ్మే మనిషికాదు. ఆమెను నమ్మించి మరో సంబంధానికి ఒప్పించారంటే ఇక తను చేయగలిగిందేముంది?

"ఎనీవే- నేనడిగిన త్రీమంత్స్ టైమ్ నాకు కావాలి" అన్నాడు శేఖర్.

"ఆల్‌రైట్- అలాగే కానివ్వండి" అంది రాణి.

"ఇన్ ది మీన్ టైం ఐ షల్ గెట్ రెడీ"

"గుడ్... బట్ నో ఎక్స్‌టెన్షన్ షల్ బి గ్రాంటెడ్" అందామె నవ్వుతూ.

"నాట్ నెససరీ..." అన్నాడతను.

రాత్రి బాగా పొద్దుపోయింది. ఇంట్లోకి నడిచారు ఇద్దరూ. అప్పుడే అన్నాడు శేఖరం-

"రాణీ- ఐ లవ్ యు అన్నమాట మీరు షిర్డీలోనే చెప్పివుంటే ఎంత బాగుండేది. ఎన్ని అనవసరపు గొడవలు తప్పిపోయివుండేవి. ఇప్పటికే మనం హనీమూన్ ముగించుకుని వచ్చేవాళ్లంగదా"

"యూ... నాటీ" అంది రాణి నవ్వుతూ.

ఆ రాత్రి ఫాదర్‌కీ, బ్రదర్‌కీ శేఖర్ అంగీకరించినట్టు చెప్పింది.

మర్నాడు శేఖరం ప్రయాణమయ్యాడు. గంగారాంగారికి పాదాభివందనం చేశాడు- 'ఐ




లాస్ట్ మై ఫాదర్ లాంగ్ బాక్ అని కళ్లు అద్దుకున్నాడు.

ఆ మాటకు చలించిపోయాడాయన.

సామాను కారులో పెడుతూంటే శాంతిభూషణ్ అన్నాడు - "మిస్టర్ శేఖర్... నేను బాంబే వెడుతున్నాను. మీరు నాతో రండి. అక్కడి నుంచి మీరు హైదరాబాద్ వెళ్ళవచ్చు - ఎన్‌రూట్ టు రాజమండ్రి"

"ఐ విల్ ఆల్సో ఫాలో యు అప్ టు బాంబే" అంది రాణి.

ముగ్గురూ కారు ఎక్కారు.

కారు ఏర్‌పోర్ట్ చేరుకుంది.

ఫ్లైట్‌లో వాళ్లు బొంబాయి చేరారు.

"షల్లై టేక్ ఎనీ నూటింగ్స్ ఫర్ యూ?" అన్నాడు శాంతిభూషణ్.

"నోనో - నాట్ నౌ" అన్నాడు శేఖరం నవ్వుతూ.

అక్కడే ఏర్‌టిక్కెట్ తీసి శేఖర్‌కి ఇచ్చాడు భూషణ్. మరో ప్లేన్ ఎక్కాడు శేఖర్. అందుకు ముందే ఓ కవర్ అందించాడతను రాణీకి. శాంతిభూషణ్ అతనికి ఓ ప్యాకెట్ అందించాడు. స్వీట్స్ ప్యాకెట్‌లా ఉందది.

ప్లేన్ రన్‌వే మీంచి లేచింది.

వాళ్లు వెనుదిరిగారు.

ఏర్‌పోర్టు దాటి బయటికిరాగానే కవరు విప్పి చూసింది రాణీ. అందులో ఉన్న చిన్న చీటీ తీసి చదివింది—

"2/3 గది అద్దె రు. 30/- తిరిగి ఇచ్చేస్తున్నాను" — శేఖర్.

లోపల మూడు పది రూపాయల కాగితాలున్నాయ్.

నవ్వుకుంది రాణీ.

ప్లేన్‌లో తీరిగ్గా కూర్చుని ప్యాకెట్ విప్పాడు శేఖర్.

పది వేల రూపాయలు. ఒక చీటీ.

చీటీమీద రాసి వుంది —

"మీకూ, మీ కుటుంబానికీ వివాహ సమయంలో రానుపోను విమానచార్జీలకు" — గంగారాం.

నవ్వుకున్నాడు శేఖర్.

తన జీవితం ఎంతటి అనూహ్యమైన మార్పు సంతరించుకుంటోందో అర్థమవుతూందతనికి.



శేఖరం భోజనం చేస్తూంటే మాణిక్యాంబ అంది — "ఒరే శేఖరం...ఎవర్రా ఆ అమ్మాయి 'నా పేరు స్వరూపరాణి' అంటూ కారులో వచ్చింది? పైగా నీకోసం వచ్చిందిట..."

"నేను గౌరిని తీసుకుని ఢిల్లీ వెళ్ళానని చెప్పావా?"

"అలా ఎందుకు చెబుతాన్రా? ఎవరికీ చెప్ప వద్దనుకున్నాం గదా"

"మరి ఏం చెప్పావ్?"

"ఏదో పనిమీద ఊరెళ్ళాడు - తిరిగి రావడానికి వారం పదిరోజులు పడుతుంది అన్నాను. అప్పుడే టెలిగ్రామూ వచ్చింది. నువ్వు ఆమెగారు రమ్మంటే అహమ్మదాబాద్ వెళ్లావటగదా"

"రాణీ నాకు షిర్డీలో పరిచయమైందమ్మా - మూడు రోజులపాటు ఆమె, వాళ్ల ఫాదరూ, నేనూ ఒకే గదిలో ఉన్నాం. రాణీది చాలా గొప్ప వ్యక్తిత్వం. నిప్పులాంటి మనిషి..."

"ఔను - నాకూ అలాగే అనిపించింది ఆమె ఉన్న ఒక్కరోజులోనే. పిల్ల ఆణిముత్యం - ఎంత మర్యాద - ఎంత ఆప్యాయత! నేను పుట్టాక అంత అందగత్తెని చూడలేదంటే నమ్ము - బాగా ఉన్నవాళ్ళు కూడా అనుకుంటాను"

"అవునమ్మా - షిర్డీలో కలిసిన పరిచయం పెద్ద అనుబంధమైకూర్చుంది. అంతా వాళ్ల నాన్నగారి చలవ. నన్ను చాలా మెచ్చుకుంటా

డాయన ఎందుకోమరి - నన్ను అహమ్మదాబాద్ రమ్మని రాయమన్నాడట రాణీని - ఆమె రాసింది''

"ఆయనే రాయొచ్చుగా..."

"ఎవరైతే ఏంలే - వెళ్ళకతప్పలేదు, వెళ్ళేను''

"ఏమంటాడాయన?"

"ఆయన అంటావేమిటి? ఆయనే అయితే ఏ గొడవా లేదు. ఆమెగారు కూడా నన్ను వదిలిపెట్టలేదు''

"చాలా మర్యాద చేసారన్నమాట - అదినరే గాని - నువ్వు వెళ్లాక - ఇదిగోచూడూ - ఈ నెక్‌లెస్ తీసుకున్నానురా - చాలా బాగుంది కదూ - నీతో చెప్పకుండా తీసుకోవడం తప్పే అనుకో..." అంటూ నెక్‌లెస్ అందించిందతనికి.

"చాలా బాగుందమ్మా - చాలా బరువుందే - ఎన్ని కాసులుట?"

"ఎనిమిది కాసులు"

"రాళ్ళు కూడా మంచి విలువైనవి - చాలా ఖరీదు చేస్తుంది - అయినా మనకెందుకమ్మా ఇలాంటివి - ఈ టైములో - మనం కొనగలమా - చెప్పు"

"కొనలేం అని నాకూ తెలుసురా - ఇదే మన గొరి మెళ్ళో వేస్తే నా తల్లి మెరిసిపోతుంది..."

"మెరిసిపోవడం మాట నిజమే - కాని, కొనడం మాట ఎలాగా అన్నది చెప్పవేం?"

"కూతురికి కాకపోతే కోడలికి పెట్టుకోవచ్చు..."

"అబ్బబ్బ - ఎవరికి పెడతావన్నది అలా ఉంచమ్మా - డబ్బు మాటేమిటని? పదహారు వేలపైన అవుతుంది..."

"ఆ బాధ నీకేమీ అక్కర్లేదు - నేను చూసుకుంటానా సంగతి"

"అంటే...?"

"డబ్బు ఇప్పుడే ఇవ్వనక్కర్లేదు - నీకు పెద్ద ఉద్యోగం ఎలాగూ అవుతుంది. అప్పుడు ఇచ్చేయవచ్చు..."

"అదేమిటి... ఇలా మాట్లాడుతున్నావేళ?"

"ఔనురా - నేనన్నది అక్షరాలా నిజం - డబ్బు ఇప్పుడేకాదు - అసలు ఇవ్వనే అక్కర్లేదు - నెక్‌లెస్ బహూకరించింది రాణీ కనుక - ఇవ్వాలనుకున్నా యిచ్చెయ్యగలం - నీకు పెద్ద ఉద్యోగం వచ్చింది కనుక"

"ఏమిటమ్మా నువ్వంటున్నది? రాణీ బహూకరించిందా ఈ నెక్‌లెస్? నాకు పెద్ద ఉద్యోగం వచ్చిందా? ఇదంతా నిజమా? అంత అదృష్ట వంతుణ్ణా నేను?"

"ఔన్రా - నువ్వు అదృష్టవంతుడివే - నీతోబాటు మేమూనూ - ఇదిగో ఈ ఉత్తరం చూడు..." అంటూ ఓ ఉత్తరం అందించిందావిడ.

అది రాసింది వీర్రాజుగారు—

ఆయన క్రితం వారం హైదరాబాద్ వెళ్ళినట్టు, అక్కడే ఓ సెంట్రల్ గవర్నమెంట్ అండర్‌టేకింగ్‌లో డిప్యూటీ చీఫ్ అకౌంట్స్ ఆఫీసరుగా శేఖర్‌ని తీసుకోవడానికి కంపెనీవాళ్లు అంగీకరించినట్లు, ఇంటర్వ్యూకి 15 రోజుల్లో హైదరాబాద్ వెళ్లవలసివున్నట్లు, జీతం రు. 3500/- అని వాళ్లు చెప్పినట్లు ఆ లెటర్‌లో ఉంది.

పట్టలేనంత సంతోషంతో కాస్సేపు ఉక్కిరిబిక్కిరి అయ్యాడు శేఖరం. కాస్త కుదుటపడ్డాక అన్నాడు—

"చాలా అదృష్టమమ్మా - అదినరేగాని - రాణీ నెక్‌లెస్ ఇవ్వడమేమిటి?"

అందుకు మాణిక్యాంబ అంది—

"అంతా మీ అబ్బాయికే తెలుసు - ఈ నెక్‌లెస్ ప్రెజెంటేషన్ గొరికి ఇస్తున్నాను. ఆమెకు అందజేయండి. అవసరం అనిపిస్తే ఇది చెరిపించేసి మరో మోడల్ చేయించి నాకే తిరిగి పెట్టెయ్యవచ్చు అందిరా రాణీ"

అర్థమయింది శేఖరానికి. తమది లేని కుటుంబం అని గ్రహించింది రాణీ. తామే చేయించినట్టుగా ఆమె వస్తువు ఆమెకే పెళ్ళి టైములో ఇవ్వమంటూంది నలుగురూ తమని చిన్నచూపు చూస్తారేమో అని. ఎంత మంచి మనసు! దానికి ఎంతని విలువ కట్టగలం? విలువ కట్టడం మాట వస్తే అణువణువునా నిండిన సుగుణాలేగాక నఖశిఖపర్యంతం ఆ అందాల్ని కలిపి తూకం వెయ్యాలి. తూకానికి




తగ్గ ధర అంచనా వెయ్యాలి. అది ఎవరికి సాధ్యం? తలయెత్తి ఠీవిగా నర్తించే నెమలి సోయగం ఆమెలో ఉంది. ఆమె స్వరం ఎల కోయిల పాటలా ఉంటుంది. కవులు వర్ణించే నాయికాలక్షణాలన్నీ పుణికి పుచ్చుకుందామె. సరసమెరిగిన రసరాణి స్వరూపరాణి. లౌక్యమెరిగిన మాట, చాకచక్యమెరిగిన చూపు ఆమె సొమ్ము. వీటితో పోతుటీగల్లాంటి సొగసుగాళ్ళని గులాములుగా చేసుకోగలదు. నాజూకైన ఆ వెండి మువ్వల రవళి అవలీలగా అవతలవాడి నాడిని తనవైపు తిప్పుకోగలదు. అలలుఅలలుగా లేచే ఆ చేతులు, గాలిపాటుకు మెడను దాటి భుజాలమీదికి ఎగిరిపడే ఆమె కురులూ చూసి బొమ్మలైపోయే మగరాయుళ్ళు కోకొల్లలు.

తల్లి మాట విని ఉలిక్కిపడ్డాడు శేఖరం.

''అహమ్మదాబాదులో రాణీవాళ్ళూ ఏమంటున్నార్రా?'' అంది ఆమె.

జరిగినదంతా వివరంగా చెప్పాడు శేఖరం. రాజమండ్రి నుంచి తిరిగొచ్చిన రోజున అహమ్మదాబాద్ ఏర్‌పోర్ట్‌లో ఆమె ఎలా కొరకొరచూసిందో, ఎంతసేపు అసలు మాట్లాడ్డమే మానేసిందో చెప్పాడు.

''అమ్మో - పిల్ల గట్టిదే అన్నమాట''

''కనుక - నువ్వు చాలా జాగ్రత్తగా వుండాలి'' నవ్వుతూ అన్నాడు.

''నీ మొహం - అసలు ఆ అవసరమే రాదు - దాని మనసు వెన్నపూస'' అందావిడ.

మూడు నెలల్లో పెళ్ళికి సిద్ధంగా ఉండాలని కూడా చెప్పాడు శేఖరం.

''ఆ అప్సరస నాకు కోడలన్నమాట!'' —

ఈ మాట పైకి అంటే కొడుక్కి కొమ్ములొస్తాయని కాబోలు లోపలే అనుకుంది మాణిక్యాంబ.

సరోజావాళ్ళ అమ్మా నాన్నా శేఖరం లేని టైములో ఎలాంటి అవాకులు చెవాకులు పేలారో, ఎంతెంత అభాండాలు వేసారో చెప్పిందా తల్లి. మధ్యలో అతను అన్నాడు - ''అవీ చెప్పనవసరం లేదు - అంతా రాణీతో చెప్పారుటగదా - రాణీ నాతో చెప్పింది. ఇక వాళ్ళ ప్రసక్తి తీసుకురావద్దు''

నిజానికి శేఖరానికి ఇంకా మనసులోని సందేహం అలాగే ఉంది - ''సరోజ పేరెంట్స్ చెప్పినది ఎలా నమ్మింది?'' అని.

ఆదిలో ఆడవాళ్ళ మనసు అంత సులువుగా అతుక్కోదు. అతుక్కున్నా చాలా సులువుగా విరిగిపోతుంది అనుకోవాలా?

అహమ్మదాబాద్ విషయం అంతా లెటర్ రాశాడు గౌరికి.

మర్నాడు పొద్దున్నే ఆదరాబాదరా తాడేపల్లిగూడెం వెళ్ళిపోయాడు శేఖరం.

ఎం.ఎల్.ఏగారింటికి వెళ్ళి ఢిల్లీ విశేషాలు చెప్పి ఆయనకి తన కృతజ్ఞతలూ చెప్పుకుని మరో నాలుగు రోజుల్లోనే హైదరాబాద్ ఇంటర్వ్యూకి వెడతానని చెప్పాడు. ఇంక ఉండబట్ట లేక - ''సార్, మీరు మా కుటుంబానికీ, నాకూ చాలాచాలా మేలు చేస్తున్నారు. మీ ఋణం తీర్చుకోలేనిది'' అన్నాడు.

''ఋణం అన్నమాట అనకు శేఖరం - నీకూనాకూ మధ్య ఋణమేమిటి? అదే నిజమైతే నేను నీకు ఎంత ఋణపడివున్నాను?'' అన్నారు వీర్రాజుగారు.

తర్వాత మళ్ళీ ఆయనే అన్నారు —

ఆ కంపెనీవాళ్ళతో చాలా గొడవ పెట్టుకున్నానయ్యా నీ ఉద్యోగం విషయంలో - ఆ ఎమ్.డి నా క్లాస్‌మేటుకి తమ్ముడు. దయాధర్మభిక్షగా మీరు ఆ పోస్ట్ మావాడికేం ఇవ్వక్కర్లేదన్నాను. 'వాడి టేలెంటు, క్వాలిఫికేషనూ చూసి తృప్తిపడితేనే ఇవ్వండి' అన్నాను. ఏమిటి ఇంత ధీమాగా మాట్లాడుతున్నాడీయన అని వాళ్ళనుకున్నమాట నిజం. 'సరే - ఇంటర్వ్యూకి పంపండి' అన్నారు. మరి - ఎలా నెగ్గుకొస్తావో''

''పైన భగవంతుడున్నాడు సార్'' అన్నాడు శేఖరం.

ఆ సాయంత్రం మళ్ళీ ఎం.ఎల్.ఏగారింటికి వెళ్ళి ప్రత్యేకంగా అహమ్మదాబాద్ విషయం ఆయనకి చెప్పాడు. ''పొద్దున్న ఈ విషయం చెప్పడానికి ఏమిటో జంకాను - ఎక్స్‌క్యూజ్ మి'' అన్నాడు.

ప్రసన్నంవదపట్టారు వీర్రాజుగారు.

''కలిసొచ్చే రోజుల్లో నడిచొచ్చే కొడుకు పుట

తాడని శాస్త్రం'' అంటూ' నవ్వారాయన.

ఆ మరునటి రోజు ఉదయం శ్వేత మేడమీదికి వచ్చినప్పుడు శేఖరం అన్నాడు—

"శ్వేతా - నేనెప్పుడేనా ఆ దృష్టితో నిన్ను చూసానా? నీతో చనువుగా మాట్లాడ్డం, చదువు చెప్పడం కూడా నువ్వు అపార్థం చేసుకున్నావ్ - తొందరపడ్డావ్''

★ ★ ★

హైదరాబాద్‌లో డిప్యూటీ చీఫ్ అకౌంట్స్ ఆఫీసరుగా జాయిన్ అయ్యాడు శేఖరం.

ఓ వారం రోజులు గడిచాయి.

లీగల్ అడ్వయిజర్-ఇన్‌ఛార్జ్ కూడా శేఖరమే ఇప్పుడు.

చేరిన మర్నాడే టెలిగ్రాంలు ఇచ్చాడు- ఎం.ఎల్.ఎగారికి, ఢిల్లీకి, అమ్మకి, అహమ్మదాబాదు రాణీవారికి, ప్రకాశరావుగారికి. సరోజ జ్ఞాపకం వచ్చింది. నిజానికి సరోజ యోగ్యురాలు. దాపరికంలేని మనిషి. కాని దురదృష్టవంతురాలనే అనుకోవాలి. చెప్పుడు మాటలు వింటే బుద్ధులు వంకర తోవలు పడతాయంటారు ఇదేనేమో? ఏదియేమైనా ఆమె వల్ల తనకున్న అభిమానం అంతనులువుగా తరిగిపోయేదికాదు- ఆమెకే టెలిగ్రాం పంపాడు.

టెలిగ్రాం చూసి ప్రకాశరావుగారింట్లో శారదమ్మగారు సంతోషించింది. "కష్టపడ్డాడు పైకొచ్చాడు" అంది.

"నాకు ఎప్పుడో తెలుసు ఇతగాడు ఇటువంటివాడవుతాడని. వీర్రాజుగారిని ఎం.ఎల్.ఎ చేయగలిగినవాడికి ఇదో లెక్కా?'' అన్నారు ప్రకాశరావుగారు.

ఒళ్ళు తెలియని ఆనందంతో అసలు పుస్తకమే తియ్యలేదు ఆరోజంతా డిలీలో గౌరి.

ఈ ఉద్యోగం కంటే కోడలుమీదే మోజు ఎక్కువగా ఉన్నట్టుంది అమ్మకి. ఆ మూడుముళ్లూ చప్పున వేయించెయ్యమని, ఈజీచైరూ, మడతమంచం తనకి చప్పున ప్రసాదించమనీ తిరుపతి వెంకటేశ్వరుడికి, అన్నవరం సత్యనారాయణస్వామివారికి, సాయీనాథునికి, మధురమీనాక్షికి, కంచికామాక్షికి, కాశీవిశాలాక్షికి ఇంకా చాలామందికి దణ్ణాలు పెడుతోంది.

సరోజ ఏమనుకుందో బైటపడనేలేదు.

పెద్ద ఉద్యోగం అయితే సరా? ఆడపిల్లల్ని అర్థం చేసుకోడమే తెలియదాయె అనుకున్నారు శ్వేత, సరోజ.

ఎల్.ఎల్.బి చదివాడట. ఎందుకూ? సెక్స్ అనే అక్షరాలే తెలియవేమో- ఎంత సంబరపడ్డాం. మేడమీద దిగాడంటే- ఏంలాభం? అసలు సంగతి అలావుంచి, అసలు చూపులే చేతకావు అనుకున్నారు స్మిత లాంటివాళ్లు.

మరునటినెల జీతం అందుకుని, తల్లిని హైదరాబాద్ తీసుకువెళ్లిపోయాడు శేఖరం.

ఇప్పుడు అతను ఆఫీసరు- కావలసినంత మంది సబార్డినేట్స్, అటెండర్లు- ప్రత్యేకంగా ఓ పి.ఎ.

కాలం గడుస్తున్నకొద్దీ కంపెనీలో మంచిపేరు తెచ్చుకుంటున్నాడు.

సరిగా మూడునెలలు ముగిసేలోపలే ఉత్తరం రాశాడు గంగారాంగారికి.

"సిద్ధంగా ఉన్నాం- ముహూర్తం పెట్టించి తెలియబరిస్తే పెళ్లికి తరలివస్తాం'' అని.

'వాళ్లకే లేక చస్తుంటే వాళ్లింటికి మనం వెళ్లడం ఏమిటి?' అని ఇన్నాళ్లూ రాజమండ్రి రావడం మానేసిన బంధువులూ,

"వీళ్లని పట్టుకుంటే మనకొరిగేదేముంది- బూడిద'' అని తప్పించుకు తిరిగిన ఆత్మీయులూ-

'పిల్లకి పెళ్లికూడా చెయ్యగలరా- ఈ మొహాలు' అనుకుంటూ పలకరించడమే మానుకున్న కావలసినవాళ్లూ-

ఇప్పుడు ఉత్తరాల మీద ఉత్తరాలు రాస్తున్నారు శేఖరానికి. పనిగట్టుకువచ్చి పలకరించిపోతున్నారు.

'మా తమ్ముడు మొన్ననే బి.కాం పాసయ్యాడు శేఖరం- కాస్త జ్ఞాపకంపెట్టుకో. వాడికి ఏదో ఉద్యోగం వేయించు' అని ఒకరూ,

'మావాడు సి.ఎ చేశాడు. మీ చెల్లెలు ఎం.ఎ గదా- ఈడూ, జోడూ బాగుంటుంది' అని ఒకరూ

ఇలా కుశలప్రశ్నలు, అభ్యర్థనలు, కోరికలు

- ఎన్నెన్నో!

ఓరోజున రిజిస్టర్డ్ కవరు వచ్చింది గంగారాంగారినుంచి. విప్పిచూస్తే అందులో పెద్ద ఉత్తరం, దానికి పిన్ చేసిన లక్షరూపాయల డ్రాఫ్టు! ఉత్తరంలో ఇలావుంది-

"ఇది నీకు కట్నంగా ఇస్తున్నదికాదు. అల్లుడికి ఖరీదు కట్టే అనాగరికత మాలోలేదు. ఈ డబ్బు మీ డిగ్నిటీకోసం. మీఖర్చులకోసం.

ఇది మీయందు మాకుగల గౌరవం, అభిమానంతో, మా స్వరూప సంతోషంకోసం పంపుతున్నది"

"సంతోషంగా ఇస్తున్నది నిరాకరించకూడదు. అది అమర్యాద. అశుభం కూడా" అంది తల్లి.

అతనేమీ అనలేదు.

మళ్లీ ఆమే అంది-

"కాకపోతే ఓ పనిచేద్దాం- మన ఇంటిమీద ఓ నలభైవేలు అప్పుతెద్దాం. మంచి డిజైన్లో ఎనిమిది కాసులుపెట్టి నెక్లెస్ చేయిద్దాం పెళ్లికూతురికి. రాణీ ఇచ్చిన వస్తువు రాణీకే ఇచ్చేద్దాం. కావాలనుకుంటే దాన్ని గౌరికి రాణీయే ఇస్తుంది. అది వేరే విషయం. అదనంగా మరో ఎనిమిది గాజులు ఒక్కొక్కటి కాసున్నర చొప్పున పన్నెండు కాసులతో చేయించి ఇద్దాం. ఎంతచేసినా వాళ్లతో ఎలాగూ తూగలేం. ఈ మాత్రమైనా చెయ్యకపోతే నాకు తలకొట్టేసినట్టు ఉంటుంది. మొత్తం ఇరవై కాసులు పెడుతున్నామంటే కాస్త ఫరవాలేదు. చూసేవాళ్లకీ బాగుంటుంది; వాళ్లూ సంతోషిస్తారు. నీ జీతంలో వెయ్యి రూపాయల చొప్పున తీర్చేసినా అప్పు చప్పునే తీరిపోతుంది"

"మరి రాణీకి పట్టు చీరెలు?"

"ఎం.ఎల్.ఎగారిచ్చినదాంట్లో ఇంకా పదివేలదాకా బ్యాంకులో ఉందిగదా. పదిహేను వందల రూపాయలవి నాలుగు చీరలు నా కోడలికి పెట్టుకోవాలని ఉంది. భగవంతుడు సరిగా టైముకి మనకి సహాయపడ్డాడుగదా- తర్వాత నీ ఇష్టం..." అంది మాణిక్యాంబ.

గంగారాంగారు ముహూర్తం పెట్టి తెలియబర్చటం, వీళ్లంతా గుజరాత్‌కి తరలివెళ్లటం, అక్కడి వాళ్లు సలక్షణంగా శుభం జరిపించటం- అన్నీ అయ్యాయ్.

అహమ్మదాబాదు అప్సరసని కోడలుగా హైదరాబాదు తెచ్చుకుంది మాణిక్యాంబగారు.



మూడేళ్లు గడిచాయి.

రాణీ, శేఖర్‌ల పుత్రరత్నం వంశీకృష్ణకి రెండేళ్లునిండాయ్.

ఆవేళ వాడి బర్త్‌డే!

గౌరినుంచి ఉత్తరం వచ్చింది వదినగారికి.

"మనువాడిన మగువకీ, మనసిచ్చిన మగధీరుడికీ దేవుడిచ్చిన వంశాంకురం వంశీకృష్ణ చిరంజీవికి ఈ అత్తయ్య ఆశీస్సులు అందజేయండి"

స్వరూపా, శేఖర్ ముందురోజునే సిటీలో అందర్నీ ఆహ్వానించి వచ్చారు.

ఆ రాత్రి అటు తిరిగి పడుకున్న కోడల్ని చూసి, ఆ అందం పక్కకి జారిన పాపిట గొలుసులా అనిపించింది మాణిక్యాంబగారికి.

బర్త్‌డే ఫంక్షన్‌కి అన్ని ఏర్పాట్లూ చేస్తున్నారు.

"కోడలి అందం ఓ అందమా నా బంగారు కొండముందు?" అని తెగముద్దులు కురిపిస్తోంది మనవడిమీద వాళ్లమామ్మ.

పార్టీ బ్రహ్మాండంగా జరిగింది. కేక్‌కట్ చేశారు. ఫొటోలు తీశారు. వీడియో కాసెట్లు వేశారు. సాయంత్రం అందరూ వెళ్లాక తీరిగ్గా కూర్చొని ఆయాసపడుతూ అనుకుంది మాణిక్యాంబగారు: "ఇంతింత ఖరీదైన బహుమతులెలా ఇస్తారో వీళ్ళు - వందకి తక్కువ చేసేదేదీలేదు ఇందులో - మాకాలంలో మేమూ ఇలాంటి





పార్టీలకి వెళ్లాం. ఏ స్టీలు ప్లేటో గ్లాసో యిచ్చేవా ళ్లం'' అనుకుందావిడ.

వారంరోజులు గడిచాయ్.

టెలిగ్రాం వచ్చింది ఢిల్లీనించి విజయగౌరి వస్తున్నట్లుగా.

'అబ్బ - ఎన్నాళ్లకి తిరిగొస్తోందీ' అనుకున్నా డు శేఖరం.

మర్నాడు ఏర్‌పోర్టుకు వెళ్లారందరూ.

ఐ.ఎ.ఎస్ ర్యాంక్‌లో పాసై, హుందాగా విమానం దిగుతూన్న చెల్లెల్ని చూసి గర్వపడ్డా డు శేఖర్. ఆ గర్వాతిశయంలో ఒళ్ళు గగుర్పొ డిచింది. కళ్ళు చెమర్చినై.

''అమ్మా...అదిగో గౌరి వస్తూంది - చూడు. ఐ.ఎ.ఎస్ అంటే ఏమిటో నీకెలా అర్థమవు తుందమ్మా - ఇండియాలో ఎక్కడైనా ఉద్యోగం చెయ్యడానికి ఆమె అర్హురాలు. అందరికీ అంత అదృష్టంవడుతుందా? రేపు అది జిల్లా కలక్టరు అవుతుంది. నువ్వేచూస్తావ్'' అన్నాడు తల్లితో.

దగ్గరకిరాగానే ఒళ్ళు తెలియని ఆనందంతో తల్లిని కౌగిలించుకుంది గౌరి. అవధులుదాటిన మమకారంతో ఒళ్లంతా తడి మింది కూతుర్ని ఆ తల్లి. నుదిటిమీద ముద్దు పెట్టుకుంది. పైట కొంగుతో కళ్ళు తుడుచు కుంది.

అన్నయ్య వీపు ఆప్యాయంగా నిమిరింది గౌరి. అతని సహకారం లేకపోతే తను ఇంతటి దయ్యేదా?

**''హల్లో... వదినా - చాలా కాలమయింది నిన్నుచూసి - అప్పుడు పెళ్ళిలో చూడ్డమే''. అని రెండుచేతులూ ఆప్యాయంగా పట్టు కుంది.**

వంశీని ఎత్తిముద్దాడింది.

ఆమె రెండు చేతులతోనూ బాబును ఎత్తుకో వంచూసి శేఖర్ ఆశ్చర్యపోయాడు. ఎడమచె య్యికేసి చూశాడు. నార్మల్‌గా కనిపించింది. గౌరి చెప్పింది- ఢిల్లీలో ఎలక్ట్రిక్ ట్రీట్‌మెంట్ తీసుకున్నట్టు, అంతా సౌజన్యగారి పుణ్యమే అని అతనికి తెలును. చెప్పనలవికాని సంతోషం కలిగింది.

కారులో అంది గౌరి:

''అన్నయ్యా - వదిన కాస్త ఒళ్ళుచేసింది''

''చెయ్యదు మరీ ప్రోగ్రెస్ చూపించాలి గదా!'' అన్నాడు శేఖర్.

నవ్వి ఊరుకుంది స్వరూప.

ఒళ్ళో కూర్చోబెట్టుకున్న గౌరి జడలాగుతు న్నాడు వంశీ. చెయ్యి తప్పిస్తే మళ్ళీ అదేపని.

''చాలా అల్లరి చేస్తున్నాడన్నయ్యా'' అంది.

అతను నవ్వాడు.

''అత్త బంతిపువ్వుకంటే మెత్తన అన్నారు. మెత్తని చోట హాయిగా కూర్చున్నవాడు అల్లరిచే యక ఏంచేస్తాడు? పైగా నీజడ మరీ పెద్దది. వాడికి ఆ అధికారమూ ఉంది'' అన్నాడు.

ఇల్లుచేరారు అందరూ.

ఇంట్లో కొట్టొచ్చేట్టు కనపడే నీట్‌నెస్, కాస్ట్లీ ఫర్నిచర్ చూసి చాలా ఆనందపడింది గౌరి.

అలసి అలసి ఉన్న ప్రాణం నెల్లాళ్ళు రెస్ట్ తీసుకున్నా కుదుటపడలేదు గౌరికి. 'హార్డ్ స్టడీస్‌వల్ల జనరేట్ అయ్యేవేడి నరనరాలకీ పాకుతుంది గౌరీ - అందుకు రెస్ట్ కాదు, ట్రీట్‌మెంట్ కూడా అవసరం' అంది స్వరూప. 'అదే అదే... నేనూ అనబోతున్నాను' అన్నాడు అక్కడేఉన్న శేఖరం.

కొన్నాళ్ళు గడిచాయ్.

గౌరికి ట్రైనింగ్ పూర్తి అయిపోయిన మీదట పోస్టింగ్ కోసం ఎదురుచూస్తున్నారు.

ఓ రోజున చాలా తీరిగ్గా కూర్చున్న రాణీని చూసి తనూవెళ్ళి ఆ పక్కనే కూర్చుంది గౌరి. కాస్సేపయాక అంది-

''వదినా - 'లార్డ్ కృష్ణా అండ్ హిజ్ అవతార్' నువ్వు రెండురోజులబట్టి చదవడం చూస్తున్నాను. నీకో విషయం చెప్పాలనిపించి చెబుతున్నాను. వెన్నదొంగగా కృష్ణుని లీలల్ని అద్భుతంగా చిత్రించినవాడు లీలాశుకుడు. 'వదనే నవనీత గంధవాహం..' అనే శ్లోకం అందుకు ఓ మచ్చుతునక. 'కస్తూరీ తిలకం... లలాట ఫలకే' అనేదీ ఆయనదే. ఇహ జయదే వుని గీతాల సంగతి చెప్పనే అక్కర్లేదు. అవి మధురాతి మధురం. ఉలి, శిల లోంచివచ్చే శిలా శిల్పంకంటే గొప్పది ఆయన సాహిత్య శిల్పం. ఆయన సాక్షాత్తూ శృంగార గంగా

భగీరథుడు. ఇద్దరూ కృష్ణభక్తులే. ఇద్దరూ మహాకవులే. అయితే వాళ్ల కవిత్వ మాధుర్యంలో తేడా ఉంది. అదినీకు ఇంగ్లీషులో చెబితేనే బాగా అర్థమవుతుంది. లీలా శుకుని కవిత్వం గ్రేప్‌జ్యూస్‌లా ఉంటే జయదేవునిది ఫ్రూట్ సలాడ్‌లా ఉంటుంది" అంది గౌరి.

నవ్వింది స్వరూప.

"నువ్వుచెప్పిన విషయం ఈ బుక్‌లోనూ ఉంది. కాపోతే వెర్షన్ కాస్త తేడా' అంది.

"ఢిల్లీలో ఉన్నప్పుడు సంస్కృతం కూడా నేర్చుకున్నాను - ఆ అదృష్టాన్ని నాకు కలిగించింది సతీష్‌బాబుగారే" అంది గౌరి.

తనే చాలా చదివింది అని అప్పటివరకూ స్వరూప ఉద్దేశం.

వాళ్లు ఓరోజున టీ.వి ముందు కూర్చుని ఉండగా ఏదో జ్ఞాపకంవచ్చి గౌరి అంది:

"ఏం వదినా నేను ఢిల్లీలో చదువుతున్నట్లు మా అన్నయ్య నీకు మొదట్లో చెప్పలేదు- ఔనా?"

"ఔను..."

"తర్వాత చెప్పాడు- ఎప్పుడు చెప్పాడో నేను చెప్పనా?"

'ఊ...'

"మీ శోభనం గదిలో..."

ఇద్దరూ నవ్వుకున్నారు.

గౌరికి ఇంకా పోస్టింగ్ రాలేదు.

"వై కాంట్ యు ట్రై ఇన్ ది సెక్రటేరియట్?" అంది రాణి శేఖర్‌తో.

"వాట్ ఫర్..."

"మంచి పోస్టింగ్‌కోసం- సిటీలోనే అయితే మరీమంచిది గదా..."

"మనం ట్రై చేస్తే ఇవ్వాలనుకున్నచోట కూడా ఇవ్వరు... లెటజ్ వైట్ అండ్ సీ..."

మరో వారం గడిచింది.

గౌరికి అప్పాయింట్‌మెంట్ ఆర్డర్స్ వచ్చాయి. కవరు అందుకున్నది శేఖరమే.

ఆర్డర్స్ చదివి ఎంతో సంతోషంతో అన్నాడు- "గౌరీ... నిన్ను డిప్యూటీ కమిషనర్ ఆఫ్ కమర్షియల్ టాక్సెస్‌గా వేశారు"

"హేపీ న్యూస్- ఐతే మీ దగ్గరే ఉంటానన్న మాట. ఎంత దూరంలో వేస్తారో ఏమిటో అని నిజంగా భయపడిపోయాను" అంది గౌరి.

"ఢిల్లీలో ఎన్నాళ్లున్నావో ఇక్కడా అన్నాళ్లుంటావ్. అపైన ఎక్కడికి ట్రాన్స్‌ఫర్ చేసినా ఫరవాలేదు" తృప్తిగా అన్నాడు శేఖరం.

"అలా అంటావేమిట్రా- అంత కాలం ఇక్కడ ఉండిపొమ్మంటున్నావా? బాగుంది వరస- అది ఆడపిల్ల- ఎలా ఉంటుంది? మరో ఆరు నెలలు తిరక్కుండానే అది అత్తవారింటికి వెళ్లిపోవాలి" అంది మాణిక్యాంబగారు.

"మనం ఉండమన్నా ఉండదు- ఉందామనుకున్నా ఉండడం కుదరదు- ఇప్పటికే చాలామంది కళ్లు పడివుంటాయ్- ఏ మహానుభావుడొస్తాడేమరి" అంది స్వరూప.

"నిజమే- రాణీ- గౌరి ఇప్పుడు అన్నిటిలోనూ పెద్దదే- చదువులోనూ హోదాలోనే కాదు- వయసులోకూడ. ఆ వచ్చేవాడు ముప్పైదాటినవాడు రావాలి. మహామేధావి అయి ఉండాలి. ఏ ఫారెన్ రిటర్న్ ఇంజనీరో, డాక్టరో అయి ఉండాలి- అలాంటివాళ్లు దొరకడమూ కష్టమే" అన్నాడు శేఖర్.

"పొడుగు మాట మరిచిపోయారు. గౌరి నాకంటే పొడుగు తెలుసా? అంటే అమితాబ్‌బచన్‌లాంటివాడు రావాలి" అంది స్వరూప.

నవ్వుకుంది గౌరి.

"అది సరే అన్నయ్యా- నేను జాయిన్ అయ్యేలోగా తాడేపల్లిగూడెం వెళ్లిరావాలి" అంది.

"ఎందుకు? శ్వేతని చూసి రావాలని ఉందా?" అంది స్వరూప.

"బాగా అడిగావ్!" అన్నాడు శేఖరం.

"అది కాదన్నయ్యా- ఎం.ఎల్.ఏగారికి కృతజ్ఞతలు చెప్పుకుని రావాలి"

'దట్స్‌గుడ్... అలాగే'

మర్నాడు ప్రయాణమయ్యారు ఇద్దరూ.

స్టేషన్‌కి వెడుతూన్నప్పుడు దారిలో చెప్పింది గౌరి- తన చెయ్యి బాగుపడ్డానికి సౌజన్యగారు ఎంత శ్రమపడ్డారో- ఎంత ఖర్చుచేశారో. ఆపరేషన్ ప్రక్రియలో అద్భుతమైన అడ్వాన్స్





మెంట్ చూస్తున్నాం. పుట్టుమచ్చల్ని తొలగించ గలుగుతున్నారు. పక్షవాతంలో పడిపోయిన శరీరభాగాల్ని సరిచేస్తున్నారు. ప్లాస్టిక్ సహాయంతో హెయిర్ ట్రాన్స్‌ప్లాంట్ ద్వారా బట్టతలమీదే నాచురల్ హెయిర్ మొలిపిస్తున్నారు. సిలికాన్ ఇంప్లాంట్ ద్వారా అసహ్యంగా ఉన్న గడ్డాన్ని, ముక్కుని అందంగా తీర్చిదిద్దుతున్నారు. నీ చెయి బాగుపడకపోవడం ఏమిటి? అని సౌజన్య చాలా పట్టుదలతో మూడు నెలలపాటు ట్రీట్‌మెంట్ చేయించినట్లు చెప్పింది.

నాంపల్లిలో టికెట్స్ తీసుకున్నారు.

ఆశ్చర్యం... వీర్రాజుగారు ప్లాట్‌ఫాం మీదే కనిపించారు.

"ఇప్పుడే ట్రైన్ దిగాను శేఖరం- మీ గౌరిని చూడ్డానికే వస్తున్నాను" అని గౌరికేసి చూసి.

"కంగ్రాచ్యులేషన్స్ గౌరీ- నువ్వు ఇప్పుడు ఐ.ఎ.ఎస్ ఆఫీసరువి- ఐ యామ్ ప్రౌడ్ ఆఫ్ యు" అన్నారాయన.

"గూడెం వద్దామనే మేం బయల్దేరాం సార్- తమర్ని కలవకుండా మా గౌరి డ్యూటీలో జాయిన్ అవగలదా- చెప్పండి" అన్నాడు శేఖరం.

అక్కడే- ఆ ప్లాట్‌ఫాం మీదే వంగి ఆయనకి పాదాభివందనం చేసింది గౌరి. ఆమెని సాదరంగా లేవనెత్తి- "విష్ యు బెస్ట్ ఆఫ్ లక్" అన్నారు వీర్రాజుగారు.

వీర్రాజుగారిని రెండురోజులు వాళ్ళింట్లో ఉండమని కోరారు.

ఆయన అలాగే ఉండి వెళ్లారు.

గౌరి డిప్యూటీ కమీషనర్‌గా ఛార్జ్ తీసుకుంది.

రెండు నెలలు గడిచాయి.

రోజూ పది పదిహేను నిముషాలకి కారు వచ్చి ఇంటి ముందు నిలబడుతుంది. డ్రైవర్ సెల్యూట్ చేస్తాడు. పి.సి నమస్కారం చేస్తాడు. అటెండరు బ్రీఫ్‌కేస్ తీసుకుంటాడు. గౌరి ఠంచన్‌గా పది ఇరవైకి బయలుదేరుతుంది. మధ్యాహ్నం లంచ్ టైములో ఇంటికి రాదు. సాయంత్రం ఐదుదాటేసరికే తిరిగి వచ్చేస్తుంది. ఆ టైముకి ఒకప్పుడు హుషారుగా కనిపిస్తుంది. ఒకప్పుడు డిజెక్టెడ్‌గా ఉంటుంది. మరొకప్పుడు చిరాగ్గా ఉంటుంది.

బాధ్యత అంటే అలాగే ఉంటుంది. అందులోనూ అది గవర్నమెంట్ సర్వీసు. పెద్ద ర్యాంకులోఉన్న ఆఫీసర్లకి అన్నీ బాధలే. అందులో సమాజం అస్తవ్యస్తంగా తయారై, ప్రజలు అపసవ్యంగా నడుస్తున్నరోజులివి. పన్నులు ఎగవేసే వ్యాపారస్థులు, వాళ్ళకి అండదండలుగా పెద్ద తలకాయలు ఇవేజన్ని అరికట్టడానికి బాధ్యులైన సర్కిల్ ఆఫీసర్లలో అలసత్వం. పెడసరి ధోరణులు. వాళ్ళమీద గౌరికి అజమాయిషీ. స్టాఫ్‌ని చెండనాడుకోకుండా. సబార్డినేట్ ఆఫీసర్లపైన నోరుపారేసుకోకుండా. ఎక్కడా మాట జారకుండా, మాటపడకుండా. మరోవైపు గవర్నమెంట్ రెవెన్యూ పెంచుకుంటూ పోవాలి. మొత్తం డివిజన్‌లో ఎక్కడ అపశృతి వచ్చినా అపఖ్యాతి తనకే. శిక్షించవలసింది తనే అయినా పైవాళ్ళకి సంజాయిషీ చెప్పుకోవలసింది తనే.

ఆవేళ గౌరి ఎంచేతనో మాటమంతీ లేకుండా గదిలో అలాకూర్చునే ఉండిపోయింది. ఆదివారం కనక సరిపోయింది.

ఏమని అడగడానికి శేఖరం జంకాడు. స్వరూప కూడా కారణం కనిపెట్టలేకపోయింది. నిజంచెప్పాలంటే ఛార్జ్‌తీసుకోకముందు గౌరి వేరు ఇప్పుడు వేరు. మనిషిలో చాలా మార్పు వచ్చింది. అఫిషియల్ పవర్ అంటే అలా ఉంటుంది మరి. అందులో ఇది ఐ.ఎ.యస్ పవరు.

ఎవరూ అడగకపోయినా, తను చెప్పకపోయినా గౌరి మనసులో రేకెత్తిన ఆ బాధ ఈరోజుది కాదు. తను డి.సిగా ఛార్జ్‌తీసుకున్న రోజున జరిగిన పార్టీ అనంతరం తను సీట్‌లో కూర్చున్నాక డివిజన్‌లోని సి.టి.ఒలు అందరూ ఒక్కొక్కరే వచ్చి నమస్కారంచేసి, తాము ఏ సర్కిల్‌కి చెందినవాళ్ళో చెప్పుకుని వెళ్లారు. వెళ్ళేటప్పుడు "దయ ఉంచండి" అనేది ప్రతి ఒక్కరూ అనేమాటే! అలా అన్నవాళ్ళలో శ్యామసుందర్ కూడా ఒకడు.

ఒకనాడు తనను కన్నెత్తిచూడ్డానికైనా ఇష్టపడనివాడు; ఉత్తరాలకి జవాబైనా రాయనివాడు; అన్యాయంగా అవమానించినవాడు ఈ శ్యామసుందర్!

ఆశ్చర్యం... ఇంత జరిగినా అతనిపై తనకు ఏవగింపుకలగ లేదు. తను ఊహించుకున్న ఏదో బంధం అంతర్గతంగా ఇంకా తనలో మెదుల్తూండడమే అందుకు కారణమా? ఇంకా ఏదో 'బంధం' అనుకుంటూ ఉండ డంలో అర్థమేముంది?

ఆ రాత్రి చెప్పింది అన్నగారితో శ్యామ సుందర్ విషయం. అతను తనకిందే ఇప్పుడు పనిచేస్తున్నాడని.

శేఖర్ విని ఊరుకున్నాడేగాని ఏమీ అనలే దు.

మరో రెండు నెలలు గడిచాయ్.

నెలవారీ కాన్ఫరెన్సులకి సి.టి.ఒ.లందరితో బాటు శ్యామసుందర్ వచ్చి వెడుతున్నాడు. రెవెన్యూ రివ్యూ మీటింగులకి హాజరు అవుతు న్నాడు. గౌరి ఇన్‌స్ట్రక్షన్స్ ఫాలో అవుతున్నాడు. ఈమధ్య ఆమెతో కమిషనర్ ఆఫీసుకి కూడా అతను వచ్చాడు. అతనికి ఇప్పుడు ఇద్దరు పిల్లలనికూడా తెలిసింది.

ఓ ఆదివారం అనుకోకుండా అహమ్మదాబా దునుంచి శాంతిభూషణ్ వచ్చాడు.

చెల్లెలికంటె ముందు గౌరినే పలకరించా డు.

కాస్సేపయాక 'ఫాదర్ ఆరోగ్యం బాగాలేదు' అన్నాడు బాధగా. ఆ మాటతీరుని బట్టి శేఖరం గ్రహించాడు గంగారాంగారి కండిషన్ దిగజారుతూందన్నమాట.

ఆ రాత్రి భోజనాల దగ్గర అన్నాడు శాంతి భూషణ్— "స్వరూపా— నీకు ఈసారి ఏ ప్రెజెంటేషన్ తేలేదు. వంశీకీ లేదు. ఒక్క గౌరికే తెచ్చాను"

ముందొచ్చిన చెవులకంటే వెనకొచ్చిన కొమ్ములు వాడి అంటే ఇదేనేమో అనిపించింది రాణికి. బ్రీఫ్‌కేస్‌లోంచి తీసిచ్చాడతను— లేటెస్ట్ మోడల్— ఇంపోర్టెడ్ రిస్టువాచ్. చాలా ఖరీదు ఉంటుందని తెలుస్తూనే ఉంది.

'థాంక్స్...' అంది గౌరి.

మర్నాడే భూషణ్ తిరుగుప్రయాణం పెట్టు కున్నాడు— "మిస్టర్ శేఖర్— మీకు అభ్యంతరంలేకపోతే మా స్వరూపని నాతో పంపండి. మా ఫాదర్‌కి ఆమెను చూడాలని ఉంది" అన్నాడు.

"నేను అబ్జక్షన్ చెప్పేవాడినా, తప్పకుండా తీసుకువెళ్ళండి. అవసరమైతే నేనూ వస్తా ను— నాకు లెటర్ రాయండి" అన్నాడు శేఖరం.

రాణీ వంశీతో పుట్టింటికి వెళ్ళింది.



ఆవేళ గౌరి ఆఫీసులో కాగితాలు చూసు కుంటూ ఉండగా ఎవరో ఆఫీసరుగారికి జీప్ ఆక్సిడెంట్ అయిందనీ, ఆయన తమ డిపార్ట్ మెంటుకి చెందినవాడే అనీ తెలిసింది.

ఎవరని ఆమె ఫోన్‌లో ఎంక్వాయిరీ చేసినా ఎవరూ తమకు తెలియలేదన్నారు. చివరికి తెలిసింది... ఆ ఆఫీసరు శ్యామసుందరే అని.

"అరెరె... ఎంత పని జరిగింది—" చాలా బాధపడింది గౌరి.

గట్టి దెబ్బలు తగిలాయనీ, ఆయన్ని హాస్పి టల్‌లో చేర్పించారనీ, రికవరీకి చాలా టైమ్ పట్టవచ్చనీ తెలిసింది. ప్రస్తుతం స్పృహలేని స్థితిలో ఉన్నాడట.

వెంటనే హాస్పిటల్‌కి వెళ్ళింది గౌరి. ఆమెతో ఇద్దరు సి.టి.ఒ.లుకూడా వెళ్ళారు. శ్యామసుందర్‌ని చూసి ఆమె ఇక నిలవలేకపో యింది. పరిస్థితి సీరియస్‌గానే ఉంది.

మూడోనాడు అతనికి స్పృహవచ్చిందనీ కొద్దిగా మాట్లాడుతున్నాడనీ తెలిసి మళ్ళీ హాస్పి టల్‌కి వెళ్ళింది గౌరి. అతను కళ్ళు మూసుకుని పడుకుని ఉన్నాడు. కాళ్ళకి, చేతులకి, తలకీ కట్లు కట్టి ఉన్నాయ్. మొహం పాలిపోయింది.

'నిద్రపోతున్నట్టున్నారే...' నర్సుతో అంది





గౌరి.

"అవునండి— పాపం చాలా పెద్ద దెబ్బలు తగిలాయ్" అంది నర్సు.

అప్పుడే కళ్ళు తెరిచాడు శ్యామసుందర్. గౌరిని చూసాడు. చూడలేకనేమో మళ్లీ కళ్ళు మూసుకున్నాడు.

డాక్టర్‌ని కలిసి కండిషన్ తెలుసుకుని మళ్ళీ గదిలోకి వచ్చింది గౌరి. అప్పటికి అతను కొస్త లేచి తలగడకి ఆనుకుని కూర్చున్నాడు.

ఏమీ బాధపడవద్దనీ, భయం లేదనీ అతని కి ధైర్యంచెప్పి, "మీకు ఎప్పుడు ఏంకావాలన్నా నాకు కబురు చెయ్యండి – డోంట్ హెజిటేట్" అని చెప్పి వెళ్లిపోయింది గౌరి. స్పాంటేని యస్‌గా అతని కళ్ల కొలుకుల్లో నీరు నిండింది.

మరో రెండు రోజులకి గౌరికి ఫోన్ వచ్చింది – హాస్పటల్‌నుంచి: "దయవుంచి మిమ్మల్ని ఓసారి హాస్పటల్‌కి రమ్మని శ్యామసుందర్‌గారు కోరుతున్నారు" అని చెప్పారెవరో. ఆ కంఠం ఎవరిదో తెలియలేదు. ఆ సాయంకాలం అలాగే హాస్పటల్‌కి వెళ్లింది గౌరి. అప్పుడే ఆయన భార్యా, పిల్లలూ, నౌకరూ వచ్చారు – పళ్లూ, పాలూ, బ్రెడ్డూ వగైరా పట్టుకుని.

'నమస్కారం......' అందామె గౌరిని చూసి.

'నేను మీకు తెలుసా....'? అంది గౌరి.

"ఈయన చెప్పారు –"అందావిడ.

గౌరిని చూసి అతను లేవబోయాడు.

'వద్దు - వద్దు - లేవకండి' అని గౌరి వారించింది.

చాలాసేపు కూర్చుని, ప్రోగ్రెస్ ఎలా ఉందో తెలుసుకుని వెళ్లిపోయింది గౌరి.

"మీ డి.సి. గారు చాలా కైండ్ హార్టెడ్ లేడీ అనుకుంటాను. ఆమె మాటలే చెబుతున్నాయ్ ఆ సంగతి" అంది మిసెస్ శ్యామసుందర్.

'ఔను....' అన్నట్టు తల ఊపాడతను. ఏదో చెప్పబోయి, చెప్పలేక కళ్లు మూసుకున్నాడు.

రెండురోజులు పోయాక గౌరి హాస్పటల్‌కి వచ్చినప్పుడు అతను అన్నాడు -

"మేడమ్ - ఐ బెగ్ పార్డన్"

ఎందుకో ఆమె అడగలేదు – ఏమిటో అతను చెప్పలేదు. ఇద్దరూ కాస్సేపు మౌనంగా ఉండిపోయారు.

"రెండు నిమిషాలు అయ్యాక అతనన్నాడు – నాయందు దయ ఉంచి ఇక్కడికి రావడం మానకండి"

"ష్యూర్ – ష్యూర్ – ఇకముందు ఫ్రీక్వెంట్‌గా వస్తాను. వి ఆల్ ప్రే ఫర్ యువర్ ఎర్లీ రికవరీ" అందామె.

అతని మనశ్శాంతి కోసమని కాబోలు ఏవో కబుర్లు చెప్పింది. వాళ్ల ఫామిలీ ఇంకా రాలేదు. తనే హార్లిక్స్ కలిపి అతనికిచ్చింది. హృదయాంతరాల్లోంచి అభిమానం పొంగిపొర్లిందతనికి. ఆమెపై గౌరవం నరనరాల్లో కట్టలు తెంచుకు ప్రవహించింది. అదే టైములో అతని గుండెలు కోసేసే మాట ఒకటి వినిపించింది గౌరి నించి –

"నా చెయ్యి చూశారా – బాగుపడిపోయింది"

దుప్పటి అంచుతో అతను కళ్ళు తుడుచుకున్నాడు. అవధులు దాటిన పశ్చాత్తాపంలో మనిషి ఏంచేస్తున్నాడో అతనికే తెలియదు. ఆమె ఒకప్పుడు రాసిన ఉత్తరంలోని ఒక మాట గుర్తుకొచ్చింది: "టైములో ఒకరు మరొకరికి చేయగలిగింది చెయ్యకపోతే ఆ తర్వాత చేసినా అది ఎవరికీ అక్కర్లేకపోవచ్చు. అందువల్ల నష్టపోయేది తనేగాని ఇతరులు కారు"

అతను ఇక ఆమెను చూడలేక అటు తిరిగిపడుకున్నాడు. కురూపినై ముఖాన్ని లోకానికి చూపించవచ్చేమోగాని కృతఘ్నుడనై చూపలేను అనుకున్నాడు. రైలు పట్టాల కిందపడి నలిగిన గొడ్డుకీ, కారు కిందపడి చచ్చిన కుక్కకీ సానుభూతైనా చూపిస్తుంది లోకం. మరి తనకు? వాటి సాటి కూడా తనుచెయ్యేదేమో!

ఒకరోజున ఆఫీసులో గౌరితో మాట్లాడి అప్పుడే ఎవరో ఒకాయన వెళ్లిపోయాడు.

ఇంతలో మేనేజరు వచ్చి – "మీకోసం ఎవరో బయట వెయిట్ చేస్తున్నారు, మేడం" అన్నాడు.

"ఎవరూ....?"

"తెలియదండి...."

"ఎవీ ఎస్.టి.పి....?"



"కాదండి.... ఎవరో ఫిలాసఫర్‌లా ఉన్నాడు"

"లెట్ హిమ్ కమ్"

ఆయన లోపలికి వచ్చారు. వయసు మళ్లినవాడిలా దగ్గుతున్నాడు. గడ్డం పెరిగి ఉంది. సిల్కులాల్చీ, రిమలెస్ స్పెక్ట్స్, క్రాఫ్ రేగి ఉంది. అలసటగా కూడా ఉన్నాడు. కాని 'యంగ్ అండ్ హాండ్‌సమ్' అని తెలుస్తూనే ఉంది.

'వాట్ కెన్ఐ డూ ఫర్ యూ' అంది గౌరి.

అతను మాట్లాడలేదు.

'ఏదైనా ఉద్యోగం కోసమేమో' అనుకుంది.

'ఎందుకోసం వచ్చారు — చెప్పండి...' అంది.

అతను ఆమెకేసి గుడ్లప్పజెప్పి చూడ్డం తప్ప ఉలుకూపలుకూలేదు.

ఏదైనా ఆర్థికసహాయం కోసం వచ్చాడేమో అనుకుంది గౌరి.

అతనే అన్నాడు —

"నాపేరు రవితేజ...."

ఈ పేరు ఎప్పుడో వినినట్లుంది. ఔను — అన్నయ్య చెప్పాడు చాలా కాలం క్రితం.

'శ్యామ్‌సుందర్ — సి.టి.ఓ ఈజ్ మై బ్రదర్' అన్నాడతను.

ఓ నిమిషం తత్తరపడింది గౌరి. ఏం చెయ్యాలో ఏంచెప్పాలో తోచలేదు. అయినా ఇప్పుడు తను ఐ.ఎ.యస్ ఆఫీసరు. అది మరిచిపోతే ఎలా?

"మీరేదో ఆలోచిస్తున్నట్లున్నారు — ఐయామ్ సారీ. ఫర్ ది డిస్టర్బెన్స్...." అని అతనన్న మాటకి ఉలికిపడి — అంది గౌరి:

"నోనో — నథింగ్ ఆఫ్ దట్ సార్ట్ — చెప్పండి"

"ఐయామ్ ఫ్రం జర్మనీ.... అక్కడ ఫిలాసఫీ ప్రొఫెసర్‌గా ఉంటున్నాను. మా బ్రదర్ దగ్గర్నుంచి ఆరు సంవత్సరాలుగా నాకు లెటర్స్ లేవు. కాని లాస్ట్ వీక్ ఓ కేబిల్ అందింది. వాడికి జీపు ఆక్సిడెంట్ అయిందనీ, కండిషన్ క్రిటికల్‌గా ఉందనీ. ఏదియేమైనా వాడు నా తమ్ముడుగదా! చూడ్డానికి వచ్చాను"

గౌరి బజర్‌నొక్కడం, అటెండర్ కాఫీతెచ్చి ఇవ్వడం జరిగింది.

"మీ డివిజన్‌లోనే మా బ్రదర్ వర్క్‌చేస్తున్నాడని విన్నాను. వాడు ఇప్పుడు ఎక్కడున్నదీ మీకు తెలుస్తుంది కదా అని ఇలా వచ్చాను. ప్లీజ్ గైడ్‌మీ" అన్నాడతను.

ఎంత హుందాతనం, ఎంత సరసమైన మాట — అనిపించింది గౌరికి.

"పదండి వెడదాం... ఐవిల్ టేక్‌యు టుది హాస్పటల్" అంది.

'వెరీ కైన్డ్ ఆఫ్ యు....' అంటూ అతను లేచాడు.

ఇద్దరూ కారులో కూర్చున్నాక అతను అన్నాడు — "మీరు స్వయంగా నాతో వస్తున్నారంటే — రియల్లీ.... ఐ హేవ్‌నాట్ సీన్ ఎనీ ఐ.ఎ.యస్ ఆఫీసర్ ఆఫ్ యువర్ క్వాలిటీస్"

కారు కదిలింది. దారిలో మళ్లీ అతను అన్నాడు: "ఇటీజ్ షార్పర్ దాన్ సర్పెంట్స్ టూత్ టు హేవ్ ఎ తాంక్లెస్ బ్రదర్‌లైక్ శ్యామసుందర్"

అందుకు గౌరి అంది-

"పరిస్థితుల ప్రభావం ఒకప్పుడలా చేయవచ్చు"

"మీరు అతన్ని డిఫెండ్ చేస్తున్నారు ఎందుకనో కాని, అతనందుకు అర్హుడుకాడు"

"ఆయనవల్ల తప్పులేదనికాదు- చాలామంది తప్పులు చేస్తుంటారు- అయినా మనం కొంచెం మార్జిన్ ఇవ్వాలి అని నాఉద్దేశం"

ఆమె విశాలభావాలకి అతను ఆశ్చర్యపోయాడు- 'అంత చిన్నవయస్సులో అంతటి విశాలదృక్పథం కలిగి ఉండడం నిజంగా అపురూపం' అనుకున్నాడు.

"ఐసీ సూపర్ హ్యూమన్ క్వాలిటీస్ ఇన్ యు..." అన్నాడు.

గౌరి ఏమీ అనలేదు.

"నిజమే- చెడును చెడుగానే తీసుకుంటే మనమూ మామూలు మనుషులమే అవుతాం. ఆఫ్టరాల్ మనిషి జీవితం ఎంత? అతని ఆయుష్షు ఎంత? వెలిగించిన కొవ్వొత్తి అలా చూస్తుండగానే కరిగిపోతుంది; వత్తికాలిపో





తుంది; వెలుగు అదృశ్యమవుతుంది; అలాగే మనిషీను. ఉన్న నాలుగు రోజులూ మనిషిని మనిషి మంచిగా చూడ్డమే మంచిది'' అన్నాడతను.

''మీ బ్రదర్‌కీ తెలును తన లోపాలు. అయితే కొంచెం ఆలస్యంగా గుర్తించాడు. పూర్‌మాన్'' అంది గౌరి.

అతనేమీ అనలేదు. గౌరవసూచకంగా ఆమెకేసి చూశాడు- అంతే.

కారు హాస్పిటల్ చేరింది.

లోపలికి వెళ్లగానే తమ్ముణ్ణి కౌగలించుకున్నాడు రవితేజ. అందుకు సగం కారణం గౌరి మాటలే అని శ్యామసుందర్‌కి ఏం తెలుసు?

''ఈ స్థితిలో నిన్ను కలుసుకోవలసి వస్తుందని అనుకోలేదురా సుందరం'' అని కళ్లు తుడుచుకున్నాడు రవితేజ.

అక్కడే ఉన్నారు శ్యామసుందర్ భార్యా పిల్లలూ.

రవితేజ చాలాసేపు అతని దగ్గరే కూర్చున్నాడు.

''అమ్మా, చిన్నన్నయ్యా నాలుగు రోజులుండి నిన్ననే వెళ్లారన్నయ్యా'' అన్నాడు శ్యామసుందర్.

వాళ్లని చూడ్డంవడలేదే అనిపించకపోలేదు రవితేజకి.

గౌరి కూడా అక్కడే ఉండడం అందరికీ ఆశ్చర్యంగా ఉంది. కాస్సేపు ఆమె శ్యామసుందర్ భార్యతో కబుర్లు చెప్పింది. అప్పుడే ఆమె చెప్పింది గౌరికి-

రవితేజని శ్యామసుందర్ చాలా నీచంగా చూసేవాడనీ, అతను కష్టపెట్టుకుని ఎనిమిదేళ్లక్రితం ఇల్లు విడిచివెళ్లిపోయాడనీ, బెనారస్ హిందూయూనివర్సిటీలో లెక్చరర్‌గా చేరి తర్వాత ప్రమోషన్‌మీద ప్రొఫెసరై, డిప్యూటేషన్‌మీద జర్మనీ వెళ్లాడనీ, ఆయన బెనారస్‌లో పి.హెచ్‌డి చేసి జర్మనీలో కూడా పి.హెచ్‌డి చేశాడనీ కూడా చెప్పింది. డిప్యూటేషన్ టైమ్ కూడా అయిపోయిందనీ, తిరిగి బెనారస్‌లోనే జాయిన్ అవుతాడనీ చెప్పింది.

మరో అయిదునిమిషాలకి గౌరి వెళ్లిపోయింది.

ఆమె వెళ్లేక మాటల సందర్భంలో రవితేజ అన్నాడు- ''సుందరం... ఏమీ తెలియని స్థితి నుంచి చాలా తెలిసేస్థితికి చేరేమధ్య తెలిసీ తెలియని స్థితి ఒకటుంటుంది- అదిబాల్యం. చాలా తెలుస్తున్న స్థితిలో అంతా నాకే తెలును అనే స్థితి రావచ్చు- అది మూర్ఖత్వం. నీకువట్టిన జాడ్యం అదే''

రెండురోజులు పోయాక గౌరి ఓ దుర్వార్త వింది. శ్యామసుందర్‌కి ఒక కాలు తీసెయ్యాలని డాక్టర్లు అన్నారని; తీయకపోతే ప్రాణానికే ముప్పు వస్తుందనీను. ఈ వార్త భరించలేకపోయింది గౌరి.

ఓ రోజు సాయంత్రం గౌరీవాళ్లింటికి వచ్చాడు రవితేజ. అప్పుడే గౌరి కూడా ఆఫీసునుంచి వచ్చింది. అతని రాకకు ఆశ్చర్యపోయారందరూ.

గౌరి కంగారుపడింది కూడా.

అతనికి చాలా మర్యాదలు చేశారు.

''మిస్టర్ శేఖర్- నేను ఇక్కడికి రావాలనే వచ్చాను. మానవత్వం పరిమళించే గౌరి పుట్టింటికి వచ్చాను. మిమ్మల్ని గురించి, మీ కుటుంబం గురించి అంతా విన్నాను. కొన్ని విషయాలు మా సుందరమూ చెప్పాడు. మీకు ఎంత అవమానం జరిగిందో అంతకు మించిన మర్యాదకు మీరు అర్హులు. అది నాచేతులమీదుగా జరగాలని నా ఆకాంక్ష. అన్‌డ్యూ లిబర్టీ తీసుకుంటున్నానని మీరు అనుకోకపోతే నాదొక మాట. మీకు అభ్యంతరం లేకపోతే గౌరిని నాభార్యగా స్వీకరించడానికి నేను సిద్ధంగా ఉన్నాను''

ఇది నిజంగా ఊహించని పరిణామం నిస్సందేహంగా. ఊహకి అందని విషయం. అందరికీ ఇలాగే అనిపించింది. అందరూ సంతోషంగా అంగీకరించారు.

''ఇలా ఇప్పుడు జరగవలసి ఉండగా, ముందే మరోలా ఎలా జరుగుతుంది?'' అంది స్వరూప శేఖరంతో.

''నీ కవిత్వం కాస్త కట్టిపెట్టి పెళ్లిపనులు చూడు'' అన్నాడు శేఖరం నవ్వుతూ.








## యూనిట్ లింక్‌డ్ ఇన్సూరెన్స్ ప్లాన్ మీకు అందిస్తుంది

● **ఆదాయపు పన్ను మినహాయింపు**

ఆదాయపు పన్ను చట్టం 80C క్రింద ఆదాయపు పన్ను మినహాయింపు.

● **అధిక రాబడులు**

డివిడెండ్ ప్రతి సంవత్సరమూ పెరుగుతూనే వుంటుంది. ఈ సంవత్సరం యిది 13.75%- ఎన్నడూ లేనంత ఎక్కువ. రూ. 60,000/-*
10 సంవత్సరాల కాలానికి చెల్లించినప్పుడు
రూ. 1,13,155.97.
15 సంవత్సరాల కాలానికి చెల్లించినప్పుడు
రూ. 1,57,299.74 అవుతుంది.

● **జీవిత భీమా**

గరిష్ఠం రూ. 60,000/- వరకూ వైద్యపరీక్ష అవసరం లేదు.

● **ప్రమాద భీమా**

జీవిత భీమా కాక - అందరు సభ్యులకు
రూ. 15,000/-

● **మెచ్యూరిటీ బోనస్**

10 సంవత్సరాల ప్రణాళిక మీద 5% మరియు
15 సంవత్సరాల ప్రణాళిక మీద 7.5%

అర్హత : 10 సంవత్సరాల ప్రణాళికకి
18-55 సంవత్సరాల వయసు
15 సంవత్సరాల ప్రణాళికకి
18-50 సంవత్సరాల వయసు

లక్ష్యం మొత్తం : రూ. 3,000/- నుం.
రూ. 60,000/- వరకు

* ఈ మొత్తంలో మెచ్యూరిటీ బోనస్ కూడా చేరివుంటుంది.
అర్హతకి వుండవలసిన వయసు 25 సంవత్సరాలు.

# యుయల్ఐపి
## మీకు అతితక్కువకి
## అత్యధికంగా లభింపచేస్తుంది!






# UNIT TRUST OF INDIA

(A Public Sector Financial Institution) H.O. Bombay 400 020.

**Regional Office:** 45, Second Line Beach, Madras 600 001. Ph: 587433, 580938. **Branch Offices • Hyderabad:** 203/204, Moghul Court Complex, 2nd Floor, Basheer Bagh, Hyderabad 500 001. Ph: 240030 • **Vijayawada:** 29-3-12, Venkateswara Rao Street, Near APCO Bhavan, West of Rehman Park, Governorpet, Vijayawada 520 002. Ph: 63964.

**Our Chief Representatives in Andhra Pradesh** ☐ ADILABAD • **Sanwal Ram Sah,** Ph: 91 (P.P) ☐ CHITTOOR • **K V Kotiveeraiah,** irupati, Ph: 22322 ☐ CUDDAPAH • **A R Krishna Reddy,** Ph: 2701 ☐ EAST GODAVARI • **P Venkataramana,** Kakinada, Ph: 76047 ☐ GUNTUR • **K B Tilak,** Ph: 24964, 31839 ☐ KARIMNAGAR • **T Ahalya Sreenivas,** A-1, Gouthaminagar, P.O. Fertiliser City, Pin 505 210 ☐ KURNOOL • **T Seetharamaiah Setty,** Ph: 22335 (P.P) ☐ MEDAK • **P V Krishna Reddy,** Ph: 2820 ☐ MEHABUBNAGAR **N Venkatanarayana,** H.No. 10-87, B R Compound, adcherla 509 301 ☐ NELLORE • **A Sathyanarayana,** Ph: 2002 ☐ PRAKASAM • **M V Ramanaiah,** Ongole, Ph: 3337, 3244 ☐ RANGAREDDY • **S Veeraraghavalu,** H.No. 11-9-485-6-1, Plot No.13, Lalithanagar, Hyderabad 500 044 ☐ VIZAG/ VIZIANAGARAM • **C Narayanaswamy,** Ph: 63116 ☐ WARANGAL • **B S N Murthy,** Ph: 8631 ☐ WEST GODAVARI/KHAMMAM • **Y Somasundara Rao,** anuku, Ph: 2440.

**లక్ష్యం మొత్తం రూ. 60,000/-కి పెంచబడినది.**

# చతుర వ్యాసం

## పిల్లలకోసం....

పిల్లల సంక్షేమంకోసం చైనాలో తల్లితండ్రులు పాఠాలు నేర్చుకోవటానికి స్కూళ్ళకి వెళుతున్నారు. పిల్లలపెంపకంలో తల్లితండ్రులకి శిక్షణనిచ్చే ఒక ప్రత్యేక కార్యక్రమాన్ని చైనా ప్రభుత్వం ప్రారంభించింది. పిల్లలపెంపకంలో మెళకువలు, వైద్యసంబంధమైన విషయాలు తల్లితండ్రులకేగాక తాతముత్తవలకి కూడా తెలియటం ఎంతో అవసరమని ప్రభుత్వం భావిస్తోంది. జనాభాసమస్యను ఎదుర్కొనటానికి "దంపతులకి ఒకే బిడ్డ" అనే నినాదాన్ని ఆ ప్రభుత్వం ప్రచారం చేస్తోంది. సమాజఅభివృద్ధికి కుటుంబసంక్షేమం మొదటిమెట్టు అనే అంశాన్ని గ్రహించిన ప్రభుత్వం ఈ కార్యక్రమాన్ని మొదలుపెట్టింది. పిల్లలవికాసం, చదువుసంధ్యలు, సంక్షేమం చూడవలసిన బాధ్యత తల్లితండ్రులదే. వారికి కావలసిన వైద్యసహాయాన్ని చదువుకోటానికి కావలసిన సౌకర్యాలను సమకూర్చటం ప్రభుత్వబాధ్యత.

సాంఘిక శాస్త్రవేత్తలు బాలనేరస్తుల నేరప్రవృత్తిపై కొన్ని పరిశోధనలు జరిపారు. తల్లితండ్రుల ప్రేమాభిమానాలు, ఆదరణ కొరవడినా, వారి పెంపకంలో పెద్దలకు సరియైన అవగాహనలేకపోయినా పిల్లలకు ప్రతికూల వాతావరణం ఎదురౌతుంది. అటువంటి పరిసరాలలో పెరిగిన పిల్లలు చెడుఅలవాట్లకు లోనై బాలనేరస్థులుగా తయారవుతారు. కుటుంబంలో ఒకే పిల్లనుగాని పిల్లవాడినిగాని పెంచవలసినప్పుడు తల్లితండ్రులు మరీ ఎక్కువజాగ్రత కనబరచాలి. అతిగారాబంగా పెరిగినబిడ్డ చెడుఅలవాట్లకులోనై తప్పుత్రోవ పట్టే అవకాశాలు ఎక్కువగా వుంటాయని పరిశోధనలవలన తెలిసింది. ఎక్కువమంది పిల్లలున్న కుటుంబంలో పెరిగిన పిల్లలు సమాజానికి మంచిసేవచేయగల అవకాశాలుంటాయని శాస్త్రవేత్తలు తెలుసుకున్నారు. పిల్లలు చెడుమార్గంలోపడినా లేక మంచి నడవడికలిగినవారైనా అది కేవలం వారిస్వభావంపైనే ఆధారపడి వుండదు. తల్లితండ్రులు, ఇతర కుటుంబసభ్యులు వారిని తీర్చిదిద్దటంలో కనబరచే శ్రద్ధాసక్తులపైన, శాస్త్రీయదృక్పధంలో వారికి శిక్షణ ఇవ్వటంపైన ఆధారపడి వుంటుంది. అందువలన ఒకే బిడ్డగల కుటుంబంలోని తల్లితండ్రులే ఎక్కువసమస్యలను ఎదుర్కొంటారు.

పిల్లల ఆరోగ్యం, తిండి అలవాట్లు, లావుకావటం, వంటి విషయాలపై తల్లితండ్రులకి శాస్త్రీయమైన సలహాలు అవసరం అవుతాయి. కొందరు పిల్లలు చదువులో వెనకబడతారు. చెడుఅలవాట్లు నేర్చుకుంటారు లేదా అతి తెలివితేటలతో తప్పులు చేస్తుంటారు. సోమరితనం, కొంటెతనం, పొగరుబోతుతనం వంటి స్వాభావిక గుణాలవలన తల్లితండ్రులకి క్రొత్త సమస్యలు తెచ్చిపెడుతుంటారు. అటువంటి వారికి పిల్లలను పెంచటంలో తగిన శిక్షణ ఇవ్వటం ఎంతైనా అవసరం. తల్లితండ్రులకి పిల్లలపెంపకంపై శిక్షణఇచ్చే తరగతులను ఆస్పత్రులలోను, కిండర్‌గార్డన్ పాఠశాలల్లోను, ప్రాథమిక, మాధ్యమిక విద్యాలయాల్లోను ఏర్పాటుచేస్తారు. ఒక 'టరమ్'లో నాలుగు నుండి ఆరువరకు శిక్షణా తరగతులను నిర్వహిస్తారు.

ఈ శిక్షణా కార్యక్రమాలను నూతన దంపతు







లకి, సంతానవంతులుకాబోయే దంపతులకి నిర్వహిస్తారు. కలుగబోయే బిడ్డకు ఎలా స్వాగతం చెప్పాలి అనే అంశంపై శిక్షణఇస్తారు. పుట్టిన బిడ్డలు బాల్యావస్థలోనున్నప్పుడు వారి తల్లులు ఎక్కువసంఖ్యలో ఈ తరగతులకి హాజరవుతారు. బిడ్డ పెరిగిన తరువాత తండ్రులు కూడా ఈ తరగతులకి హాజరవుతారు. బిడ్డమాధ్యమిక పాఠశాలస్థాయికి ఎదిగేనరికి శిక్షణపొందకోరే తల్లితండ్రులసంఖ్య సరిసమానంగా వుంటుంది. సాంఘిక కార్యకర్తలు ఈ శిక్షణాతరగతులకి హాజరయ్యేవారిని వాటి ప్రయోజనాలను గురించి వారి అభిప్రాయం ఎలావుంటుందో తెలుసుకుంటుంటారు. శిక్షణ పొందే వారిలో సగంమంది పిల్లలపెంపకంలో వారి నడవడిని తీర్చిదిద్దటానికి కలిగే సమస్యలను ఎలా పరిష్కరించుకోవాలో తెలుసుకోవటానికి స్కూల్లో చేరినట్లు చెప్పారు. మిగతా సగంమంది పిల్లలపెంపకంలోను,వారికివిద్యా. బుద్ధులు నేర్పటంలోను తమకున్న అనుభవాన్ని విజ్ఞానాన్ని పెంపొందించుకోటానికి చేరినట్లు చెప్పారు.

ఒకే బిడ్డగల కుటుంబంలో పెరిగిన పిల్లలకి వారిపైచూపే అతిగారాబం వారి అభివృద్ధికి, వికాసానికి అవరోధంగా వుంటుంది. పిల్లలు ఇంటి వాతావరణంలో ఎదురయ్యే బాధ్యతలను నిర్వహించటంలో వారికి శిక్షణ ఇవ్వగలిగి వుండాలి. సున్నితమైన వారి మనస్థత్వాన్ని అర్థంచేసుకుని వారిని కావలసిన, విధంగా తీర్చిదిద్దే ఓర్పు, నేర్పు ఉండాలి. శిక్షణ పొందిన తల్లితండ్రులే ఈ బాధ్యతను జయప్రదంగా నిర్వహించగలుగుతారు. అలాంటి కుటుంబంలోని పిల్లలు పాఠశాలలోను, సమాజంలోను రాణిస్తారు.

తల్లితండ్రులకి పాఠాలు నేర్పే కేంద్రాలు చైనాలో సుమారు ఇరవైవేలవరకు ఉన్నాయి. నగరప్రాంతాలలో అవి ఎక్కువసంఖ్యలో ఉన్నా ఇంకా చాలా గ్రామాలలో వాటిని నెలకొల్పవలసిన అవసరం వుంది. ఈ శిక్షణాకార్యక్రమాలవ

లన మూడు ముఖ్యమైన లక్ష్యాలను సాధించటానికి అవకాశం వుందని వారు భావిస్తున్నారు. సమాజంలో కుటుంబవ్యవస్థ మొదటి మెట్టుగా భావించి, వారిని ఆదర్శప్రాయంగా తీర్చిదిద్దటానికి అవకాశం వుంటుంది. పిల్లల అవసరాలను తెలుసుకుని వాటిని సమకూర్చటానికి వీలవుతుంది. పిల్లలలో నేరప్రవృత్తిని పోగొట్టి వారిని సంఘసేవకులుగా తయారుచేయటానికి వీలవుతుంది.

"ఇంటర్ నేషనల్ ప్లాన్డ్ పేరంట్‌హుడ్ ఫెడరేషన్" ప్రచురించే 'పీపుల్' పత్రికలో ఈ శిక్షణాకార్యక్రమ వివరాన్ని ప్రచురించారు.

## సంచార గృహాలు!

"ఇల్లు కట్టి చూడు" -- అని మనవాళ్ళు ఊరికినే అనలేదు. మనదేశంలోనేకాక ఏ దేశంలోనైనా ఇల్లు కట్టడం మహాయజ్ఞంలాంటిదే. ఎన్నో విషయాల్లోఎంతోఅభివృద్ధిసాధించిన అభివృద్ధి చెందినదేశాలలో ఇది బీదదేశాలకన్నా ఖరీదైన, క్లిష్టమైన వ్యవహారం. అమెరికాలో ఇల్లు కట్టుకోవడం అనేది చాలామందికి కలగానే మిగిలిపోయే కోరిక. ఇల్లు కట్టడంలోని శ్రమ లేకపోవడంతోపాటు, ఖర్చును కూడా చాలావరకు తగ్గించగల 'మొబైల్ హౌసెస్' (కదిలే ఇళ్ళు) తయారుచేయటం మొదలెట్టాక అక్కడ కొందరికి ఇల్లు కట్టేపని సులువయింది.

విశ్రాంతి దినాలు ఎక్కడపడితే అక్కడ సకల సౌకర్యాలతో గడపగోరే వారికోసం, 1930 ప్రాంతాల్లో ట్రెయిలర్ కోచ్‌లు తయారుచేసేవారు. ఈ ట్రెయిలర్ కోచ్ చిన్నపాటి ఇల్లులాగా వుండేది. రెండవ ప్రపంచయుద్ధసమయంలో ఇంటి నిర్మాణానికి అవసరమైన అనేక వస్తువుల ఉత్పత్తి కుంటుబడటంతో ఇళ్ళకొరత ఏర్పడింది. ఆ తరుణంలో ఈ ట్రెయిలర్ కోచ్‌లనే చిన్నచిన్న మార్పులతో ఇళ్ళుగా ఏర్పాటుచేసుకోనారంభించారు కొందరు. బజారుకెళ్ళి వస్తువులు కొనుక్కున్నట్టుగానే, ఇల్లు కూడా కొనుక్కునే వీలుకలగటంతో ఈ ఇళ్ళకు జనాదరణ పెరుగనారంభించింది. చివరకు 1952 నాటికి మొబైల్ ఇళ్ళపరిశ్రమ, ట్రెయిలర్ కోచ్ పరిశ్రమనుండి విడివడి ఒక స్వతంత్ర పరిశ్రమగా రూపొందింది. అనేక పరిశ్రమలువెలసి 1960 నాటికి మరింత సౌకర్యవంతమైన ఇళ్ళ తయారీ మొదలయింది. కొద్దికాలానికల్లా అమెరికాలోని అనేక రాష్ట్రాలు మొబైల్ ఇళ్ళ పరిశ్రమలు పాటించవలసిన విధినిషేధాలను నిర్దేశించాయి.

ఒక పెద్దవస్తువును తయారుచేసినట్టుగానే మొబైల్ ఇల్లును ఫ్యాక్టరీలో తయారుచేస్తారు. ఒక నిర్ణీత ఆకారంలోని ఛేసిస్‌లో ఇంటిని బిగిస్తారు. ఈ ఛేసిస్‌లో భూతలంతో కలిసిపోయే గచ్చు, గోడలు, కప్పు బిగించుకోవటానికి ఆధారాలుంటాయి. ఫ్యాక్టరీతో తయారైన ఇంటిని ఒక లారీలోకెక్కించి రవాణాచేయవచ్చు. ఈ ఇళ్ళన్నిటినీ నిర్ణీత వైశాల్యంతో తయారుచేస్తారు. అందుచేత మొబైల్ ఇంటిని అమర్చుకోగల ప్లాట్ లేదా స్థలం ఫలానా కొలతలతోనూ, ఆ కొలతల్లో ఫలానా చోట మురుక్కాలువ చోటు, ఫలానాచోట చెత్తపోసుకునేచోటూ అంటూ కొన్ని నిర్దిష్ట ఏర్పాట్లుంటాయి. ఈ కొలతలతో, ఈ ఏర్పాట్లతో సుమారుగా 15 నుండి అంతకన్నా ఎక్కువ మొబైల్ ఇళ్ళు ఏర్పాటుచేసుకునే ప్లాట్లలో మొబైలు ఇళ్ళకాలనీల లాంటివి ఏర్పడసాగాయి. కొన్నిచోట్ల ఇలాంటి ప్లాట్ల స్థలాన్ని అద్దెకు కూడా ఇస్తుంటారు. కాంక్రీటుతో కట్టిన ఫుట్‌పాత్ లాంటి చిన్న గోడలపైనగానీ, స్లాబ్‌పైనగానీ, పునాదులతోగానీ ఈ ఇంటిని ఏర్పాటుచేసుకునే వీలుంటుంది.

మొదట్లో మొబైల్ ఇళ్ళు 8 అడుగుల వెడల్పు మాత్రమే ఉండేవి. ప్రస్తుతం 24 అడుగుల వెడల్పు ఇళ్ళు కూడా తయారుచేస్తున్నారు. ఎక్కువ ఆదరణ పొందిన ఇళ్ళు 14 అడుగుల వెడల్పూ, 60 నుండి 75 అడుగుల పొడవూ ఉన్నాయి. ఈ కొలతల ఇల్లు 966 చదరపు అడుగుల వైశాల్యంతో ఉండి సుమారు 1 లక్షా 35 వేల రూపాయల్లో దొరుకుతుంది. మరికొస్త విశాలంగా ఉండి, హాలుకు అనుబంధంగా 60 నుండి 100 చదరపు అడుగుల







విస్తీర్ణతగల గదులు కలుపుకునే ఇల్లు ధర సుమారు 2 లక్షల రూపాయలుంటుంది. రెట్టింపు వెడల్పుతో సౌకర్యవంతంగా ఉండే 1440 చదరపు అడుగుల వైశాల్యంగల మొబైలు ప్రారంభమయ్యాక వీటి వినియోగం కూడా ఎక్కువైంది. ఈ విశాలమైన ఇళ్ళ అమ్మకాలు, మొత్తం మొబైలు ఇళ్ల అమ్మకాలలో 1971లో 27 శాతందాకా పెరిగాయి. దీని ధర సుమారుగా 2 లక్షల 25 వేలుంటుంది. ఈ ధరల్లో అలాంటి ఇల్లు అమెరికాలో కట్టుకునే ఇళ్ళధరతో పోల్చితే చాలా చౌక అని చెప్పుకోవచ్చు.

సాధారణంగా మొబైల్ ఇంటిలో ఒక హాలు, ఒక వంటిల్లు, డైనింగ్ టేబుల్ ప్రత్యేకంగా అమర్చుకోగల స్థలం, ఒకటి రెండు స్నానాల గదులు, రెండు పడకగదులూ షెల్ఫులూ, అలమార్లూ, ఆటోమేటిక్ హీటింగ్ సిస్టమ్, నీళ్ళు కాచుకునే హీటర్, సుమారైన ఫర్నిచర్, కార్పెట్లూ వంటివన్నీ ఉంటాయి. ఇవికాక సెంట్రల్ ఎయిర్ కండిషనింగ్ సిస్టమ్, బట్టలుతికి ఆరేసేమిషనూ, అంట్లుతోమే మిషనూ, చెత్తాచెదారం పారబోసుకునే యూనిటూ వంటివి కావాలంటే అదనంగా మరికొంత సొమ్ము చెల్లించి, ముందుగా చెప్పి తయారు చేయించుకోవాల్సి ఉంటుంది.

మొబైల్ ఇళ్ళపట్ల మోజుపెరగటానికి ముఖ్యకారణం దాని ధర. ఇంటి స్థలంతోసహా 2 లక్షల 35 వేల రూపాయల్లో అమర్చుకోగల మొబైలు ఇంటిని సుమారు 6 లక్షల రూపాయలదాకా ఖర్చయ్యే మామూలు ఇంటితో పోలిస్తే, ఇది ఎంత చౌకైనదో అర్థమవుతుంది. మొబైల్ ఇంటి నిర్వహణకు తక్కువ ఖర్చవుతుంది. ఈ ఇళ్ళ స్వంతదారులకు కొన్ని పన్నుమినహాయింపులున్నాయి. ఈ ఇంటిని వాయిదాల పైన కూడా కొనుక్కోవచ్చు. ఇల్లు కావాలనుకోగానే వారం రోజుల్లో తయారై ఎదుట నిలుస్తుంది. తరచుగా ట్రాన్స్‌ఫర్లయ్యే ఉద్యోగాలలో ఉన్నవారు ఎక్కడికెళ్ళినా ఫ్లాట్ అద్దెకు తీసుకుని స్వంత ఇంట్లో ఉండవచ్చు. అయితే చాలావరకూ మొబైల్ ఇళ్ళను శాశ్వత ప్రాతిపదికపైనే ఏర్పాటు చేసుకుంటున్నారు. ఈ ఇంటిని తిరిగి అమ్ముకోవాలంటే చాలా చౌకలో అమ్మాల్సి రావటమూ, అనుకున్నచోట అద్దెకు ఫ్లాట్ దొరకటమూ అనేవి మాత్రమే మొబైల్ ఇంటి సమస్యలు. ఈ ఇంటికీ, మామూలు ఇంటికీ అట్టేభేదం వుండదు కూడా. క్రమంగా మొబైల్ ఇళ్లకాలనీల సంఖ్య పెరిగిపోతున్నది. అమెరికాలో సుమారు కోటీ 50 లక్షలమంది ప్రజలు సుమారుగా 60 లక్షల సంఖ్యలో వున్న మొబైల్ ఇళ్లల్లో నివసిస్తున్నారు.

# అగ్ని పర్వతాలపై సదస్సు!

జపాన్ అగ్నిపర్వతాలకి పుట్టినిల్లు. టోక్యోలోని 'హొకైడో' నగరానికి సమీపంలో 'కగోషిమా' అనే పెద్ద అగ్నిపర్వతం ఉంది. జపాన్‌లోనున్న 77 అగ్ని పర్వతాలలో ఏడు ఈ ప్రాంతంలోనే ఉన్నాయి. అగ్నిపర్వతాలు ప్రజ్వరిల్లినప్పుడు మంటలు పైకెగసి వెచ్చని బూడిదని వెదజల్లుతాయి. 'లావా' అనే వేడిద్రవం వెలువడుతుంది. జపాన్‌లోని కగోషిమాకి నాలుగు కిలోమీటర్ల దూరంలో సముద్ర జలాలమధ్యలో 'సుకురాజియా' అనే ద్వీపం ఉంది. దీనిలో ప్రపంచంలోకెల్లా ప్రమాదభరితమైన అగ్నిపర్వతాలున్నాయి. 1955 నుండి ఇప్పటివరకు ఈ పర్వతం అయిదువేలసార్లు ప్రజ్వరిల్లింది. ఈ పర్వతానికి పదికిలోమీటర్ల పరిధిలో అయిదు లక్షల అరవైవేల జనాభా నివశిస్తున్నారు. అంతమంది జనాభా అగ్నిపర్వతానికి అతి చేరువలోనున్న దేశం అది ఒకటే. ఇటలీలోని నేపుల్స్‌లో 'వెసూవియస్' అనే మరొక ప్రమాద భరితమైన అగ్నిపర్వతం ఉంది. దీనికి 20 కిలోమీటర్ల దూరంలో జనం నివసిస్తున్నారు.

'సకురజిమా' అగ్నిపర్వతం ప్రజ్వరిల్లినప్పుడు తూర్పుగాలివలన ఆ బూడిద నగరంవైపు వీస్తుంది. వసంత రుతువునుండి శిశిరంవరకు తూర్పుగాలులు వీస్తాయి. ఈ సమయంలో అది ప్రజ్వరిల్లితే వీధులన్నీ పొగ కమ్మిపోతాయి. చీకటిపడినట్లుగా ఉంటుంది. 80 మీటర్లకంటే ఎక్కువదూరం కనబడదు. ఉతికిన బట్టలను ఆరవేస్తే అవి బూడిదతో కప్పబడిపోతాయి. దాని తీవ్రతకు పచ్చనిచెట్ల ఆకులు వడిలి, కోమలత్వాన్ని కోల్పోతాయి. కగోషిమా వాతావరణ కేంద్రం 1987 జనవరి నుండి నవంబర్ 15వ తేదీవరకు వాతావరణ కాలుష్యంపై సర్వే జరిపింది. ఆ సర్వే వలన ఒక చదరపు మీటరు పరిధిలో 325 కిలోగ్రాముల బూడిద పేరుకుపోయినట్లు తెలిసింది. 1985లో చదరపు మీటరుకి 15.9 కిలోగ్రాముల బూడిద పేరుకొని ఉన్నట్లు నమోదు అయింది. రెండు సంవత్సరాల వ్యవధిలో వాతావరణ కాలుష్యం ఇరవైరెట్లు పెరిగింది. ఆ బూడిద వర్షంలా కురిసినప్పుడు ప్రజలలో భయం, నిరుత్సాహం, బాధ కలుగుతాయి. వారి జీవితాలు ఎప్పుడూ అగ్నిగోళాలమధ్య గడుపుతున్నట్లుగా ఉంటుంది. ఆ ద్వీపం గవర్నరుగా పనిచేస్తున్న 'కనామి కమాడ' 1988 జూలైలో 'కగోషియా ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్' అనే సదస్సుని నిర్వహించాలని నిశ్చయించారు. ఈ సమావేశంలో "అగ్నిపర్వతాలమధ్య మానవజీవితం" అనే అంశంపై విజ్ఞానవేత్తలతో చర్చలు జరుపుతారు. సమావేశంలో పాల్గొనటానికి 1000 సంస్థలకి, 43 దేశాలకి ఆహ్వానాలు పంపారు. పసిఫిక్ మహాసముద్రం పరిధిలో ఎక్కువగా భూకంపాలకు లోనయ్యే దేశాలనుండి ప్రతినిధులు ఈ సమావేశంలో పాల్గొంటారు. వీరు అగ్నిపర్వతాలను గురించి చర్చించి ప్రజలలో నిరుత్సాహాన్ని పోగొట్టి వారిని ఆ ప్రమాదంనుండి తప్పించటానికి ఉపాయాలను సూచిస్తారు. అగ్నిపర్వతాలుండే భూగర్భ పరిజ్ఞానం, వాటిపై ఆసక్తిగలవారెవరైనా ఈ సదస్సుకి హాజరు కావచ్చును. సదస్సులో పాల్గొనేవారు ఎలాంటి ప్రవేశ రుసుం చెల్లించనవసరంలేదు. 1988 మార్చి 31వ తేదీలోపల సదస్సుకి హాజరయ్యేవారు తమ వివరాలను తెలియజేసే పత్రాలను పంపాలి. అలా పంపటానికి ఈ క్రింది చిరునామా నిచ్చారు.

సెక్రటరీ ఫర్ ది కగోషిమా ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ ఆఫ్ వాల్కనాలజీ. కేరాఫ్ కగోషిమా ప్రిఫెక్చురల్ గవర్నమెంట్ 14-50 యమషితాకో, కగోషిమా సిటీ, కగోషిమా ప్రిఫెక్చర్-892.

వ్యవసాయం, అడవుల పెంపకం, చేపల పెంపకంవంటి వృత్తులతో ఆ నగరవాసులు జీవిస్తారు. గాజుపలకలతో రకరకాల వస్తువులు చేసే హస్తకళకు ఈ నగరం ప్రసిద్ధికెక్కింది. ఈ కళను వారు 'సత్ సుమాకిరికో' అంటారు. 1877 నుండి ఈ హస్తకళ ఆ నగరంలో పేరు పొందింది. యుద్ధంవలన గత 180 సంవత్సరాల నుండి ఈ పని మూలపడింది. బోహిమియా కూడా ఇటువంటి హస్తకళకు పేరు పొందింది. ఈ రకం గాజు వస్తువులు ఆదేశంలో మంచి ధరలకు అమ్ముడుపోతాయి. అగ్నిపర్వతాల వలన కలిగే భయాన్ని పోగొడితే ప్రజలింకా సుఖంగా బతుకుతారు.

# ఏరిన ముత్యాలు

★ ఆత్మను స్వార్థమనే కారాగారం బంధిస్తుంది.

— హెన్రీ వి.డాయక్

★ నదులన్నీ సాగరంలో కలిసినట్లు మనిషిలోని సద్గుణాలన్నీ అతని స్వార్థంలో కలిసి కరిగిపోతాయి. చివరకు సుగుణాలుపోయి స్వార్థమే మిగులుతుంది.

— రోష్‌ఫోకాల్డ్

★ నిరపరాధిని హింసించడం అతిభయంకరమైనది.

— అథర్వణవేదం

★ సామ్రాజ్యాలు, నాగరికతలు బయటి శత్రువులవల్ల కాదు. తమలోని హింసాప్రవృత్తివల్లనే పతనం అవుతాయి.

— నెహ్రూ

★ తేలికైన హృదయం చాలాకాలం జీవిస్తుంది.

వివేకానంద

★ ప్రసన్న హృదయం కలవారి ముఖం ఎప్పుడూ విప్పారి వుంటుంది.

— బైబిల్

★ హృదయంలో పసిపాప అమాయకత్వంకలవారెవ్వరూ ముసలివారు కారు.

— స్టీల్

★ మేధ మనిషిలో సగం మాత్రమే. హృదయమే అతని సర్వస్వం.

— రెవరోట్

★ అందమైన ముఖం సిఫార్సు పత్రమైతే, అందమైన హృదయం విశ్వాసపాత్రమైనది.

— బుల్వర్

★ హృదయంలేని మాటలకన్నా మాటలులేని హృదయమే మేలు.

— సుభాషిత రత్నావళి

★ హృదయానికి ఎలాంటి భాషాలేదు. హృదయం హృదయంతో మాట్లాడుతుంది.

— గాంధీజీ

★ క్షమ బ్రహ్మ, క్షమసత్యం, క్షమగతం, క్షమ భవిష్యత్తు, క్షమ తపస్సు, క్షమ పవిత్ర-యావత్ప్రపంచాన్ని ఈ క్షమ ధరిస్తున్నది.

— వ్యాసుడు

★ శత్రువును క్షమించడం అతన్ని జయించడమే.

— హజరత్‌అలీ

★ ఒక మనిషి గొప్పతనం అతని హృదయంలో వుంటుంది. మస్తిష్కంలోగానీ, బుద్ధిలోగానీ వుండదు.

— గాంధీజీ

★ స్వచ్ఛమైన హృదయం సూర్యునివలె ఎల్లప్పుడూ ప్రకాశవంతంగా వుంటుంది.

— వివేకానంద

చతుర ఫీచర్

# కార్టూన్నలో చరిత్రగతిని రికార్డ్ చేసిన శంకర్

"కార్టూనిస్టు శంకర్"గా పేరుపొందిన శ్రీ కేశవశంకర్‌పిళ్లేని భారతదేశంలో రాజకీయ వ్యంగ్య చిత్రకళకు పితామహునిగ చెప్పుకోవచ్చు. రాజకీయ వ్యంగ్య చిత్రాలు మనదేశంలో ప్రవేశించి 150 సంవత్సరాలు కాగా దాదాపు 50 సంవత్సరాలు శంకర్ ఈ రంగంలో విశేష కృషి చేశారు. 'శంకర్' ముద్రపడని యువకార్టూనిస్టు మనదేశంలో లేరనేవిధంగా చేశారు. ప్రముఖ ఆంగ్ల వ్యంగ్య చిత్రకారుడు డేవిడ్ చిత్రాలతో ప్రేరణ పొందినా అసలా పోలికే కనపడకుండా తన సొంత బాణీ ఏర్పాటుచేసుకున్నాడు శంకర్. ఎవరయినా భారతదేశపు వ్యంగ్య కళా చరిత్ర రాస్తే దాంట్లో మరిన్ని పేజీలు శంకర్‌కి కేటాయించక తప్పదు. ఆయన చేతుల మీదుగా ప్రాణం పోసుకున్న 'చిల్డ్రన్సు బుక్ ట్రస్ట్' 'అంతర్జాతీయ బాలల




శంకర్ స్వయంగా వేసికొన్న తన కారికేచర్. ఇది 'శంకర్స్ వీక్లీ' ఆపివేసిన తర్వాత విడుదలైన సావనీర్‌కు ముఖచిత్రంగా వచ్చింది.

*బ్లాక్‌మార్కెటింగ్, ముఖస్తుతి తదితర అవినీతికరశక్తులు అదుపుతప్పి ఇందిర "ప్రగతి"పథానికి ప్రతిబంధకమయ్యాయంటున్నారు శంకర్.*

బొమ్మల మ్యూజియం' బాలల పట్ల ఆయనకున్న ప్రేమను సూచిస్తాయి. నెహ్రూ తర్వాత బాలల్ని అమితంగా ప్రేమించి వారి విజ్ఞానం, వినోదాల కోసం తన జీవితం చివరిక్షణం వరకు కృషిచేసింది ఆయనొక్కరే అని చెప్పొచ్చు.

కేశవశంకర్‌పిళ్లే 1902 జులై 31న కేరళ రాష్ట్రంలోని 'కోయంగులం' అనే చిన్నపట్టణంలో జన్మించారు. చిరుతప్రాయంలోనే తండ్రి చనిపోయాడు. తల్లి మరో పెళ్ళి చేసుకోవటంతో పెదతండ్రి దగ్గర పెరిగాడు. పెన్సిల్ పట్టుకొనే వయసొచ్చేసరికి బొమ్మలుగీయటం ప్రారంభించాడు. కాళ్ళు టేబుల్‌పై పెట్టుకొని కునికిపాట్లు పడుతున్న హెడ్‌మాస్టర్ని సరదాకోసం చిత్రిస్తే ఆయనకు కోపమొచ్చి పెదతండ్రికి ఫిర్యాదుచేశాట్ట. ఆయనే శంకర్ వేసిన ఆ చిత్రాన్ని చూసి 'మావాడింత ప్రతిభావంతుడనితెలియదేఅని మెచ్చుకొన్నాడట'

త్రివేంద్రం విశ్వవిద్యాలయం నుంచి పట్టా పొందాక బొంబాయిలోని జె.జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్సుకి అప్లికేషన్ పెట్టుకోగా 'కళాకారుడి

'ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీల మోత' అన్నట్లు విదేశాల దృష్టిలో పైకి దాబుసరిగా కనిపిస్తున్నా స్వదేశంలో మాత్రం 'ఆయారాం, గయారాం'లదే రాజ్యం. హేళన చేస్తున్నాడు శంకర్.

కుండే లక్షణాలు నీకులేవ' ని సిటీవ్వలేదు. దాంతో లా డిగ్రీ చేశాడు. 1927లో లా చదువు గూడా అయిపోవటంతో బొంబాయిలోని సరోత్తమ్ మొరార్జీ షిప్పింగ్ కంపెనీలో ప్రైవేటు సెక్రటరీ ఉద్యోగంలో చేరాడు. స్వాతంత్ర్యోద్యమం అప్పుడప్పుడే శక్తి పుంజుకొంటోంది. శంకర్‌గూడా తన కుంచె ద్వారా ఈ ఉద్యమానికి రక్తి చేకూర్చాలనుకొన్నారు. ఆయన అనుకొన్నదానికంటే ఎక్కువే చేశారు. శంకర్ కార్టూన్లకు బ్రిటీష్ పాలకులు స్పందించక తప్పలేదు. 'బాంబే క్రానికల్', 'ఫ్రీప్రెస్ జర్నల్' పత్రికలలో బ్రిటీష్ పాలకులను ఎద్దేవాచేస్తూ ప్రచురించబడ్డ ఆయన క్యారికేచర్లు కాంగ్రెస్ కార్యకర్తలకీ ఆయనకీ దగ్గర సంబంధాలేర్పరచాయి. కొన్నాళ్ళపాటు "కాంగ్రెస్ బులిటెన్" ఆయన రూమునుంచే రహస్యంగా వెలువరించారట.

'హిందూస్తాన్ టైమ్స్' ఎడిటర్ శ్రీ పోథన్ జోసెఫ్ ఆహ్వానంపై ఆ పత్రికలో పొలిటికల్ కార్టూనిస్టుగా చేరి 14 ఏళ్ళు పనిచేశాడు. చివరికి 1932లో ఆ పత్రిక నుంచి బయటకొచ్చి 1948 లో 'శంకర్స్ వీక్లీ'ని కేవలం 10వేల




రూపాయల పెట్టుబడితో ప్రారంభించాడు. వీక్లీకి సర్వస్వం ఆయనే! ఆయనతోపాటు మరో ఇద్దరు ముగ్గురు యువకార్టూనిస్టులుండేవారు. తొలిప్రతి 13వేల కాపీలు వెంటనే అమ్ముడు పోయాయి. 1948 మే 23న వెలువడ్డ శంకర్స్ వీక్లీ ప్రారంభ సంచిక 'మీరు నవ్వక తప్పదు' అనే చిత్రంతో ప్రారంభమయింది. 1975లో ఆగస్టు 31న చివరి సంచికపై 'ఇక వెళ్ళిపోతున్నాను-ఆనందంగా మాత్రం కాదు' అనే ముఖచిత్రంతో శంకర్స్ వీక్లీ మూతపడింది. 27 ఏళ్ళపాటు దేశంలోని రాజకీయాలపై తన శరపరంపర కురిపించాడు వీక్లీద్వారా. "ఇంగ్లాండులోని 'పంచ్'కి, అమెరికాలోని 'న్యూయార్కర్'కివున్న గౌరవం మనదేశంలో శంకర్స్ వీక్లీకి దక్కింది. ముఖచిత్రం స్వయంగా శంకర్ వేసేవాడు. మొదటి పేజీలో 'న్యూస్ ఆఫ్ ది వీక్'గా వార్తల్లోని వ్యక్తిని చిత్రీకరించి రచనకూడా చేసేవాడు. మధ్యపేజీలో 'మార్చ్ ఆఫ్ టైమ్' క్రింద ఆ వారం రాజకీయ పరిణామాలపై నాయకులను వ్యంగ్యచిత్రాలతో ఎత్తిపొడిచేవాడు. రాజకీయ ప్రాముఖ్యంగల వ్యాసాలను బయటవారివి సైతం అచ్చేసేవాడు. ఇతర జర్నలిస్టులూ, రాజకీయ నాయకులు, గృహిణులు, విద్యార్థు




తీవ్రస్థాయిలోనున్న ద్రవ్యోల్బణాన్ని అరికట్టేందుకు కేవలం చిన్నచిన్న ఆర్డినెన్సులు వేస్తే ఫలితం శూన్యమని చెప్పేందుకుగాను ఏనుగును ఎలకల బోనులో పెట్టేందుకు చేసే వృథాప్రయత్నంగా చూపి నవ్విస్తాడు శంకర్.




**భారత కమ్యూనిస్టు పార్టీ నాయకులు చెకోస్లవేకియాపై రష్యా దాడిని సమర్థించిన వైనాన్ని దృష్టిలో ఉంచుకొని వేసిన కార్టూన్.**

లు రాసిన వ్యాసాలను సైతం అచ్చేసేవాడు. వీక్లీలో రాజకీయ నాయకుల క్యారికేచర్లేకాక- కుచ్చితులైన వ్యాపారస్తులనూ, ప్రభుత్వ అధికారులకూ 'బడాసాబ్' 'మేమ్‌సాబ్' శీర్షిక క్రింద వారికి గాడిద తలకాయలు తగిలించి చురకలంటించేవాడు.

శంకర్ వీక్లీ ప్రారంభించిన తొలిరోజుల్లో శంకర్‌కి ఏమాత్రం విశ్రాంతి దొరికేది కాదట. 'రాత్రింబవళ్ళు బ్లూ ఏప్రిన్ చుట్టూకొని డ్రాయింగ్ బోర్డుమీద దృష్టినిలిపేవాడని' ఆయన దగ్గర పనిచేసిన శామ్యుల్ అంటున్నారు. విపరీతంగా సిగరెట్లు తాగటం- ఐస్‌నీళ్ళు తా




**సోషలిస్టు పార్టీ - ప్రజా సోషలిస్టు పార్టీల విలీనాన్ని గురించి మరోసారి జరగనున్న చర్చలను నేపథ్యంగా తీసుకొని గీసిన కార్టూన్.**




పార్టీ టిక్కెట్ల కోసం ఆరాటపడుతున్న అభ్యర్థులకు, మద్దతుదారులకు సిఫార్సులు వేయకూడదని కాంగ్రెస్ సెంట్రల్ ఎలక్షన్ కమిటీ తన సభ్యులకు ఇచ్చిన ఆదేశాన్ని ఇలా చూపించారు శంకర్.

గటం ఆయన అలవాట్లు. స్నేహితులతో నరదాగా పేకాడటం ఆయన మరో నరదా!

స్వాతంత్ర్యానికి పూర్వం ఆయన హిందూస్తాన్ టైమ్స్‌లో వేసిన కార్టూన్లు చాలామంది దూషణభూషణలకు గురి అయ్యాయి. అప్పటి వైస్‌రాయ్ లార్డ్ విల్లింగ్టన్ మీద ఆయన పదేపదే కార్టూన్లు వేస్తూ విసిగించేవాడు. ఒకసారి వైస్‌రాయ్ ఆఫీసునుంచి శంకర్నివచ్చి వైస్‌రాయ్‌ని కలవవల్సిందిగా ఫోన్‌వచ్చింది. ఏదో ఉపద్రవం జరగనున్నదని శంకర్ గ్రహించాడు. ఏమయితే అవుతుందని ధైర్యం కూడగట్టుగొని వైస్‌రాయ్ భవనంలో అడుగు




కామన్‌వెల్త్ దేశాల కూటమిలో భారత్ చేరినపుడు సర్వసత్తాక సార్వభౌమాధికారంగల మన దేశం ఆ కూటమిలో ఎలా ఇముడుతుందని ప్రతిపక్షాలు అభ్యంతరపెట్టాయి. వాటి వ్యతిరేకతని విడ్డూరంగా చూస్తున్న నాటి దేశ సారథులు వీళ్ళు

























a) తనను కలవనున్న కరుణానిధిని ప్రధాని ఇందిరాగాంధీ 'అత్యవసర పరిస్థితి'ని అడ్డం పెట్టుకొని బెదిరిస్తుందా? అంటూ ఆలోచన రేకెత్తిస్తాడు శంకర్.

b) 'భారత్‌ని భారతీయుల దృష్టితో పరిశీలించండి' అన్న ఇందిర వ్యాఖ్యను కొంచెం మార్చి ఈ కళ్ళజోడుతో చూడండి అన్నట్లు చెబుతుంది కార్టూన్.

c) చవాన్ చేసిన వ్యాఖ్యను దృష్టిలో పెట్టుకొని 'మనం ఓ చిన్న సర్కస్ చేయాలిప్పుడు' అంటూ నవ్విస్తాడు శంకర్.

d) 'బీహార్‌లో వస్తున్న మార్పులకు ఈ వరదలే నాంది అనుకోవచ్చా?' అని విస్మయపడే జగ్జీవన్‌రామ్ కార్టూన్.

పెట్టాడు. వైస్రాయ్ వెంటనే ఆహ్వానించి ప్రేమతో కౌగలించుకొన్నారట- తన కార్టూన్ల్ని మెచ్చుకొంటూ. అయితే వైస్రాయ్ సతీమణి మాత్రం 'నా భర్త ముక్కు అంత అందంగా వుంటే, దాన్ని వికృతంగా, అంత పొడుగ్గా ఎందుకు చిత్రిస్తున్నారని వాదించిందట. అప్పుడామెకు కార్టూన్ చిత్రకళ గురించి వివ రంగా చెప్పి 'మీ భర్త ముక్కు అలాగే వేస్తాన న్నాడట. వైస్రాయ్‌గారు శంకర్‌తో ఏకీభవించి





ఆయనమీద వచ్చిన కార్టూన్ల ఒరిజినల్సు తీసు కున్నారట. భారతదేశపు ఆఖరి వైస్రాయి లార్డ్ వేవేల్ గూడా శంకర్ కార్టూన్లను బాగా అభిమానించేవారట, ఆయన్ని నొప్పించినా గూడా. 1940లో ఒక శివరాత్రి పర్వదినాన అప్పటి వైస్రాయ్ లార్డ్ విన్‌విత్‌గో చేతిలో పుర్రెపట్టుకొని శివతాండవం చేస్తున్నట్లు

చిత్రీకరించాడు. శంకర్ తన కార్టూ న్లు ఎడిటర్ ఆమోదం లేకుండా తన నిర్ణ యంపైనే అచ్చుకిచ్చేవాడు. అచ్చులో ఈ కా ర్టూన్ చూసిన ఎడిటర్ దేవదాస్‌గాంధీ ఖిన్ను డయ్యాడు. ఈ దెబ్బతో వైస్రాయ్ 'పేపరు

మూయించటం ఖాయమనుకొన్నాడు. దానికి భిన్నంగా వైస్‌రాయ్ భవనంనుంచి ఆ కార్టూన్ తను భద్రపరచుకోటానికి పంపమనే సంతోషకరవార్త వచ్చింది. బ్రిటీష్‌వారికి కొంత హాస్య చతురత ఉండబట్టి శంకర్ బతికిపోయాడు.

భారతీయ రాజకీయ నాయకులమీద వేసిన కార్టూన్లు ఆయన్ని అనేక సందర్భాల్లో ఇరుకున పెట్టాయి. రాజాజీమీద ఆయనేస్తున్న కార్టూన్లు ఆయన కుమార్తెకు బాధకలిగించేవిగా వుండేవి. ఆమె ఎవరో కాదు. తను పనిచేసే హిందుస్తాన్ టైమ్సు ఎడిటర్ భార్య. భార్య వొత్తిడికి తట్టుకోలేక బొంబాయినుంచి తను తిరిగొచ్చేదాకా రాజాజీమీద కార్టూన్లు వెయ్యొద్దని కోరాడు. దాన్ని లెక్కచెయ్యకుండా మర్నాడే విప్పారిన మొహంతో చిరునవ్వు చూపిస్తూ రాజాజి కార్టూన్ వేశాడు. ఏ ఎడిటరూ తన్ని శాసించలేదని శంకర్ అంటాడు. తన కంటే తక్కున అనుభవంగల దుర్గాదాస్ హిందుస్తాన్ టైమ్సు ఎడిటరు కావటంతో శంకర్ టైమ్సునుండి తప్పుకొన్నాడు. వ్యక్తుల్ని క్షుణ్ణంగా పరిశీలించాక వారిని క్యారికేచర్చు చెయ్యటం శంకర్‌కి అలవాటు. 1943లో బెంగాల్‌లో ఆహారపు కరువు ఏర్పడింది. జె.పి శ్రీవాత్సవ ఆహారపు మంత్రి స్థూలకాయుడు. ఆయన్ని చూద్దామని శంకర్ ఎన్నిసార్లు వెళ్లినా గంటల తరబడి నిరీక్షించినా ఆయన దర్శనమయ్యేదికాదు. శంకర్ తన ఆగ్రహాన్ని వ్యక్తంచేసేసరికి శ్రీవాత్సవగారి సెక్రటరీ ఆయన్ని చూసే ఏర్పాటుచేశారు. అప్పుడాయన నగ్నంగా వొళ్లుపట్టించుకొంటున్నారట. అప్పటినుంచి ఆయన్ని బట్టలులేకుండా నగ్నంగా చిత్రించటం మొదలెట్టాడు. దాన్ని భరించలేని శ్రీవాత్సవ పనిమీద మద్రాసులో వుంటున్న పోథేన్ జోసెఫ్‌ని వెంటనే పిలిపించి శంకర్ కార్టూన్ని ఆపించమని కోరాడట. వైస్‌రాయ్‌గార్నికూడా ఈ తమాషా ఆపించపల



*"సిటీలో ఉంటున్నప్పటికీ నేను గ్రామ సేవికనే" అంటూ ఓ గాడిదతో చెప్పించి అలాంటి వ్యక్తులకు చురకలు పెట్టాడు శంకర్.*

*"అరె, నువ్వే ఫ్రెండ్‌షిప్ అసోసియేషన్‌లోనూ సభ్యుడివి కావు. మరి నీకెలా దొరికిందబ్బా ఇంత మంచి స్కాచ్?" అని ఆనాటి ఫ్రెండ్‌షిప్ అసోసియేషన్‌ల గుట్టును రచ్చకీడ్చాడు శంకర్.*

---

సిందిగా శ్రీవాత్సవ అభ్యర్థించగా వైస్రాయ్ దాన్ని త్రోసిపుచ్చాడట.

పార్లమెంటులో ఒకరోజు ప్రతిపక్షం-అధికార పక్షంవాళ్లు పెద్దఎత్తున కేకలేసుకొన్నారు. ఈ సంఘటల్ని శంకర్ ఓ బాత్‌రూము నాట్యాన్ని పెట్టి అందరి తలలకు గాడిద తలలు తగిలించాడు. దాంతో పార్లమెంటు సభ్యులు ఆగ్రహించి శంకర్ క్షమాపణ చెప్పాలని పట్టుబట్టారు. శంకర్ తక్కువ వాడేమీకాదు. మరో కార్టూన్ గీస్తూ కొందరికి కుక్కలూ, కోతుల తలలు తగిలించి 'కొందరు పార్లమెంటు సభ్యులను గాడిదలనటం తప్పే' అని రాశాడు. దాంతో వాళ్లు నోరుమూశారు.

నెహ్రూకి-శంకర్‌కి మధ్య ప్రత్యేక స్నేహముంది. 1948లో శంకర్స్ వీక్లీని ప్రారంభిస్తూ 'నన్నుగూడా మినహాయించకు శంకర్' అన్న మాట తు.చ తప్పకుండా అనుసరించాడు.




శంకర్స్ వీక్లీ ప్రతిదాంట్లోనూ నెహ్రూమీద చురకలుండేవి. ఒక వారం ఆయనమీద కార్టూన్ లేకపోతే నామీద కోపం వచ్చిందా శంకర్ అనేవారట. నెహ్రూమీద ఆయన వేసిన 1500 కార్టూన్లనుంచి 400 ఎంపికచేసి 'డోన్ట్ స్పేర్మి శంకర్' అనే పేరుతో చిల్డ్రన్స్ బుక్ ట్రస్ట్ తరఫున ఈ పుస్తకం వేశాడు. సోషలిస్ట్ భావాలుగల శంకర్ నెహ్రూ భావాలను తన కార్టూన్ల ద్వారా సజీవ పరిచాడు. శంకర్ రోజుల్లో పురుషోత్తమదాస్ టాండన్, గోవింద్ వల్లభ్‌పంత్, రాజగోపాలాచారి, గోపాలస్వామి అయ్యంగారు, మహావీర్‌త్యాగిలాంటి రూపణ్యంలో వైవిధ్యంగల వ్యక్తులుండేవారు. హాస్యానికి రాజ్ నారాయణ్, రామ్‌మనోహర్‌లోహియాలుండేవారు.ఇప్పుడలాంటి నాయకులేరి? బ్రిటిష్ పాలకుల్ని ఆటలు పట్టించిన శంకర్ 1975 ఎమర్జన్సీలో శాశ్వతంగా శంకర్స్ వీక్లీని మూసేశాడు. దరిమిలా చాలామంది వీక్లీని తిరిగి ప్రారంభించమని అడగ్గా శంకర్ లేకుండా శంకర్స్ వీక్లీ ఎలా వుంటుందన్నాడు. పైగా హేమాహేమీలకు భయపడని శంకర్ ఎమర్జన్సీవల్ల ఏమీ చెయ్యలేకపోయేవాడు. అప్పటికే





"కొందరు మహనీయుల్లాగే నేనూ మన దేశ సంస్కృతిని కాపాడతాను" గప్పాలు కొట్టుకునే నేటి రాజకీయవేత్తలకూ వర్తిస్తుంది ఈ కార్టూన్.

ఆయన వయస్సు 70 దాటింది.

1967లో దేశంలోకెల్లా పెద్దదయిన బాలల గ్రంథాలయాన్ని నెలకొల్పారు. ఇదికూడా నెహ్రూ భవనంలోనే చోటుచేసుకుంది. ఇందులో పదకొండు భారతీయ భాషల, 22 విదేశీ భాషల పుస్తకాలు 20 వేలదాకా వున్నాయి. చిల్డ్రన్స్ బుక్ ట్రస్టు తరఫున పిల్లలకు 100 పుస్తకాలు ప్రచురించాలని ఆయన ఆశయం. ఆయన స్వయంగా 50 గ్రంథాలు రచించాడు. మరొకరితో కలిసి 15 గ్రంథాలు రాశాడు. అంతర్జాతీయ బాలల కేంద్రాన్ని ఏర్పాటు చెయ్యాలనే కోరిక నెరవేర కుండానే కన్నుమూశాడు. ఇక్కడ ఆర్ట్ గ్యాలరీ, హాబీ కేంద్రం ఏర్పాటుచేస్తే ప్రపంచ దేశ బాలలు ఒకచోటకూడి ఒకరినుంచి మరొకరు నేర్చుకోగలరని ఆయన అభిప్రాయం.

1954లో హంగేరి దేశరాయబారి ఒక ముద్దుల బొమ్మనొకదాన్నిచ్చి దీన్ని అంతర్జాతీయ




పార్టీలో క్రమశిక్షణ లోపించి ఇష్టారాజ్యంగా ఎవరికివారు వ్యవహరిస్తున్నారని చెప్పేందుకు ఈ 'క్విక్ మార్చ్' కార్టూనే ఖచ్చితంగా సరిపోతుంది.




అవినీతి, బంధుప్రీతి, లంచగొండితనం, చీకటి వ్యాపారం...లో బందీ అయిపోయిన కాంగ్రెస్‌ని రక్షించేందుకు ప్రధాని నెహ్రూ, హెూంమంత్రి పటేల్ పడుతున్న పాట్లని సమర్థవంతంగా చూపిస్తుంది కార్టూన్.




"కొందరు కాంగ్రెస్‌వాదులకే తమ పార్టీ మీద నమ్మకం సన్నగిల్లడం కాంగ్రెస్ దురదృష్టం" - సంపూర్ణానంద్ చేసిన వ్యాఖ్యకు తన చిలిపితనం జోడించి కార్టూన్ రూపమిచ్చాడు శంకర్.



ఓటు వేసి గెలిపించేంతవరకూ వంగివంగి దండాలు పెట్టిన నాయకులు గెలిచాక ఓటర్నించి దండలు, దండాలు దండుకోడంతోబాటూ బొక్కసంనించి సొమ్మునూ గుంజుకుంటారని చెబుతుంది కార్టూన్.

బాలల చిత్రలేఖనపోటీలో గెల్చినవారికిబహుమతిగా యివ్వమన్నారు. శంకర్ని ఆ బొమ్మ ఎంతో ఆకర్షించింది. దానికి బదులు మరో బొమ్మ బహుమతిగా ఇచ్చి దాన్ని తనవద్దే వుంచుకొన్నాడు. ఆ ప్రేరణతో దేశదేశాల బొమ్మలు సేకరించి ఒక ప్రదర్శన ఏర్పాటుచేశాడు. ఆ ప్రదర్శనను చూసిన పండిట్ నెహ్రూ తన విదేశ పర్యటనల్లో బహుమతిగా ఇచ్చిన బొమ్మలనన్నింటినీ శంకర్‌కి పంపేవారు. అదే సంప్రదాయాన్ని మనదేశ, విదేశ రాయబారులు అనుసరించగా వచ్చిన బొమ్మలు న్యూ ఢిల్లీలోని బహదూర్‌షా జఫర్‌మార్గ్‌లో ప్రత్యేకంగా నిర్మించిన నాలుగంతస్తుల భవనంలో కొలువు దీరి వున్నాయి. ఈ బొమ్మల మ్యూజియమ్‌లో వంద దేశాలనుంచి సేకరించిన ఆరువేలకు పైగా బొమ్మలూ, చిత్రలేఖనాలూ వున్నాయి. ఏటా 50 వేలమంది దీన్ని దర్శిస్తుంటారు. నెహ్రూపై అభిమానం కొద్దీ దీనికి 'నెహ్రూభవనం' అని పేరుపెట్టాడు శంకర్.

— వెనిగళ్ళ వెంకటరత్నం




విదేశాల నుంచి లభించే సాయం ప్రభుత్వానికికాక ప్రయివేటు వర్గాల చేతుల్లోకే పోతోందని చెప్పే వ్యంగ్య రేఖాచిత్రం.

THE ARTIST

PLANNIN

రంగూ, వాసనా లేని ప్రణాళికలకు కొత్తరంగులు అద్దుతున్న చిత్రకారునిగా శంకర్‌కు ఇష్టుడైన నెహ్రూ.



మద్రాసునగరం కోసం పోటీపడిన ఆంధ్ర-తమిళనాడుల యుద్ధానికి ఈ రూపమిచ్చాడు శంకర్.




ఫోర్ పవర్ కాన్ఫరెన్స్‌ని ఆటపట్టిస్తూ శంకర్ గీసిన కార్టూన్.




ప్రాచ్యదేశాల మూడో కూటమికోసం రామమనోహర్ లోహియా డిమాండ్ చేయడాన్ని హాస్యరసస్ఫోరకంగా చూపాడు శంకర్.




రాజకీయపార్టీలు నిధులకోసం బడాబడా వ్యాపారుల వంచన చేరడాన్ని ఇలా ఎకసక్కెం చేశాడు శంకర్.

SHANKAR

మనవిద్యావ్యాప్తికోసం చేస్తున్న సన్నాహాలు త్వరలోనే వేగాన్ని పుంజుకోబోతున్నాయని మౌలానా ఆజాద్ చేసిన వ్యాఖ్యకు శంకర్ చెప్పిన భాష్యం.




సరైన గణాంక వివరాలను సేకరించేందుకై ప్లానింగ్ కమిషన్ ఓ చిట్కా రూపొందించిందన్నవార్తకు ఇది కార్టూన్ కల్పన.

అగ్రరాజ్యాలతో ఇరువైపులా భుజం కలిపి విలవిలలాడుతున్న నెహ్రూ అవస్థకు ఈ కార్టూనే దర్పణం.




రాజభరణాల రద్దుకోసం ప్రభుత్వం ప్రయోగిస్తున్నచిట్కాని స్పష్టంగా ఎత్తి చూపుతుందీ కార్టూన్.



భాష ఆధారంగా రాష్ట్రాల విభజనచేస్తే దేశసమైక్యత దెబ్బతింటుందన్న భయాలు వెల్లడైనప్పుడు వచ్చిన కార్టూన్.




కనీసావసరాలైన తిండి, గుడ్డ, ఇల్లు కల్పిస్తామని చెప్పిగెలిచాక ప్రజల్ని మరచిపోయే "ప్రజానాయకు"ల నగ్నస్వరూపం.

MARS

BANGLADESH
TO REMAIN
SECULAR AND
DEMOCRATIC

SHANKAR

అంగారకునిపైకి అమెరికా వ్యోమనౌక పంపడాన్ని విని అదిగమ్యం చేరేసరికి బ్రెజ్నేవ్‌దాన్ని వలకరిస్తాడని చెబుతాడు శంకర్. ఇదుగో వీడిపని పట్టటానికిదే ఆఖరి ఛాన్సంటున్న శంకర్‌గారి గాడిపలు- ఆఖరి సంచికలోని కార్టూన్.




వినయవిధేతలపేర ఉచ్చునీచాల్ని మరచి ప్రవర్తించే నాయకులకనువిప్పుకోసం ఈ కార్టూన్.

ALL UP!
PLAN
CONGRESS PLAN
DEFENCE PLAN
ECONOMIC
REHABILITATION PLANS
PLAN FOR PLANS
DAMODAR VALLEY PLAN
WIFE'S PLAN
DAUGHTER'S PLAN
CHILDREN'S PLAN
AND THERE IS NOBODY WITHOUT A PLAN

రకరకాల ప్రణాళికల్ని రూపొందించే సందర్భంలో శంకర్‌చేసిన చిలిపికార్టూన్‌వ్యాఖ్య.

మౌలిక సూత్రాల విషయంలో కూడా వైఫల్యం చెందడంవల్ల కాంగ్రెస్ ప్రజలకు మరీదూరమైపో తోందని కలవరపడుతున్న నెహ్రూ, పట్టాభి.




ఆమవుతప్పిన ధరలపై వినియోగదారులే తిరగబడాలని చెప్పిన మొరార్జీని ధరలే భయపెట్టి తరుముతున్న కార్టూన్.




రాజ్యాంగ సవరణబిల్లుమీద ప్రతిపక్షంపై నెహ్రూ ప్రభుత్వం సాధించిన ఘనవిజయాన్ని ఇలా చూపాడు శంకర్.

85 దేశాలనుంచి సేకరించిన వివిధ బొమ్మలతో ఇంటర్నేషనల్ డాల్స్ మ్యూజియంను స్థాపించాడు శంకర్. ఆ ఆలోచనకు ప్రేరణ ఈ బొమ్మే!




పబ్లిక్ రంగం, ప్రయివేటురంగం, భాషా ప్రయుక్తరాష్ట్రాలు, తదితరాల్ని అదుపు చేయడం ప్రభుత్వానికి సర్కస్‌లా మారిందంటాడు శంకర్.

HANKAR'S WEEKLY



PARTING–NOT WITHOUT SORROW



'ఇకవెళ్లిపోతున్నాను- ఆనందంగా మాత్రంకాదు' అని శంకర్స్ వీక్లీ తుది సంచికపై వచ్చిన ముఖచిత్రం.

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 2. | Periodicity of its Publication | : | Monthly |
| 3. | Printer's Name | : | **RAMOJI RAO** |
| | Whether citizen of India | : | Yes |
| | If foreigner, state the country of origin | : | – |
| | Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 4. | Publisher's Name | : | **RAMOJI RAO** |
| | Whether citizen of India | : | Yes |
| | If foreigner, state the country of origin | : | – |
| | Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 5. | Editor's Name | : | **RAMOJI RAO** |
| | Whether citizen of India | : | Yes |
| | If foreigner, state the country of origin | : | – |
| | Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 6. | Names and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS.**
**Sd/-RAMOJI RAO**
Publisher

Date: March 1, 1990

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications. Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 52685, Visakhapatnam 52211, Tirupati 5291.

# ఉమ్మడి శక్తి ప్రభావమే అమోఘం
# 5 వేళ్లనూ కలిపి పిడికిలి బిగిస్తే వాటి శక్తి అపారం.

## జండూ పంచారిష్ట

### మీ జీర్ణాశయాన్ని సవ్యంగా ఉంచి మీకు మంచి ఆరోగ్యం చేకూర్చుతుంది

జబ్బుల లక్షణాలు వేరు-వేరయినా, వాటికి మూల కారణం సాధారణంగా ఒక్కటే. జీర్ణశక్తి లోపించడం. ఫలితమే అనారోగ్యం.ఇప్పుడు జీర్ణశక్తి కోసం వాడండి జండూ పంచారిష్ట.

గొప్ప 5-ఇన్-1 జీర్ణకారి టానిక్.మీ చేతి ఐదు వేళ్లలాగే జండూ పంచారిష్ట జీర్ణసంబంధమైన సమస్యలను సమర్థవంతంగా, సురక్షితంగా పరిష్కరిస్తుంది. అజీర్తి,అధిక భోజనం, కడుపులో వాయువు, తేపులు - ఈ బాధల నుంచి ఉపశమనానికీ, సున్నితంగా పనిచేసే విరేచనకారిగానూ, ఆకలిని వృద్ధి పరచడానికి కూడా ఇది ప్రభావవంతంగా పనిచేస్తుంది. 5 వేళ్లనూ కలిపితే ఆ పిడికిలిలోని శక్తి ఎంత అపారంగా వుంటుందో, అలాగే, జండూ పంచారిష్టలోని ఆయుర్వేద ఔషధ గుణాలు ఉమ్మడిగా కూడి మీ జీర్ణకోశాన్ని చక్కబర్చి, బలం చేకూర్చుతాయి.

క్రమం తప్పక జండూ పంచారిష్ట సేవించండి. మీ సామాన్య ఆరోగ్యం ఎలా వృద్ధి చెందుతుందో మీరే చూడండి.

మరి ఆరోగ్యమే కదా మహాభాగ్యం!




## జండూ పంచారిష్ట

*ఐదు ఔషధములతో కూడిన జీర్ణకారి టానిక్*



450 మి. లీ. మరియు 200 మి. లీ. సైజులలో లభిస్తుంది.

CLARION/B/ZP/20/173 TEL

నేడు మీరు యవ్వనంలో ఉన్నారు.
పరిపూర్ణమైన ఆరోగ్యం మీ అదృష్టం.
సిరిసంపదలు మీ కష్టార్జితం. రేపటిగురించిన ఆత్మవిశ్వాసం మీ సొంతం.

కానీ... ఊహించుకోనివి జరగటమే జీవితం...
కొన్ని సంఘటనలు మీకు ఆనందాన్నిస్తాయి.
కొన్ని మిమ్మల్ని సంభ్రమపరుస్తాయి.
మరికొన్ని విచారంలోనూ ముంచుతాయి.

జీవితంలో ఎన్నెన్నో సమస్యలు ఎదురుకావచ్చు. ఆ సమస్యలలో చాలావాటికి డబ్బు ఒక్కటే పరిష్కారమని మీకు తెలును. అందుకే ఆర్థికపరమైన భద్రతకోసం, మార్గదర్శి ద్వారా డబ్బు ఆదాచేయండి.

మీ అవసరాలన్నిటికీ తగినవిధంగా మార్గదర్శిలో ఎన్నెన్నో పథకాలున్నాయి. మీ డబ్బుకు మార్గదర్శిని మించిన భద్రతలేదు.

మార్గదర్శి చిట్‌ఫండ్స్‌కు 25 సంవత్సరాల చరిత్ర ఉంది సాలీనా 120 కోట్ల రూపాయల బిజినెస్ టర్నోవర్‌తో, 80 కోట్ల రూపాయల ఆక్షన్ టర్నోవర్‌తో భారతదేశంలోకెల్లా నంబర్ 1 చిట్‌ఫండ్ సంస్థగా మీ ముందు నిలుస్తోంది — మార్గదర్శి

అన్నిటా అగ్రగామి అయిన మార్గదర్శితో కలిసి నడవండి. మరిన్ని వివరాలకు మా ఏజెంట్లను కలవండి. లేదా మమ్మల్ని సంప్రదించండి.

డబ్బుకోసమేనా మీ చింత? మార్గదర్శి ఉన్నది మీ చెంత!








## మార్గదర్శి

చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్
రిజిస్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీస్:
అబిడ్ సెంటర్, హైదరాబాద్- 500 001

# నేడు మీదే...
# కానీ రేపటి మాటేమిటి?

KIRON/MCF/10189